# క్షేత్రయ్యపదములు

సంపాదకులు

మంచాళ జగన్నాథరావు

ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ

# తొలి పలుకు

నృత్య, సంగీత, నాటకోత్సవాలను నిర్వహించటం, ఆయా కళలలో శిక్షణాలయాలకు సాంస్కృతికసంస్థలకు, నిస్సహాయ స్థితిలో గల వృద్ధ కళాకారులకు ఆర్థిక సహాయం చేయటం, మరుగున పడిపోతున్న మన సంప్రదాయ, జానపద కళారూపాల పునర్వికాసానికి కృషి చేయటం మున్నగు కార్యక్రమాలతోపాటు ఆయా రంగాలలో పరిశోధన చేయించి, గ్రంథాలు ప్రచురించే కార్యక్రమాన్ని కూడా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ చేపట్టింది ఈ పథకం క్రింద సంస్కృతంలోని ప్రామాణిక సంగీత, నృత్య శాస్త్రగ్రంథాలను అనువదింపజేసి ప్రచురిస్తున్నాము ఇంతవరకు 'సంగీత రత్నాకరం' మొదటి భాగము, 'నృత్త రత్నావళి', 'భావప్రకాశనము' ప్రచురించాము

ప్రాచీన సంస్కృత గ్రంథాల అనువాదాలు చేపట్టటమేకాక తెలుగునాట సంగీత, నృత్య, నాటక కళా వికాసాలను తెలియపరిచే స్వతంత్ర గ్రంథాలను ప్రచురించాలని కూడా అకాడమీ సంకల్పించింది మొదట నాటక కళాభివృద్ధికి దోహదకారులైన తెలుగు నాటకకర్తలను గురించి, నాటక కర్తలుగా చిలకమర్తి, తిరుపతి వెంకటకవులు, ధర్మవరం, కోలాచలం గురించిన గ్రంథాలను వెలువరించాము ప్రసిద్ధులైన ఇతర నాటక కర్తలను గురించి, సంగీత నృత్య కళా కోవిదుల గురించి కూడా గ్రంథాలు ప్రచురించ తలపెట్టాము

ఇంతేకాక ప్రస్తుతం ప్రతులు లభించని 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని' వంటి అమూల్య గ్రంథాలను పునర్ముద్రించడానికి పూనుకొని, తొలిసంపుటమును ప్రచురించాము మిగిలిన మూడు సంపుటాలు, ప్రథమాఖ్యాన పుస్తకము త్వరలో వెలువరించగలమని ఆశిస్తున్నాము

సుప్రసిద్ధ వాగ్గేయకారుల రచనలను వరుసగా ప్రచురించాలన్న పథకం క్రింద ప్రథమంగా 'క్షేత్రయ్య పదములు' వెలువరిస్తున్నాము ఈ గ్రంథ ప్రచురణకు క్షేత్రయ్య పదములను స్వరసహిత ముగ కూర్చి మాకు అందజేసిన శ్రీ మంచాళ జగన్నాధరావుగారికి ధన్యవాదములు తెలియ పరుస్తున్నాము.

కె ఆర్. పరమహంస
స్పెషల్ ఆఫీసర్
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

# ప్రశస్తి

ప్రాచీన కాలము నుండి అసంఖ్యాకములైన గేయ రూపములు ప్రచారంలో వున్నాయి పురందరదాసులవారు వరవడి పెట్టిన దాసకూట రచనలలో పల్లవి, అనుపల్లవి, చరణం అనే మూడు నిర్దుష్టమయిన భాగాలు వుంటాయి తరువాత వచ్చిన కీర్తనలకు, పదములకు స్వరూప స్వభావములలో యీ దాసకూట రచనలే మార్గదర్శకాలు అనడంలో సందేహంలేదు పద రచనకు ప్రప్రథమముగా క్షేత్రజ్ఞులే పూనుకొన్నారని చెప్పవచ్చు

క్షేత్రజ్ఞులు జీవించిన కాలము, ఆనాటి సామాజిక పరిస్థితులు మనకు తెలిసినప్పటికీ, వారిజన్మస్థలము, తల్లిదండ్రులు, విద్యాభ్యాసము మొదలగు విషయాలను గురించి మనకు ఇదమిత్థమని తెలియదనే చెప్పాలి ఒక మహాభక్తునిగా 17 వ శతాబ్దంలో దక్కను ప్రాంతంలోని అనేక పుణ్యక్షేత్రాలను దర్శించారు క్షేత్రజ్ఞులు ఆంధ్రదేశంలో మువ్వ అనే గ్రామంలో పుట్టి తంజావూరు, మధుర మొదలైన దక్షిణ ప్రాంతాలకు తరలి వెళ్ళివుంటారని చారిత్రక విషయాలనుబట్టి నిర్ణయించబడింది వారిని సన్మానించడానికి మహారాజులు ఒకరితో ఒకరు పోటీపడ్డారు వారు నాలుగు వేలకుపైగా పదాలు వ్రాశారు, అయితే వాటిలో పదవవంతు మాత్రమే మనకుదక్కాయి

అలౌకిక శృంగార రసాన్ని కాల్పనిక భావవ్యక్తీకరణగా మాత్రమేకాక, వివిధభావ సౌందర్యములను, గుణస్వభావములను చక్కగా ప్రదర్శిస్తూ మానవరూపంలోవున్న వ్యక్తులమధ్య కలిగిన అనుభూతులుగా సునిశితములైన పదరచన కావించారు క్షేత్రజ్ఞులు రసజ్ఞాన విద్యా పరిధిలో శృంగారరసము ప్రధాన కథావస్తువు క్షేత్రజ్ఞుని పదములలో నాయకనాయకీ భావములను, వివిధ భావ అవస్థలను, రసములను చక్కగా వ్యక్త పరచు రచనలే అత్యధికముగానున్నవి అనన్యసామాన్యములైన రసములను, సన్నివేశములను, భావములను ఔచిత్య విమర్శతో ప్రదర్శించుటలో క్షేత్రజ్ఞులు సిద్ధహస్తులు అవస్థానభేదములను చక్కగా వర్ణించి, తమ రచనలలో

క్షేత్రజ్ఞులు తమ బహుముఖ ప్రతిభను మనకు అందజేశారు. భక్తి, శృంగార ప్రధానములైన వీరి పదములలో పల్లవి, అనుపల్లవి, చరణం అనే మూడు భాగాలు వుండి, అభినయానికి లక్ష్యములుగా అలరారుతున్నాయి. అంగన్యాస, కరన్యాస, ముఖభావ భంగిమలను నిదానముగా ప్రదర్శించుటకు అనువుగా యీ పదములను విలంబకాలములో గానము చేయుదురు. అందుచేత రశికులు పదముల లోని వివిధ భావములను చక్కగా ఆకళింపు చేసుకొని ఆనందించుటకు అవకాశము కలుగుతుంది. ప్రతిపదము యొక్క అర్థమును చక్కగా అవగాహన చేసుకున్నప్పుడే కదా ఆనందించునది? ఈ పదముల పద్ధతి, యిందలి శాస్త్రవిషయములు సాంప్రదాయ సిద్ధములైనవి. ఈ పదములలోని అపూర్వరాగ భావసంచారములను, సాహిత్య భావములను క్లిష్టమైన లయను, కర్ణపరంపరంగా విని ఆకళించుకొని పాడవలసినదే గాని, తోచిన విధముగా కంఠస్థముచేసి పాడకూడదు.

మా గురువులు, గౌరవనీయులు మైసూరు వాస్తవ్యులు కీ॥ శే. బిడారం కృష్ణప్పగారు పదములు పాడుటలో వన్నెకెక్కిరి. నా మనసులో యిప్పటికీ ఆ మధురానుభూతులు మెదలు తూవుంటాయి. పదములు విలంబ కాలమున పాడుతూ ఒక్కొక్క మాట ఉచ్చరించుటలో నియమ బద్ధముగా రావలసిన చోటకాక, క్షణికం ముందుగాని వెనుక గాని కొంచెం దురితకాలంలో ఉచ్చరిస్తూండేవారు. యీ పద్ధతి ఇప్పుడు వినవచ్చుటలేదు. తాళము, లయ క్షుణ్ణముగా తెలిసిన రసజ్ఞులకు ఆ ఆనందానుభూతి అనిర్వచనీయము. పదములు పచ్చి శృంగార పూరితములు మాత్రము కావు. విమర్శనా జ్ఞానము గల విద్యావంతులకు యీ పదములు ఆధ్యాత్మికము, భక్తి పూరితము అయిన రచనలు. భక్తి తత్వాన్ని ప్రచారం చెయ్యడానికి శబ్దాన్ని చక్కనిమార్గంగా వినియోగించారు.

క్షేత్రజ్ఞుల పదములను చక్కని ప్రాచీన సాంప్రదాయ పద్ధతిని స్వరతాళ వరుసలతో సంగీతాభిమానులకు అందించి ఉభయగాయన విద్వాంసులు శ్రీ మంచాళ జగన్నాధరావు గారు గొప్ప సంగీతసేవచేసి తమ జీవితధ్యేయాన్ని సాధించగలిగారు. ఘంటా, ఖండె, మంగళకైశికి, మారువ, సైంధవి, సింధూరతిలక మొదలగు అపూర్వ రాగాలలో వారు మనకు అందించిన పదములు యుక్తములైన రాగ లక్షణములను వివరించిన పద్ధతి, వారి అపారజ్ఞానము, సునిశిత విమర్శనాశక్తి, అన్నిటికన్న మిన్న అయిన వారి నిష్పాక్షికత మనకు వ్యక్తమవుతాయి. 'దసదప', 'సగమగస', మరియు సౌరాష్ట్రి రాగమంద్ర సంచారములు; కాపి, హిందోళ, శ్రీ, సురటి, శహాన, రాగముల సాంప్రదాయము నిర్వివాదాంశములు, సుబోధకములు. శ్రీ మంచాళవారి నిస్వార్థమైన యీ కానుకను ముందు తరముల వారు గౌరవింతురు గాక. ఈ చారిత్రాత్మక సందర్భమున ప్రశంసిస్తూ కొద్దిమాటలు వ్రాయడానికి నాకు దొరికిన యీ అవకాశాన్ని ఒక అపూర్వమైనదిగా భావిస్తున్నాను.

ఆర్. ఆర్. కేశవమూర్తి
చైర్మన్, కౌన్సిల్ ఆఫ్ ఎక్స్పర్ట్స
కర్నాటక గానకళా పరిషత్, బెంగుళూరు

# సాహిత్య ప్రశస్తి

ఏ వాఙ్మయమందైనను పద్యములకంటె పదములో గేయములో ముందవతరించునని విమర్శకుల తలంపు ఆంధ్రమునఁగూడ నన్నయకు ముందును దరువాతను కొన్ని గేయములు రచింపఁబడియుండును కాని యవియేవియు నిప్పుడు లభించుటలేదు మనకిప్పుడు లభించుచున్న గేయములలో తాళ్ళపాక అన్నమాచార్యులు రచించినవే ప్రాచీనములును ప్రసిద్ధములును, దక్షిణాంధ్ర యుగమునకు స్వర్ణయుగమని చెప్పఁదగినట్టిది వేలకొలఁది పదములును కీర్తనలును రచించి యొకవంక గేయ వాఙ్మయమునకును వేఱొకవంక సంగీతకళకును అపారగౌరవ ప్రతిష్ఠలు కలిగించిన క్షేత్రయ్యయు త్యాగయ్యయు నీ యుగమున నవతరించినవారే త్యాగయ్య కృతులు కేవల శ్రవ్యములైనట్టివి, క్షేత్రయ్యపదములు శ్రవ్యములే కాక అభినయానుకూలములగుటచే దృశ్యతా గౌరవమును గూడ పొందినట్టివి సంగీతము, సాహిత్యము అభినయము అను కళలు మూఁడింటికిని కూడలి యగుటచే త్రివేణీసంగమ మని చెప్పఁదగిన దాతని రసవత్పద సముదాయము

ఆంధ్రము నందలి గేయములను కృతులు, కీర్తనలు, తత్త్వములు, పదములు, జావళీలు, పాటలు అని యాఱువిధములుగా విభజింపవచ్చును. ఇందు పదము, జావళీ అను రెండును అభినయానుకూలములును శృంగార రస ప్రధానములు నైన గేయములే కాని జావళీయందు శృంగారమను పదమునందు ప్రౌఢతయు ప్రాధాన్యము వహించును పదములు రాగ తాళ విలంబముతో కూడియుండును రాగవిలంబము వలన గాయకుఁడు వానిని పాడునప్పుడా రాగమునకు సంబంధించిన సూక్ష్మాతి సూక్ష్మ వివరములను గూడ ప్రదర్శించుట కవకాశముండును అట్లే తాళ విలంబము వలన నభినయించు పాత్ర తన యంగ భంగిమల ద్వారా భావ విశేషములను వివరముగా ప్రదర్శించుటకు వీలేర్పడును క్షేత్రయ్య పదములలో నుత్తమ పదముల కుండవలసిన

లక్షణము లన్నియు పుంజీకృతములై యుండును. అతనిచేత పదము పరిణతిపరాకాష్ఠ నందినది అతఁడు "వేడుకతో నడచుకొన్న విటరాయఁడు" అను పదమున నాలుగువేల యొకవంద పదములు రచించినట్లు తెల్పియున్నాఁడు అవిగాక యతఁడు రచించిన పదములు మఱికొన్ని యుండవచ్చును వానిలో సుమారు నాలుగువందలు మాత్రమే యిప్పుడు లభించుచున్నవి

క్షేత్రయ్య వట్టి పదకర్త మాత్రమే కాదు, అలంకార శాస్త్రముతో గాఢమైన పరిచయము సంపాదించి యందు నూత్న మార్గములు త్రొక్కఁజాలిన సామర్థ్యము గలవాఁడు క్రీ శ 15వ శతాబ్దిలో భానుదత్తుఁడను పండితుఁడు సంస్కృతమున రసతరంగిణి, అలంకారమంజరి యను లక్షణ గ్రంథములను రచించి, యందు పూర్వాలంకారికులు చూపని నాయికానాయక భేదములు కొన్ని ప్రదర్శించి, శ్రీకృష్ణ వర్ణనాత్మకములైన శ్లోకములను వానికి లక్ష్యములుగా నొసంగెనని చెప్పుదురు క్షేత్రయ్య లక్షణ విషయమున భానుదత్తాదుల మార్గమునే యనుసరించినను లక్ష్యనిరూపణమునఁ గొంత విశేషము ప్రదర్శించెను అతని లక్ష్యములు స్వానుభవము నుండియు లోకము నుండియు గ్రహింపఁబడిన వగుటచే సహజ తరములును సుందరతరములునై శోభిలును క్షేత్రయ్య తరువాత నుండిన యొక యాంధ్రకవి భానుదత్తుని రసమంజరిని శృంగార రసమంజరి యను పేర నాంధ్రీకరించి క్షేత్రయ్య పదములనే లక్ష్యములుగా నొసంగి యుండెను దీనిని బట్టి భానుదత్తుని శ్లోకములకంటె క్షేత్రయ్య పదములే యందలి లక్షణములను నిరూపించుట కెక్కువ యుచితములును మనోహరములునై యుండెనని భావింపవచ్చును ఇది క్షేత్రయ్య శాస్త్ర పాండిత్యమునకు నిదర్శనము ఇంతేకాక యతని పదములలో నచ్చటచ్చట కోకోకము కామసూత్రములు మున్నగు గ్రంథములతోఁగూడ నతనికిఁగల పరిచయము వ్యక్తమగు చున్నది

పదములలో గొప్ప సంగీత కళా పాటవమును ప్రవేశపెట్టిన వారిలో నగ్రేసరుఁడు క్షేత్రయ్యయే అతఁడు కొన్ని రాగముల చిత్రణమునందే దృష్టి కేంద్రీకరించినను ఆ రాగముల సమగ్రస్వరూపమును, అందలి విన్యాస వైవిధ్యమును ప్రదర్శించుటలో మాత్రము పరిణత సామర్థ్యమును ప్రకటించెను "క్షేత్రయ్య రాగ స్వరూప చిత్రణ మతిసుందరము మనోహరము అదివఱకెవ్వరును రాగమునకిట్టి యంద చందములను తీర్చిదిద్దిన రులేరు. ఇట్టి రాగరచనచేసి, రాగమునకు రససిద్ధిని కల్పించి, రాగముయొక్క సంపూర్ణ స్వరూపమును నిరూపించి, సంగీతములో రాగమునకుఁగల ఉన్నత స్థానమును నిర్ణయించి, క్షేత్రయ్య తరువాతి వాగ్గేయకారులకును సంగీత వేత్తలకును మార్గదర్శియైనాఁడు."

రసభావ పదప్రయోగాది సాహిత్యాంశముల విషయమున గూడ క్షేత్రయ్య పదములకుఁగల విశిష్టత ప్రత్యేకమైనది రసపోషణమున నతఁ డందె వేసిన చేయి. కాల ప్రభావము

ననుసరించి యతఁడును తన పదము లన్నింట శృంగార రసమునే ఎక్కువ అభినివేశముతో పోషించెను శృంగారము యోగ సంయోగములకు సంబంధించి మూఁడు రకములుగా నుండును. ఈ మూఁడును రక్తివిషయమున నుత్తరోత్తర విశిష్టములై యొప్పారును క్షేత్రయ్య తన పదములందు వియోగ శృంగారమునే అధికముగా వర్ణించెను అతఁడు సంయోగ శృంగారమును వర్ణించుచు రతిక్రీడాకుచగ్రహణాదులను ఆలింగన చుంబనాదులను వివరించిన పట్లును పెక్కుగలవు అట్టి ఎడ నాతఁడు సభ్యతా మర్యాద నతిక్రమించినాఁడేమో యనిపించును కాని సమకాలిక కావ్యములందలి శృంగార వర్ణనోద్వేగము పరిశీలించినచో నందు వైపరీత్యమేమియుఁగానిపింపదు. "మగువ తన కేళికా మందిరము వెడలెన్" అను పదమ రత్యనంతర నాయికా స్వరూపమును ప్రత్యక్షము చేయుచున్నది "ఒక్క గడియకే ఈలాగైతే ఇదేటి ఘనమే" అను పదమున శృంగార సాత్త్విక భావములు చక్కగా వర్ణింపఁబడినవి ఇట్టి పదములలో క్షేత్రయ్య వర్ణన వైశారద్యము గూడ తేట తెల్లమగుచుండును

క్షేత్రయ్య పదములందలి వస్తువిన్యాసము నాలుగైదు విధములుగాఁ గానిపించును అందుకొన్నింట నాయికా వాక్యములు, కొన్నింట దూతి వాక్యములు, కొన్నింట నాయక వాక్యములు, కొన్నింట నాయికా నాయక సంభాషణములు వర్ణితములై యున్నవి వీనిలో విరహోత్కంఠయైన నాయిక విరహము సైపలేక చెలికత్తెతో తన గోడువెల్లడించుకొను ఘట్టములును, నాయకుఁడన్యాసక్త చిత్తుఁడై యుండుట యెఱింగి నాయిక యాతని నుపాలంభించు ఘట్టములును అధికము విరహోత్కంఠ, వాసకసజ్జిక, ఖండిత మున్నగు నాయికలందరు నీ పదములందచ్చటచ్చట చిత్రింపఁబడి యున్నారు అట్లే స్వీయ, పరకీయ, సామాన్య అను భేదములకును, అందలి అవాంతర భేదములకును సంబంధించిన నాయికలును, దక్షిణానుకూల ధృష్టశఠాది నాయకులును అచ్చటచ్చట గోచరింతురు కవి తానే నాయికా నాయకులయు, దూతికలయు, పాత్ర వహించి సందర్భోచితముగ భావములను వెల్లడించు చుండును "మన మెట్టి నాయికా నాయకులను ఎటి అవస్థలను తలఁచుకొన్న అందుకు తగిన పదము క్షేత్రయ్య రచనలయందు కనఁబడఁగల"దని శ్రీ డా. సీతాపతి గారన్న వాక్యమెంతయు యథార్థము ధీరులైన నాయకులును ప్రియావిరహవేదన విషయమున నొక్కొక్కప్పుడ ధీరులేయగుచుందురు వారి విరహబాధను స్వయముగా చూచి, వారి మాటలు ప్రత్యక్షముగా విని వచ్చిన దూతిక "ఇంతదయ గల వానిసేల రావద్దంటివెంత నిర్దయురాలవె" యని నాయికలనే ఎదురునిందింప నారంభింతురు కొందఱు నాయకులు దుఃఖితులై పల్కు దీన వాక్యము విని దూతికలు వారికి తమ చెలులపైఁగల యను

రాగమున కచ్చేరువు పొందుచుందురు వారు నిరంతర నాయికా ధ్యానతత్పరులై "సొలసి వేసే మైన ప్రాయనీయాకార శోభనమె కనిపించునే, పిలిచి పేరున నొకటి పిలువఁబోయిన నీదుపేరు మఁదుగఁదోఁచునే" యని వలువిధముల వలవంత నంత చెందుదురు ఒక నాయిక "అట్టే యుండేవుసుమీ నా ప్రాణనాథ" అను పదమున "ఇంతలో నీవీడ రాకుంటే కన్నీరు కావేరి కాలువసుమీ, ఇంతింత నీకెమ్మొగ్గ చేసె రానకుంటే ఇది గోనో రెండేని సుమి" అని భవిష్య ద్విరహామును సూచించు చున్నగి ఈ విధముగా క్షేత్రయ్య తన పదములందు అన్ని రకములైన విప్రలంభ శృంగారములకును తావు కల్పించి యున్నాడు

క్షేత్రయ్య కొన్ని పదములలో శృంగారమునకు బీజభూతమైన నాయికా నాయకుల నిర్మలమైన యనురాగమును చక్కగా వర్ణించెను ఒక నాయిక" అక్కరో సరసుఁడుగాఁడని యాడుకొంటే యాడుకొనేరు" పదమున మువ్వగోపాలునిపై తనకుఁగల గాఢమైన యను రాగమును వ్యక్తము చేయుచున్నది ఇంకొక నాయిక "తేరిపారఁజూచినచో గోపాలునికి దృష్టి తగులు"నని భావించుచున్నది ఇది తిక్కనగారి "సుదతినిమ్మె చక్కఁజూడంగ నోడెదకనుఁబాటు వోరయునోయని తలంచి" యను పద్యపాదమందలి భావమ ను తలఁపించు చున్నది నాయికా నాయకులు తాము దుర్భరమైన విరహావేదన ననుభవించుచునే తమ ప్రియుఁడును ప్రియురాలును ఆ బాధనెట్లు సైఁపజాలుచున్నారో అని దుఃఖించుట వారి యనురాగ విశేషమునకు పరాకాష్ఠ. ఇది తాను విరహాము ననుభవించుచునే మేఘసందేశము నందలి యక్షుఁడు దయితా జీవితా లంబనార్థియై మేఘునితో సందేశము పంపించుటను స్మరణకు దెచ్చుచున్నది "తాళఁగలవా కంచి వరద నేనిన్ను నెడఁబాయ" వన్న గు పదములిందుకు నిదర్శనములు

క్షేత్రయ్య యెంత రక్తుఁడో యంత భక్తుఁడు అతఁడు మువ్వ గోపాలుని ప్రాణేశ్వ రుఁడుగా భావించి తద్వియోగమును సైఁపలేక ఈ పదములను రచించినట్లు కనిపించుటచే నందలి శృంగారము మధుర శృంగారమని కొందఱు భావింతురు భాగవతమున గోపికలయందు కొన్ని యెడల మోక్షకామముతోఁగూడిన ఇట్టి శృంగారము గోచరించును క్షేత్రయ్య పదములలో శృంగారము పెక్కుచోట్ల భగవత్సంబద్ధమే యయ్యును రతిక్రీడాది వర్ణన పూర్వకమై లౌకిక సీమలను దాటఁజాలకపోవుటచే మాధుర్య భావము నిముడ్చుకొనలేక పోయినదేమో యనిపిం చును లౌకికమైన కామమును గూడ నేదోవిధముగా ద్రిప్పి మోక్షరతి సహితమైన మధుర శృంగారముగా భావించుట కీ. శే. రామలింగారెడ్డిగారన్నట్లు కామము నాధ్యాత్మిక భావముగా

భ్రమించుట యగును. క్షేత్రయ్య లౌకిక శృంగారమునే వర్ణించె ననుకొన్నను అది యాతని భక్తి సంపదను తగ్గింపఁజాలదు అతని పదతరంగిణులలో భక్తి శృంగారములను రెండుపాయలు జతగూడి ప్రవహించుట గోచరించు చుండును "పరమాత్ముఁడౌ మువ్వ గోపాలునితో విన్నవించవే" "పరమాత్ముఁడే మువ్వగోపాలుఁడైన వరదుఁడు" మున్నగు పెక్కు చోట్లఁగల పరమాత్మ శబ్దప్రయోగము మువ్వగోపాలుఁడు సామాన్య నాయకునికి ప్రతినిధి మాత్రుఁడు కాఁడనియు పరబ్రహ్మమూర్తి యనియు సుస్పష్టము చేయుచున్నది." ఇద్దరి సందున పవ్వళించియున్న ఇంతి పేరేమిరా" అను పదమునందు ఇద్దరును జీవాత్మ పరమాత్మ లనియు నా ఇంతిమాయ యనియు కొందఱు గూఢార్థమును వివరింతురు కొన్నింట నిట్టి యర్థమును సాధించుటకవకాశమున్నను అన్నింట నా యర్థమును కొనసాగించుట క్లేశకరమగును.

భావప్రకటనమున క్షేత్రయ్య మిక్కిలి ప్రౌఢుఁడు అతనిపదములన్నియు వినువారి హృదయముల హత్తుకొను నిశితములైన భావముల నికిపట్టు గాంభీర్యముతోపాటు సౌకుమార్యమును శైథిల్యము తోపాటు ప్రసన్నతయు జతగూడ యుండును "ఏమిసేయుదు మోహమెటువలెను దీరు" మున్నగు పదములు చదివిన నీ విషయము తేటతెల్లము కాఁజాలును "వెలయనీదుముఖారవిందంబు లిఖయించి అలరువాసనలు వ్రాయఁగ నేరనైతి, కళలొల్కునీ మోవి కడగి వ్రాసితిఁగాని నెలత తేనియలుంచనే నేరనైతి" వంటిభావములు కాళిదాసాది మహా కవులకుఁదక్క నన్యుల కలవడనివికావు క్షేత్రయ్య వర్ణనలు కడుంగడు విశదములై దృశ్యము లను జదివెడు మనసునకు సాక్షాత్కరింపఁజేయు చుండును "మగువ తనకేళికామందిరము వెడలెన్" మున్నగు పదములట్టి భావచిత్రములకు నిదర్శనము క్షేత్రయ్య భావనలోతైనది; పరిశీలన నిశిత మైనది. వాని సాయమున నాతఁడల్పవిషయమును గూడ నత్యంత హృదయావర్జకముగా తీర్చి దిద్ది యుండెను

క్షేత్రయ్య పదప్రయోగము శ్రావ్యతా మాధుర్యములకు వలెనె భావవ్యంజన సామర్థ్య మునకును, దేశితనమునకు వలెనె సౌందర్యమునకును నునికిపట్టై ఎంతో హృద్యముగా నుండును' ఆనాఁటి పలుకుబడులెన్నో అతని పదములందు గోచరించును అతఁడు మాఱు మూలపదములను వాడక సర్వసుబోధములు, జాతీయములు నైన పదములనే యెక్కువ వాడియుండెను శబ్ద రత్నాకరకారుఁడు కొన్ని పదములకు లక్ష్యములుగా క్షేత్రయ్యపదములనే యుదాహరించెను కొన్ని శబ్దములకతని పదములు తప్పనితరాధారములు కానరావు ఈ విషయమతని ప్రామాణికత్వ

ననుసరించి యతఁడును తన పదము లన్నింట శృంగార రసమునే ఎక్కువ అభినివేశముతో పోషించెను శృంగారము వియోగ సంయోగములకు సంబంధించి మూఁడు రకములుగా నుండును. ఈ మూఁడును రక్తివిషయమున నుత్తరోత్తర విశిష్టములై యొప్పారును క్షేత్రయ్య తన పదములందు వియోగ శృంగారమునే అధికముగా వర్ణించెను అతఁడు సంయోగ శృంగారమును వర్ణించుచు రతిక్రీడాకుచగ్రహణాదులను ఆలింగన చుంబనాదులను వివరించిన పట్లును పెక్కుగలవు అట్టి ఎడ నాతఁడు సభ్యతా మర్యాద నతిక్రమించినాఁడేమో యనిపించును కాని సమకాలిక కావ్యములందలి శృంగార వర్ణనోద్వేగము పరిశీలించినచో నందు వైపరీత్యమేమియుఁగానిపింపదు. "మగువ తన కేళికా మందిరము వెడలెన్" అను పదము రత్యనంతర నాయికా స్వరూపమును ప్రత్యక్షము చేయుచున్నది "ఒక్క గడియకే ఈలాగైతే ఇదేటి ఘనమే" అను పదమున శృంగార సాత్త్విక భావములు చక్కగా వర్ణింపఁబడినవి ఇట్టి పదములలో క్షేత్రయ్య వర్ణన వైశారద్యము గూడ తేట తెల్లమగుచుండును

క్షేత్రయ్య పదములందలి వస్తువిన్యాసము నాలుగైదు విధములుగాఁ గానిపించును అందుకొన్నింట నాయికా వాక్యములు, కొన్నిట దూతి వాక్యములు, కొన్నిట నాయక వాక్యములు, కొన్నిట నాయికా నాయక సంభాషణములు వర్ణితములై యున్నవి వీనిలో విరహోత్కంఠయైన నాయిక విరహము సైపలేక చెలికత్తెతో తన గోడువెల్లడించుకొను ఘట్టములును, నాయకుఁడన్యాసక్త చిత్తుఁడై యుండుట యెఱింగి నాయిక యాతని నుపాలంభించు ఘట్టములును అధికము విరహోత్కంఠ, వాసకసజ్జిక, ఖండిత మున్నగు నాయికలందరు నీ పదములందచ్చటచ్చట చిత్రింపఁబడి యున్నారు అట్లే స్వీయ, పరకీయ, సామాన్య అను భేదములకును, అందలి అవాంతర భేదములకును సంబంధించిన నాయికలును, దక్షిణానుకూల ధృష్టశఠాది నాయకులును అచ్చటచ్చట గోచరింతురు కవి తానే నాయికా నాయకులయు, దూతికలయు, పాత్ర వహించి సందర్భోచితముగ భావములను వెల్లడించుచుండును "మన మెట్టి నాయికా నాయకులను ఎటి అవస్థలను తలఁచుకొన్న అందుకు తగిన పదము క్షేత్రయ్య రచనలయందు కనఁబడఁగల"దని శ్రీ డా. సీతాపతి గారన్న వాక్యమెంతయు యథార్థము ధీరులైన నాయకులును ప్రియావిరహవేదన విషయమున నొక్కొక్కప్పుడ ధీరులేయగుచుందురు వారి విరహబాధను స్వయముగా చూచి, వారి మాటలు ప్రత్యక్షముగా విని వచ్చిన దూతిక "ఇంతదయ గల వానినేల రావద్దంటివెంత నిర్దయురాలవె" యని నాయికలనే ఎదురునిందింప నారంభింతురు కొందఱు నాయకులు దుఃఖితులై పలుకు దీన వాక్యము విని దూతికలు వారికి తమ చెలులపైఁగల యను

# ప్రస్తావన

శ్రీమద్ భగవద్గీత 13వ అధ్యాయమున "ప్రకృతినుండి శరీరమునుపొంది అవివేకముచే నలుముకొనబడిన జీవాత్మకు తాను వేరు, శరీరము వేరు అను జ్ఞానము భోగాయతనమగు ఈ శరీరము ఎందుండినది నేననుజ్ఞానము కలుగుటయే విద్య ఈ సత్యమును తెలుసుకొనిన వాడే క్షేత్రమను శరీరమును తెలిసినవాడగు క్షేత్రజ్ఞుడగు చున్నాడు." అని శ్రీకృష్ణపరమాత్ముడు అర్జునునకు ఉపదేశించెను వేత్తయగు క్షేత్రజ్ఞుడును ఇట్టి మహానుభావుడే యనుకొనవలసి యున్నది

శ్రీ మువ్వ గోపాల ముద్రాంకితములుగా పదములు చెప్పిన క్షేత్రజ్ఞులను వాగ్గేయకారులు సుమారు క్రీ శ 1610 - 90 ప్రాంతములకు మధ్య ఉండినట్లు ఊహించవలసి యునది కృష్ణాతీరమునందలి కూచిపూడికి దగ్గరలో గల 'మువ్వ' వీరి స్వస్థలమని వాడుక మధురభక్తి సంప్రదాయము ననుసరించి ఈ ప్రపంచమునందలి సర్వ వ్యాపారములు జీవాత్మ, పరమాత్మల లీలా విశేషములే ఇందు శ్రీ మువ్వ గోపాలదేవుడే నాయకుడు సృష్టియందలి తక్కిన జీవాత్మలన్నియు నాయికలే ఈ భావమును సంగీత సాహిత్యాభినయములలో రంగరించి క్షేత్రజ్ఞులు తమ పదములందు పొందుపరచి రసజ్ఞులకు అందించినారు విద్యాపతి, జయదేవుడు, తాళ్ళపాక అన్నమయ్య మొదలగు వైష్ణవ భక్తులవలె నీతడును చిరస్మరణీయుడు

క్షేత్రజ్ఞుడు, వేడుకతో నడుచుకొన్న విటరాయడే! అను 'మేరువ' పదమునందు మధుర తిరుమలేంద్రుని (క్రీ. శ 1623 - 59), తంజావూరి అచ్యుత విజయ రాఘవుని (క్రీ శ 1633 - 73), బలవంతుడగు గోలకొండ బాదుషాను (క్రీ శ 1622 - 72), దర్శించి వారివారి ఆస్థానములలో పదములు పాడినట్లు చెప్పుకొన్నాడు. ఈ పదముల సంఖ్య 4200 నలుబదియేండ్ల

అసంఖ్యాకములును, రసవంతములును నగు తన రచనలతో దక్షిణాపథము నంతయు ఆనంద డోలిక లలో నూపి, సార్థక నామధేయుడై వివిధ క్షేత్రములను దర్శించుచు, ఇతడు ఎప్పటనో గోపాల దేవునియందు ఐక్యమైనాడని ఊహించ వలసి యున్నది

శ్రీ విస్సా అప్పారావుపంతులుగారు శ్రమించి సంపాదించిన వివరములతో క్షేత్రజ్ఞుల జీవితచరిత్ర యిట్లుండవలెను, అని ఒక కథను రసజ్ఞులకు అందించినారు ఆ కథయు సమంజసముగానే యున్నది కాని ఇదమిద్ధమని చెప్పుటకు ఆధారములులేని కథలు కర్ణాకర్ణిగా వినవచ్చుచున్నవి వీనియందలి సత్యాసత్యములను తెలుసుకొనుటకు ప్రయత్నించుట విఫలమని ఆయా సందర్భములయందు వానిని పెద్దల వలన తెలుసుకొనిన విధముగానే వ్రాసితిని క్షేత్రజ్ఞులను గురించి ఇంతకంటె తెలుసుకొనుటకు ఆధారములు లభ్యము కాలేదు

ఇంతవరకు దొరికిన పదములయందలి కొన్ని విశేషములను పరిశీలింతము శ్రీ విస్సా అప్పారావు గారికి దొరికినవి 309 పదములు శ్రీ గిడిగు సీతాపతి గారు సంపాదించిన పదములు మరికొన్ని, ఏది ఎట్లున్నను 400 ల పదముల కన్న సాహిత్యములు లభ్యమగుట లేదు అందు కానవచ్చు రాగములు

1 తోడి, 2 అసావేరి, 3 పున్నాగవరాళి, 4 ధన్యాసి, 5 ఘంట, 6 ఖండె 7 ఆహిరి, 8 వసంతభైరవి, 9 సావేరి, 10. మంగళకైశిక, 11 మారువ, 12 ఔళి, 13 నాదనామక్రియ, 14 పరజు, 15 సౌరాష్ట్రి, 16 సింధూరతిలక, 17 భైరవి, 18 హిందోళ, 19 హిందోళవసంతము, 20 ఆనందభైరవి, 21 హుసేని, 22 ముఖారి, 23. కాపి, 24 కానడ, 25 మధ్యమావతి, 26 సైంధవి, 27 శ్రీరాగము, 28 కాంభోజి, 29. యదుకులకాంభోజి, 30 ద్విజావంతి, 31. కేదారగౌళ, 32 సురటి, 33 శహాన, 34 శంకరాభరణము, 35 బేగడ, 36 నీలాంబరి, 37 అఠాణా, 38 దేవగాంధారి. 39 కురంజి, 40 విళహరి, 41 నవరోజు, 42 కన్నడ, 43 సామంతము, 44 వరాళి, 45. పంతువరాళి, 46 గౌరిపంతు, 47 కల్యాణి, 48 సారంగ, 49 మోహన ఇందు సింధూర తిలక, ఖండె, గౌరిపంతు రాగములు నాకు లభ్యమైన గ్రంథములయందుగాని వాడుకయందుగాని కానవచ్చుట లేదు మంగళకైశిక, మారువ సామంతము సైంధవి, ఘంట, ఈ రాగములు సంగీత సంప్రదాయ ప్రదర్శిని, మొదలగు గ్రంథములందు కానవచ్చుచున్నవి

కాంభోజి, తోడి భైరవి, ఆనందభైరవి, సావేరి, ముఖారి, హుస్సేని, మొదలగు ప్రాచీన ప్రసిద్ధ భాషాంగ రాగములలో పదములు ఎక్కువగా కలవు తాళ్ళపాక అన్నమయ్యవారు, పురందర దాసులవారు వీరిరువురి తరువాతివారైన క్షేత్రజ్ఞుల నాటికి ప్రచారమునందున్న రాగములు చాలావరకు భాషాంగములేయని తోచుచున్నది. ఇటు తరువాతనే మేళకర్తలను గుణించి, వానిని జనకరాగములుగా గుర్తించి, అప్పటికి వాడుకలోనున్న అన్నిరాగములను ఈ మేళకర్తలకు జన్యరాగములగా నిర్ణయించి, రాగములయందు భాషాంగ, దేశీయ విభాగములను గూడ చేర్చుకొని రాగ ప్రస్తారములు జరిపినట్లు తోచుచున్నది కనుకనే కాపీ, సారంగ, మొదలగు రాగములయందు 2 మధ్యమములు, 2 గాంధారములు, 2 నిషాదములు వచ్చుచున్నను, భాషాంగ దేశీయ రాగములుగా వానిని గుర్తించి కర్నాటక సంగీత పద్ధతియందు స్థిరనివాసమిచ్చి యున్నారు అటులనే ద్విజావంతి, భైరవి, ముఖారి, నీలాంబరి, ఆనందభైరవి, మొదలగు రాగముల యందుగల సందర్భానుసారములగు అన్యస్వర ప్రయోగములను పరిహరింపక భాషాంగములుగానే చెప్పకొనుచు వచ్చిరి ఇప్పుడు వాడుకలో ఉన్న రక్తి రాగములలో క్షేత్రజ్ఞుల పదముల యందలి ప్రయోగములే ఆధారములుగా తోచుచున్నవి

తోడి, ఆహిరి, మంగళకైశికి మారువ, గౌళి, భైరవి, హిందోళవసంతము, ముఖారి, కాపీ, కానడ, ద్విజావంతి, సురటి, బేగడ, కల్యాణి, సారంగ, మొదలయిన రాగముల యందుగల కొన్ని సంచార సందర్భములను గమనించినచో క్షేత్రజ్ఞుని కాలమునాటికి ఈ రాగములు ఎట్లుండెడివో, ఇప్పుడు ఎట్లు మారిపోయినవో కొంతవరకు తెలుసుకొనవచ్చును ఆయా రాగములను గురించి వివరణ వ్రాయునప్పుడు కొన్ని ప్రయోగములను చూపి యున్నాము క్షేత్రజ్ఞులు వాడిన రాగముల యందుగల యితర వాగ్గేయకారుల రచనలను పరిశీలించినచో క్షేత్రజ్ఞుని సంగీత ప్రభావము తరువాతి వాగ్గేయకారులపై ఎంతగా ప్రసరించినదో విజ్ఞులకు విదితమగును

క్షేత్రజ్ఞుని పదములుగాక తిల్లవరమువారి, శోభనగిరివారు సారంగపాణి, మొదలయిన వారి పదములు వాడుకయందుగలవు కాని క్షేత్రజ్ఞుని పదములే ప్రసిద్ధములైనవి సౌకుమార్యములగు సాహిత్యభావములను, అభినయమునకు అనువగురీతిని సంగీతమున పొదిగి చెప్పటయందు క్షేత్రజ్ఞులు సిద్ధహస్తులు

ఈ పుస్తకమునందు అచ్చయిన పదములుగాక విశాలమైన ఆంధ్ర, తమిళ, కర్నాటక, కేరళ దేశములయందుగల మహావిద్వాంసులు, వయోవృద్ధులు, అయిన వారికి, ఇంకను ఎన్నియో

పదములు పాఠమున ఉండిన ఉండవచ్చును పాఠభేదములును ఉండవచ్చును నాకు లభ్యమైన రీతిని స్వరపరచిన విధము మాత్రమే ఇది

పదములు తొలుత 1936 ప్రాంతమున సేలమునందు నేను మా గురువులు శ్రీమతి సీతా మహాలక్ష్మి, శ్రీ పద్మనాభ అయ్యర్ గారివద్ద గీతాభ్యాసము చేసుకొనుచున్న సమయమునందు మేము గల యింటికి ఎదురింట నున్న ఒక వయోవృద్ధుని వలన విని తెలుసుకొంటిని వారు ఈ పదములను పాడుచూ, వాని యందలి ప్రాశస్త్యమును చెప్పుచూ, అప్పటికే గతించిన అనేక మంది గాయనీ గాయకుల కౌశల్యమును వివరింపుచూ, వారితోనే పదములు అంతరించి పోయి నట్లున్నవని వాపోవుచుండెడివారు నేను మా గురువుల వద్ద ఈ విషయమును ప్రస్తావించగా ఆమె నన్ను ప్రోత్సహించి, "యివి సంగీత సాహిత్యములయందు అనన్య సామాన్యములైన అపురూపరచనలు వీనిని అందిన విధముగా నీవు స్వరపరచి యుంచుకొనుము" మని చెప్పిరి అప్పటి నుండి నేను ప్రతి దినము ఆ వయోవృద్ధుని కడకు చని ఆయనచే పదములు పాడించుకొని, వానికి స్వరములను వ్రాసుకొనుచూ సేకరించుట ప్రారంభించితిని ఒక డైనను వినువాడు దొరికెనను సంతోషమున, ఎన్ని సార్లు పాడమని అడిగినను కోపగించుకొనక నాకు ఈ పదములను మహోన్నత సంపదను దానము చేసిరి వారి పేరైనను తెలుసుకొనజాలని తెలివి తక్కువ తనమునకు ఇప్పటికిని చింతించుచున్నాను

అప్పుడు నేను చిన్న వయస్కురాల నగుటచే క్రొత్త విషయములని పదములను సేకరించినను, ఇందుగల శృంగార సాహిత్యమును పెద్దల ఎదుట పాడుటకు సంకోచించి, చాలా దినముల వరకు నావద్ద క్షేత్రజ్ఞుల పదములు గలవను విషయమును కూడా ఎవ్వరికిని చెప్పనైతిని శ్రీ విస్సా అప్పారావు పంతులు గారు, శ్రీ పిరాట్ల శంకరశాస్త్రిగారు, ఒక సందర్భమున కలిసి యుండగా నేను పదములను పాడి వినిపించితిని వారు విని, ఇవి సరియైన పాఠమున వీనికి వచ్చినవని నిశ్చయించి నన్ను ప్రోత్సహించి స్వరపరచి వ్రాయించుట జరిగినది

మొదటి ముద్రణమును ఆంధ్రగానకళాపరిషత్తువారు వేయించిరి అందు అనుకోని ఇబ్బందుల వలన కొన్ని పదములను మాత్రమే వేయుటయు తప్పొప్పులను సరిచూచు పని నేను చేయుటకు వీలుకలుగక పోవుటవలనను, ఆపని చూచిన వారికి క్షేత్రజ్ఞుని రచనా విధానము ఆకళింపు నందు లేకుండుట వలనను ప్రథమ ముద్రణమున కొన్ని హెచ్చుతగ్గులు, స్వరసందర్భ శూన్యములు దొర్లిపోయినవి ప్రథమ ముద్రణమునకు సంపాదకత్వమును సంగీత కళానిధి

కీ శే శ్రీ టి వి సుబ్బారావుగారిపై ఉంచుట జరిగినది వారు తమకు న్యాయమని తోచిన విధముగా దిద్దుబాట్లు అనేకములు చేసినారు కాని నాకు మాత్రము తెలిసినది తెలిసినట్లే అచ్చు వేయుట న్యాయమని తోచినది ఏలననగా పెద్దలు, వయోవృద్ధులు పాడి అందించినవి సంప్రదాయములు కానేరవని చెప్పుటకు మనకు అధికారము లేదని నా మతము. ఉదాహరణకు ఆనంద భైరవి రాగమున అంతరగాంధారము, శుద్ధ ధైవతము, కాకలినిషాదము మొదలయినవి యథా సందర్భముగా వచ్చునప్పుడు శాస్త్ర విరుద్ధమని పాడకుండినచో వినెడి వారికది ఆనందభైరవి రాగముగా తోచక, వేరేదియో అగును. ఇట్లు పాడెడి పద్ధతి ఈ నాటిదా ? లేక క్షేత్రజ్ఞుని కాలము నాటిదా ? అని తర్కించుట వలన ఎంత మాత్రమును ప్రయోజనము లేదు అట్లని సంప్రదాయములను వ్యతిరేకించమని గాదు నా మతము సంప్రదాయము నందును, "పదుగు రాడుమాటను" పాటించమనియే నా మతము. కనుకనే నేను మా గురువుల వద్ద అభ్యసించిన విధముగనే రాగ స్వరూపములను ఇందు పొందు పరచితిని

క్షేత్రజ్ఞుని పదముల యందుగల కొన్ని రాగములకు లక్షణములను వ్రాయుసందర్భమున, వెంకటమఖి సంప్రదాయము ననుసరించి, శ్రీ సుబ్బరామదీక్షితుల వారు వ్రాసిన సంగీత సంప్రదాయప్రదర్శిని యను గ్రంథమునందు గల రాగలక్షణములతో పోల్చి వివరించి యున్నాను సుమారు నూరు, నూటయాబది ఏండ్ల క్రిందటివగు రాగస్వరూపములను శ్రీ సుబ్బరామదీక్షితుల వారు ఈ గ్రంథమున మనకు అందించి యున్నారు కనుక క్షేత్రజ్ఞుని పదముల యందలి రాగములు వీనితో సరిచూచుట న్యాయమని నా భావము.

నాలో నిద్రాణమై యున్న సంగీతమును మేల్కొలిపి, పదములను పాడించుకొని, వాని యందలి సొగసులను నా కెరుకపరచి, రసానుభూతిని కలిగించిన మిత్రులు మహాకవి కీ శే శ్రీ నండూరి వెంకట సుబ్బారావు పంతులు గారికి సర్వదా నే కృతజ్ఞుడను. వీరి తరువాత రెండు దశాబ్దములు మరల పదములను గురించి, ఆలోచించుటకు గాని, పాడి వినిపించుటకు గాని, నాకు సందర్భమే రాలేదు మిత్రులు శ్రీ ఇ ఎన్ పురుషోత్తమన్ గారితో పరిచయము కలుగుటయు, వారు పదములు విని ఆనందించుచూ, నన్ను రేడియో కార్యక్రమములలో పదములు ప్రసారము చేయమనుటయు జరిగి, ఇవి తిరిగి వెలుగులోనికి వచ్చినవి, అని అనుకొనుటలో అతిశయోక్తి ఏమియు లేదు వారికి నా ధన్యవాదములు సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు శ్రీ ఆర్ ఆర్ కేశవమూర్తిగారు అడిగినంతనే రెండవ ముద్రణమునకు తమ అభిప్రాయమును చక్కగా వ్రాసి యిచ్చి నందుకు వారికి నా కృతజ్ఞతలు పదముల యందలి సాహిత్య సౌకుమార్యములను వివరింపుచు, ఆచార్యులు డా. దివాకర్ల వెంకట అవధానిగారు తమ వ్యాసమును ఈ గ్రంథము నందు అలంకరించిరి. వారికి నా కృతజ్ఞతలు

క్షేత్రజ్ఞుని పదములను ప్రచారమునకు తెచ్చి వాని యందుగల రససంపదను శ్రోతలకు అందించవలెనను సదుద్దేశముతో ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రము నందలి స్టేషను డైరక్టరు శ్రీ కె కందస్వామిగారు శ్రద్ధవహించి, సుప్రసిద్ధ గాయనీ గాయకులచేత పదములను పాడించి ప్రచారమగుటకు ప్రోత్సాహము ఇచ్చి గ్రంథరూపమున వెలువరించుటకు వీలుగా వ్రాతప్రతిని తయారు చేయమని చెప్పుటయు జరిగి నండ ననే నాపనికి పూనుకొనుటయు, అతిశీఘ్రకాలముననే నాశ్రమ ఫలించి గ్రంథము వెలువడుటయు జరిగినది దీనికి శ్రీ కందస్వామిగారికి నేనెంతయో కృతజ్ఞుడను

ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారి ఆధ్వర్యమున శ్రీ కె ఆర్ పరమహంస (ప్రత్యేకాధికారి) గారు అమూల్యములయిన కర్నాటక సంగీత గ్రంథములను ఎన్నిటినో ముద్రింపించు భారమును వహించుచు, క్షేత్రజ్ఞ పదములను కూడా ప్రకటించు సంకల్పమును వ్యక్తపరచి, తప్పొప్పులను సరిచూచు బాధ్యతయు నాపైనే యుంచి ప్రకటింప బూనుకొనిరి నేనును రెండవ ముద్రణ వేయునప్పుడు రాగలక్షణములు, అవతారికలు, ఇంకను ప్రథమ ముద్రణము నాటికి సరిచేసుకొని అచ్చువేయుటకు ఇవ్వజాలక ఉండిపోయిన 57 పదములను కలిపి మొత్తముగా 185 పదములను సమగ్రమగు లక్షణ గ్రంథముగా వేయనెంచి వ్రాతప్రతిని సిద్ధపరచి యుంచుకొని యుండుట వలన పరమహంస గారు అడుగగనే గ్రంథ వ్రాతపతిని వారికి ఇవ్వ గలిగితిని. వారును అతి శ్రద్ధతో ముద్రణా కార్యమును జరిపించి సుందరముగా ఈ గ్రంథమును వెలువరింపచేసిరి దీనికి వారికి నా కృతజ్ఞతా పూర్వకములగు ఆశీస్సులు చాలా శ్రద్ధ వహించి తప్పులు లేకుండా త్వరగా గ్రంథము ముద్రించుటకు సహకరించిన నాట్యకళ ప్రెస్ వారికి నా కృతజ్ఞతలు

వ్రాతప్రతులను తయారుచేయుట యందును, అచ్చయిన వానిని సరిచూచుటయందును కాలప్రమాణమునకు తగినరీతిని పాడిచూచి, నాకు చేదోడు వాదోడుగా మెలగిన నా సోదరుడు చి పురుషోత్తమునకు, అతని కుమార్తె చి జోగులాంబకును, నా శిష్యురాలు ముప్పవరపు శాంతకుమారి మొదలైన నా సన్నిహితులకు ఆశీస్సులు.

హైదరాబాద్
27-11-78

మంచాళ జగన్నాధరావు

# విషయ సూచిక

| సంఖ్య మొదటి పంక్తి | | రాగం | తాళం | పుట |
|---|---|---|---|---|
| 20 | ఏరీతి వేగింతునే ? ఓ చెలియా! | ఆహిరి | త్రిపుట | 61 |
| 21 | ఏమిసేతునే ? కొమ్మా! | ,, | ,, | 65 |
| 22 | రామరామ ప్రాణసఖ నెడబాసి | , | ఝంప | 69 |
| 23 | తాళరాదమ్మా ! ఓయమ్మ! | ,, | ఆది | 73 |
| 24 | ఇంతరావు జేసితే | వసంతభైరవి | ,, | 76 |
| 25 | ఇక్కడ లేదే మనసు | ,, | త్రిపుట | 80 |
| 26 | బాగాయె నీవగలెల్ల | సావేరి | ,, | 83 |
| 27 | ఈలాగటవే బుద్ధి | ,, | ఆది | 86 |
| 28 | హితవైన చోట | ,, | త్రిపుట | 89 |
| 29 | లేమరో మా మువ్వగోపాలుడు | , | ,, | 93 |
| 30 | అలుకో పొలయలుకో | ,, | ,, | 96 |
| 31 | తాళి మొకరి కన్నా వద్దా | మంగళకైశిక | ,, | 101 |
| 32 | అమ్మమ్మ వీడెంత | మారువ | ,, | 104 |
| 33 | ఎంతమాటలాడెనమ్మా | ,, | ,, | 108 |
| 34 | కోడికూసె నయ్యయ్యో | బౌళి | ,, | 111 |
| 35 | ఇంత తెలిసియుండి | ,, | ,, | 115 |
| 36 | అయ్యయ్యో వెగటాయెనే | నాదనామక్రియ | , | 118 |
| 37 | ఏమనెనే సుద్దులు | ఫరజు | ,, | 122 |
| 38 | ఏ తీరున రమణిని | సౌరాష్ట్రి | ,, | 125 |
| 39 | ఇద్దరివలెనే కూడి | ,, | ,, | 129 |
| 40 | చక్కనయ్యా యేమి యుపచారము | ,, | ,, | 132 |
| 41 | ఇకనిన్ను నమ్మరాదే | ,, | ,, | 134 |
| 42 | తప్పించుకొంటి వేమాయె | సింధూరతిలక | ఆది | 137 |
| 43 | ముందటివలెనా పై | భైరవి | త్రిపుట | 140 |
| 44 | ఎవ్వరి నంపుదు | , | ,, | 144 |
| 45 | అపరూప దర్శనం బాయగదా | ,, | ,, | 148 |
| 46 | సామిగా రారా యంటే | హిందోళ | ,, | 151 |
| 47 | పలుకు లేటికి దయలు | హిందోళవసంతం | ,, | 155 |
| 48 | చూడని కూడని నిందలు | ఆనందభైరవి | ,, | 159 |

# గమనిక

అక్షరకాలమును తెలియచేయుటకు చుక్కలను ( ) మాత్రమే వాడియున్నాము అనగా ఒక క్రియయందుగల రెండక్షరముల కాలప్రమాణము సూచించుటకు ఉపయోగించిన గుర్తులు 1 2. స స — 3 సా రి స — 4 స స రి - 5 సా - రి స 6 సా రి స సా రి స అనునవి

సంగతులయందు తిరిగి పాడుకొనవలసిన ఆవృత్తములను వ్రాయక, మార్పుగల ఆవృత్తములను మాత్రము వ్రాసియున్నాము. అనగా సంగతి నంతయు తిరిగి పాడుకొనుచు, ఏ ఆవృత్తమున మార్పుసూచించితిమో దానిని మాత్రము చేర్చుకొనుచు పాడుకొనవలెను

అనుపల్లవి వలె పాడుకొనవలసినదగు చరణమునందలి సాహిత్యభాగమున సంగతులుండినచో, మొదటి సంగతియో లేక చివరి సంగతియో మాత్రమే వ్రాసియున్నాము. అనుపల్లవియందు గల తక్కిన సంగతులలో కూడా ఆ సాహిత్యమును నప్పించుకొని పాడుకొనవచ్చును

పదములయందు రెండుమూడు చరణములు ఉన్నను, ఒక్క చరణమునకు మాత్రమే స్వరము వ్రాసియున్నాము తక్కిన చరణములను ఆ స్వరమునందు నప్పించుకొని పాడ కొనవచ్చును

పదములను పాడునప్పుడు అనుపల్లవితో ప్రారంభించి, పల్లవిని, చరణమును పాడుకొనుటయు, అనుపల్లవి యందుగల చివరిసంగతితో ప్రారంభించి మొదటి సంగతికి వచ్చి పల్లవిని ఎత్తుటయు సంప్రదాయముగా నున్నది

క్రియకు నాలుగు, ఎనిమిది, అక్షరముల కాలము పలుకుటకు వీలగునంత విలంబ కాలమున పదములు పాడుట వాడుక సాధారణముగా త్రిపుట తాళము నగల లఘువునందలి క్రియకు

వచ్చు ఆరు అక్షరములు మూడు మూడుగా విరుగుటయు, ఆ విరిగిన మూడు అక్షరములు పై కాలమున ఆరు అక్షరములగుటయు, పదములయందు కనబడు ప్రత్యేకత

ముఖ్యముగా త్రిపుటతాళమునందును సకృత్తుగా ఆది, ఝంప, తిశ్రఏక తాళవ లందును పదములు గలవు మొదటి ఆవృత్తమునందు రెండు క్రియలు వదలి ఎత్తుగడ అయినచో రెండవ ఆవృత్తము సమమునుండి ప్రారంభమగుచుండును

రాగము నందలి గమకవరికాదులను, వాక్యముల యందలి అర్ధభావములను, మనః నందుచుకొని, కాలప్రమాణమును దృష్టియందుంచుకొని, పదములను పాడుకొని ఆనందిం వలెను

ఇందుగల రాగవివరణములలో కాంభోజి, శ్రీ రాగములకు ఆరోహణావరోహణము వ్రాయలేదు అవి

కాంభోజి — ఆ. స రి గ మ ప ద స అ. స ని ద ప మ గ రి స

శ్రీరాగము — ఆ స రి మ ప ని స అ స ని ప మ రి గ రి స

ఇతర విషయములు ఆయా రాగముల వివరణములయందు గమనించవచ్చును

126 వ పుటయందుగల సౌరాష్ట్రరాగమునకు వ్రాసిన వివరణ [illegible] దు ఇది 16 మేళమగు చక్రవాకము జన్యమని పొరపాటున వ్రాయుట జరిగినది కైశికి నిషాదమును [illegible] స్వరముగా గ్రహించి, ఈ రాగమును 17 వ మేళమగు సూర్యకాంతమునకు జన్యమని గ్రహిం వలెను

137 వ పుటయందుగల సింధూరతిలక రాగమునకు వ్రాసిన వివరణమునందు 17 వ మేళమగు సూర్యకాంతమునకు జన్యమని పొరపాటున వ్రాయుట జరిగినది 11 మేళమగు కోకిలప్రియ జన్యముగా దీనిని గుర్తించవలెను

361 వ పుటయందుగల నీలాంబరి రాగ వివరణమునందు [illegible] ని ధ [illegible] గా అను ప్రయోగములు తప్ప మంద్ర తార స్థాయిలయందు ఎక్కువ సంచారములు [illegible] లుగా 'ఎక్కువ సంచారములు కలిగినది' అని పొరపాటున వ్రాయుబడినది

# క్షేత్రయ్య పదములు

**అవతారిక**

ఈ పదమునందలి నాయిక స్వీయప్రౌఢ ధీర జ్యేష్ఠ ఈమె తన నాయకుని కొంటె చేష్టలు, తానెట్లు మందలించినదిచెప్పి నాయకుని కొంటెతనమునకు ఆనందించుచున్నది

ఈ తోడిరాగము ప్రాచీనము, రక్తిరాగము ఇది దేశీయరాగమని వెంకటమఖి చెప్పియున్నారు ఇప్పుడు వాడుకలోవున్న రాగ స్వరూపమును గమనించి చూచిన ఇది దేశీయ రాగమనుటకు ఏవిధమయిన అవకాశమును కానరాదు బహుశః క్షేత్రజ్ఞులకు పూర్వమే ఈ రాగము తన దేశీయ లక్షణములను వదలి కర్నాటక గమకములను పూర్తిగా సంతరించుకొని కర్నాటక రాగములలో ఒక ప్రత్యేక స్థానమును సంపాదించకొన్నదేమో అని తోచుచున్నది ఈ రాగములో క్షేత్రజ్ఞులు ఎన్నో పదములు పాడుకొన్నారు ఒక్కొక్కపదమునందు ప్రత్యేకమైన కొన్ని ప్రయోగములు అమర్చి, రక్తి సంచారములకు ఈ రాగము సముద్రము వంటిదని నిరూపించినారు ఈ రాగము సంపూర్ణ సంపూర్ణము. ఇప్పుడున్న 72 మేళములలో ఇది ఎనిమిదవది

రాగం - తోడి - త్రిపుటతాళం

ప ఇన్నాళ్ళవలె గాదమ్మా ! - మువ్వగోపాలుడెన్నో నేర్చినాడమ్మా ?

అ ప నన్ను కన్నులు మూసి - నాచెంతనుండిన
సన్నుతాంగిమోవి - చాలా చప్పరించెనే ! ॥ ఇన్నాళ్ళ ॥

చ చలువ చప్పరముతో - సవతినేనుండగ
బలిమి నాదు - కొంగు బట్టుక చాటున
పలుమారు తొడలపై - గిలిగింతలిడగా నే
తెలిసి నేనడిగితే - కిలకిల నవ్వెనే ! ॥ ఇన్నాళ్ళ ॥

2 మిసమిసలాడునా - నొసలిపై తిలకము
పొసగదిద్దుచువాడు - పొందుగ అలదాని
కుసుమాస్త్రు గృహముపై - కొసరి చే వేయగానే
కసరి నేనడిగితే - గారడమాడెనే ! ॥ ఇన్నాళ్ళు

3 పదరక ముద్దుగో - పాలుడు నను గూడి
మదిరాక్షిరో ! - దానిమమత తెచ్చుకొనెనే
కొదమ గుబ్బలపైని - కోకటు దొలగింప
కదసి నేనడిగితే - తుదనన్ను గూడెనే !

ప. ... సా । రి మగ । మగమా ॥ మా నిపా సదప । పాదప । దని సరి ॥
... ఇ । న్నా । . . ళ్ళు ॥ వ లే । గా . । ద ॥

సా పపా । దనిసరి । సా ॥ సనినిదపా । పపమగ । గా ॥
మ్మా ము । వ్వ । గో ॥ పా । లు । డు . ॥

... గమ । నిదపద । మసపా - మ ॥ గమా మదపమ । దమగరి । రిసరిని ॥
... ఎ - । న్నె . । నో్న ॥ నే ర్చి । నా . । ద ॥

2 సా సరి । రి మగా । మగమా ॥ మా నిపా పా దపా । పాదప । దనిసరి ॥
మ్మా ఇ । న్నా । . ళ్ళు ॥ వ . లె । గా । ద . ॥

ని సా . పా । దనిసరి । సారిని ॥ దనిసా రిసనిధ । పాదని దపమా । పా గమా
మ్మా ము । వ్వ . । గో . ॥ పా . । లు . . . । డు -

... గమ । దనిసరి । రినిదమ ॥ గమా మదపమ । మదమా గరి । రిససరిసా ॥
... ఎ । న్నె . . । నో్న . ॥ నే . ర్చి . । నా . . । ద . . . ॥

3 సా . . సరి । రి మగా । మగమా ॥ మా - నిపా పా . దపా । పాదప । దనిసరి ॥
మ్మా ఇ . । న్నా । . ళ్ళు ॥ వ - . లె - । గా . । ద . . . ॥

సా దా । గ రి రి ని । ని దదమ ॥ మ గ మా మ ద ప మ । మ ప మా మ గ రీ । సారిని ॥
మ్మా . ము । వ్వ । గో . ॥ పా । లు । డు ॥

సా గ మ । దా ని సా రి గ । రి ని ద మ ॥ సా రి ని దా మా । మదపా మ ప మా ।
ఎ । న్నె । నో్న ॥ నే ర్చి । నా ।

మ గ రీ రి ని ॥ సా । । ॥
డ ॥ మ్మా । । ॥

అ ప ... రి స । ని ద దా । పా ప ద నీ ॥ ద ప మా పా గ । మా ని ప । ప ద పా ప ద పా ॥
... న । న్ను । క ॥ న్ను లు । మూ । సి ॥

దా ద ని । ఎం । సా ॥ రి స ని దా । దా స ని । సా ॥
నా । చెం । త ॥ నుః । డి । న ॥

... ద ప । దా । గా ॥ గ రి రీ । సా రి ని । సా ॥
... స । న్ను । తాం ॥ గి । మో । వి ॥

... ద ని । సా । సా రి ని ॥ ద ప ద ని ప ద । మ ప గ మ । ద ప ప మ ॥ గరిసని
... చా । లా । ॥ చ . ప్ప । రిం । చె ॥ నే . ఇన్నాళ్ళ॥

చ ॥ ... ప ద । పా ॥ పా ॥ పా ద ని ద ప మా । పా పా గ । మా ॥
... చ లు । వ । చ ॥ ప్ప ర । ము । లో ॥

... గ మ । ని ని దా । ప ద పా ॥ ద ని సా రి స ని ద । దా స ని । సా ॥
... స చ । తి । నే ॥ ను ం . । డ । గ ॥

... ద ని । సా । సా ॥ రి స ని ద నీ । ని స ని ప । దా ॥
.... బ లి । మి . । నా ॥ దు . । కొం . । గు ॥

... గ మ । నీ స । ని ద ద మ ॥ మా మ ద ద మ మ గ । గ రి రీ । సా ॥
.... బ । ట్టు . । క ॥ చా . । టు । న .. ॥

సా   రిస। నిదదా। నిదపమ॥ పాగమా । నినిపా। దా ॥
పలు। మా । రు ॥ తొ డ । ల । పై ॥

దా   పద। దసనీ। సా .॥ రిసనిదదా। దాసని। సా. ॥
. గిలి। గిం . । త . ॥ లి డ । గా . । నే ॥

... దప। దా..। దగారి॥ రిసా సాని। రిసనిద। దా ॥
... తెలి। సి ..। నే ॥ న డి । గి । తే . ॥

దా   దని। సారిస। సనిరిస॥ సనిపదపమ। పమగరి। రిససా॥ సారిగ
కిల। కి .। ల ॥ న । వ్వే । నే ॥

॥ ఇన్నాళ్ళు ॥

**అవతారిక :**

నాయిక పరకీయ తన రూప సౌందర్యాతిశయమునకు గర్వించి స్వామిని పదుగురి ఎదుట మాటలతో అవమానించి దూరముచేసుకొన్నది ఈమె దుడుకుతనమును చెలి తెలిసికొని 'ఏమని దూరితివే' అని మందలించుచున్నది ఈ పదమునందలి రాగ సంచారములు సర్వాంగ సుందరముగా అభ్యసించినవారికి తోడి రాగము కరతలామలకమగు ననుటలో సందేహములేదు.

**రాగం - తోడి - ఆదితాళం**

ప ఏమని దూరితివే ? కోమలీ ! నీ కోపము - కొల్లపోవద్దా ?

అ ప. మోముజూడక యిట్లు - మువ్వగోపాలుని
నామాలిమెంచక - సలుగురిలో ॥ ఏమని ॥

చ. పిలువకవచ్చునో పెద్దమాటాడునో
చెలిమి కాదనునో - చేకొంచమెరుగునో
అలుకసేయనేర్చునో - అందిందుబోవునో
పలుమారందరిలో - పడుచుతనముమాని ॥ ఏమని ॥

2 మంచిమాటాడడో - మన్నన చేయడో
వంచనపరుడో - వచ్చిలాలించడో
ఇంచుకచిత్తమీడో - యెమ్మెలవాడో
అంచయాన ! యిటుల - ననవచ్చు ననరాదనక నీ ॥ వేమని ॥

3. నిను గూడ డాయెనో - నీయానమీరెనో
కినిసిరానెనో - కేరడము లాడెనో ?
మనసు రాదనెనో నీ మాట - జవదాటెనో
మొనసి కోపమోర్వక - మువ్వగోపాలుని నీ ॥ వేమని ॥

ప: ... సారిసా। ని़సరిస నిసరిస । సని ధా ధాసని॥
... ఏ మ ని। దూ .. . . । రి . . తి . ॥

సా -(1) సా రి గా। మా పదనిద। పద దపదమ॥
వే- కో మ లీ। నీ కో । . పము . . . ॥

పగమగమా మగ మా పదపద। మపపా। ద నిదమ గరిరి॥
. . . . . కో- ల్ల పో . । వ । ద్దా . . . . ॥

సరిని़
నీ . వేమని దూరితివే॥

2. ... సా రి గా। మా పదనిద। పద దపదమ॥
... కో మ లి। నీ కో । పము . ॥

పగమగమా పగ మా పదసీ। దమదనిస। -నిదపా॥
. . . కో - ల్ల పో । . వ । - . ద్దా॥

3. దని దమగరి సారిగా। మా పదనిద। పద దపదమ॥
ఓ . కో మ లి। నీకో . । - పము . ॥

పగమగమా మగ మా పదసీ। దనిసా రిసరిగ। - రిసని దమదని॥
. కో - ల్ల పో । వ . . । - ద్దా. . . ॥

4. రినిదమగరి సారిగా। మా పదనిద। పద ద పదమ॥
ఓ . . కో మ లి। నీ కో . . । పము . ॥

పగమగమా మగ మా మగమద। దమదని నిదనిస। సనిసరి గరినిద॥
. - కో ల్ల పో . । . . . వ . . । . . . ద్దా . . ॥

మగరిసరిని़
నీ . . వేమని దూరితివే॥

అ ప. ...గా మ దా। దా స ని సా। స ని ద ని స రి నీ।
... మోముజూ। డ . క । యి . . ॥

సా - ప దా ని స। రి స స ని దా। ని స ని ద॥
ట్లు - ము వ్వ గో । పా । లు ॥

2 ని స ని ద ప మ పా గ మ ని ని పా। ద స నీ సా। స ని దా ద స నీ॥
ని . మో ము జూ । డ . క । యి . ॥

సా - ప దా ద ని స రి। గా గ రి రీ ప మ। గ రి రీ సా॥
ట్లు - ము వ్వ గో । . పా . । లు ॥

3 ని స ని ద ప మ పా గ మ ని ని పా। ద స నీ సా। స ని దా ద స నీ॥
ని . . మో . ము జూ । డ . క । యి , ॥

సా . ప దా గా। గ రి రి గ మ ద మ మ। గ రి స రి ని ని ద మ॥
ట్లు ముvv గో। . పా । లు ॥

గ మ ప ద ని స ద ప దా గా గ రి రీ। సా । సా ॥
ని . నా మా లి ॥ మొం । చ ॥

స ని దా దా స ని సా - ప। ద ని స రి స ని ద ని। సా ని ద పా ॥ ప మ గ రి స ని
క . . - - । న - లు - గు । . రి . ॥ లో . .

॥ ఏమని ॥

చ· ... పద నిదపా। మపదప మప। పపమగ గా॥
... పి-లువక। వ ।చ్చు నో॥

గా-మగ మాపదపద। మపా-। పాపదనిద॥
. -పె-ద్ద మా ।టా -।డు ॥

నిద పమగమ మదమ దాదని। సాసా రిగ। రిసా-రిసనిప॥
నో చెలిమికా । ద. ।ను.-నో ॥

దా దమగా మా ని ద। మా దపమగ। సరిసా॥
చే కొం చ -। మెరు । గునో॥

సా దప పా గమా। నినిపా దా। దా సని సం రిని॥
-అ లు క। సే య। నే ర్చు ॥

సా. సని ని గా గరిరిగ। మాధమ మగరి। సారిని సా॥
నో అం దిం దు ।బో . ।వు నో॥

సా దపద దనిసా। రిస సనిదా। పం ద సనిదా॥
పలు మా । రం ।ద. రి-.॥

పదనీ దద గా గరిరి। సా సనిదా। పదనిస రిసరిగ॥
లో. పడుచ । తన ।ము. మా ॥

పమ గరిసని
ని పమని॥

**అవతారిక**

ఈమె దివ్యా దివ్య, పరకీయ నాయకుని విచ్చలవిడితనమును తెలిసియు ఆతని గుట్టు బయల్పడనీయక కాపాడుచున్న తన మంచితనమును నాయకుడు గుర్తించి లాలించుటలేదని చెలికత్తెతో చెప్పుకొని వాపోవుచున్నది

**రాగం _తోడి - త్రిపుటతాళం**

ప ఏమంటినమ్మా ? నాసామి - నేమంటినమ్మా

అ ప · కోమలా, గిరో ! మువ్వ - గోపాల సామిని నే ॥ నేమంటి ॥

చ వామాక్షి నా సరి - వారు నవ్వేరని
వేమారు మాటాడ _ వెరచి నేనుండగ
నా మనసింతైన - నాధుడు తెలియక
ఆమందయానతో - ఆడుకొన్నాడట ! ॥ ఏమంటి ॥

2 బలిమి వానిగుట్టు - బయలుదేరనియ్య
నలివేణి తగవుగా - దని నేనుండగ
చెలువుడు నామేలు - తెలిసి తెలియలేక
కలికితో పలుమారు - గసరు కొన్నారట ! ॥ ఏమంటి ॥

3 ముచ్చట తీర మా - మువ్వ గోపాలుడు
పచ్చవిల్తుని కేళి - బరగ నన్నుగూడి
విచ్చలవిడి దాని - యిచ్చకములకేమో
గచ్చులాడితో నెంతో - నొచ్చుకొన్నాడట ॥ ఏమంటి ॥

ప: . రి । సా । సా . ॥ సా . । సా । . ॥
.. ప । మం . । టి . . ॥ నc . . . । మ్మా । . . ॥
. . రి । సా . । . ॥
నా । సా । ॥

2 రి స రి ని స రి । రి గ గా । గ రి రీ ॥ సా । సా । సా ॥
మి నే । మం । టి ॥ నం । మ్మా । . ।
. . . . రి । సా . । రి గ రి స ॥
. . . నా । సా . । ॥

3. రి గ రి ని స రి । గా । మా ॥ మ ద గ గ రి ని । సా । సా ॥
మి . నే । మం । టి ॥ న । మ్మా । ॥
. . రి । సా । రి గ రి స ॥
. . నా । సా . । ॥

4 ని స ధ ని స రి । గా మా । దా ని స ని ద ॥ మ ద గ గ రి ని । సా । .
మి . నే । మం । టి . ॥ స . । మ్మా . । ॥
. . . రి । సా రి గ । స రి ని స ॥
. నా । సా . । . ॥

5. ని ధ నీ స రి । గ మ ద ని । స రి నీ ద మ ॥ ప ద నీ ద మ గ రి । సా । . ॥
మి . నే . । మం . . । టి . . . ॥ నం . । మ్మా . । . . ॥
రి । సా స రి । గా మా ॥
. నా । సా . । .

6 దా మా పా । దని సరి గా । సరినీ దని ॥ సరినీ దమగరి । సా . । . . ॥
మి నే । మం । టి ॥ న . । మ్మా . । . . . ॥
. రి । సా సరి । గా మా ॥
నా । సా । ॥

7 దద మా దా । గా గరిరీ । రినిదని ॥ దనిసా సరినీదమ । గ రిసా । . ॥
మి నే । మం । టి ॥ న । మ్మా । ॥
దా । పా దనీ । దమగరి ॥ సరినీ ధ ని
. నా । సా । ॥ మి ॥ నేమంటినమ్మా ॥

అ ప. రి । గా . । మా ॥ పా దని దా । దసనీ । సా ॥
కో । మ । లాం ॥ గి . రో । ము . । వ్వ ॥
రిపనిద . ద । నిసరగ । గరిరీ ॥ సరినిదమగమ । పదమా గరి । సరినీ ధని ॥
గో । పా । ల ॥ సా . . . । మి . । ని ॥
రిసా ని సా । రిగా రి । రీసా ॥ సా । సా . । ॥
నే నే । మం । టి ॥ న । మ్మా । . ॥

2 రి । రిమగా । మా - ॥ పదనిదపమ । ద పదని । సా ॥
. . కో । మ । లాం ॥ గి రో । ము . । వ్వ . ॥
రిస నిదపద । నిసరిగ । రినిదమ ॥ సా సరినీదమ । పదమా గరి । సరినీ ధని ॥
. . గో । పా । ల . । సా . । మి । ని ॥
రిసా ని
నే నేమంటినమ్మా ॥

చ పద । పా । పా ॥ మా మ పద ప మా । మా పా । ప ప మ గ ॥
వా । మా . । ఊ . ॥ నా . । స । రి ॥

గా . గ మ । నీ ని ద । దా ద మ ॥ దా ని స నీ ని ద । ప ద ని ద । ని ద ప మ ॥
వా । రు । న ॥ వ్వే । ర । ని ॥

ప గ మా నీ । ని ద ద మ । మ గ గ రి ॥ రి సా । రి స ని ధ । ధా ॥
వే । మా . । రు ॥ మా । టా . । డ ॥

ని ధ ప మ ప ధ । ధ స నీ । సా ॥ స రి గా . । మా పా ద ప మా । పా ॥
వె ర । చి । నే ॥ నుం । డ । గ ॥

దా । దా । దా . ॥ దా ని స ని ద ద మ । మా ద ప మా । పా గ మా ॥
నా । మ । న ॥ సిం । తై । న ॥

గా గ మ । నీ । ని ద ద ప ॥ ప ద ని స రి గ । గ రి రీ । సా ॥
నా । ధు । డు . ॥ తె లి । య । క ॥

1 స రి । గా । మా ॥ మ ధ మ మ గ రి । రి స రి ని । సా ॥
ఆ । మం । ద ॥ యా . న . . । తో । ॥

సా పా ప ద । ని స రి గ । గ రి రీ ॥ సా స రి నీ ద మ । పా ద ని ప ద మా । ప మ గ రి ॥
ఆ । డు . । కొ ॥ న్నా । ద । ట . ॥

2 రి సా ని స రి । గా । మా ॥ పా ధ ని పా ప ధ మ గ । గ రి రీ । సా ॥
. ఆ । మం . । ద . ॥ యా . . న । తో । . . ॥

సా పా ప ద । గా రీ । నీ దా ॥ సా స రి నీ ద మ । ద మ గ రి । రి స రి ని ॥
. ఆ । డు . । కొ ॥ న్నా . । డ . । ట . . ॥

సా . ని
. ఏమంటినమ్మా ॥

**అవతారిక ,**

పరకీయ, విరహోత్కంఠిత అయిన ఈమె తన స్వామిని స్వాభిమానమును సహితము వదలి పలుకొమ్మని ప్రార్థించుచున్నది

రాగం - తోడి - త్రిపుటతాళం

ప. మ్రొక్కెర ! చలమేల ? - మువ్వగోపాలుడా !

అ ప. అక్కరతో నీ కౌగిట - అలము కోరాయీవేళ ॥ మ్రొక్కెర ॥

చ ఆరుదుగాదా ? నీ మేలు - అలిగేది యీపాటిచాలును
సరసమాయె నెమ్మెలు - చాడి వింటివి గాబోలు ॥ మ్రొక్కెర ॥

2 మారుడేసే పూవుదూపు - మనవాయింతైనరాపు
కోరియున్నాను నీ ప్రాపు - కోపమైతె యెంత సేపు ॥ మ్రొక్కెర ॥

3 నన్ను పలికివి చాల - ననవిల్తు కేళీదేల
మొన్నటి చలమిక నేల - మువ్వగోపాల యీవేళ ॥ మ్రొక్కెర ॥

ప : .... పా । ప ప మ గ । మా ॥ ప ద । ని ని పా । దా ॥
.. . మ్రొ । క్కె . . । ర ॥ . . . చ ల । మే- । ల ॥
....ద ని । సా . . । సా ॥ సా ని రి స ని । ని ద ని స । ని ద ప మ ॥
....ము . । వ్వ . . । గో . . ॥ పా . . । లు . . . । డ ॥

2 పగమాపా । ప పమగ । మా ॥ . . గద । నినిపా । దా . ॥
. . . ౖమొ । క్కే . । ర . ॥ . . చల । మే . । ల . ॥
. . . దని । సా . . । సా ని ॥ దని సా రిసనిద । పదనిస । నిదనిద ॥
. ము । వ్వ । గో ॥ పా . । లు । డ ॥

3 పమగమపా । ప పమగ । మా ॥ . పద । నినిపా । దా ॥
ౖమొ । క్కే . । ర ॥ . చల । మే । ల ॥
. . దా । గా రీ । నిసా ॥ పదనిసా । నిసరిస దనిసని । దపమ ॥
. . ము । వ్వ । గో . ॥ పా . । లు . । డ ॥

పగమా
. ౖమొక్కెర ॥

అ. ప. రిస । నిదనిస । నిదాప ॥ పామదపా । గమగ । మానిప ॥
. అ । క్క । ర . ॥ తో నీ । కా । గి ॥
దపదాదని । సా । సా ॥ సని రి సని । నిదా । పాదప ॥
ట . నల । ము . । కో ॥ రా యీ । వే । ళ ॥

2 దానీ సరి । నీసరిసని । దానిసనిద ॥ పదనీద । పామద । సగ గ ॥
అ । క్క . । ర . ॥ తో . నీ । కా . । గి . ॥
మాదపదాగని । సా । సా ॥ సరిగసిసరి । గనిసా । పదసిస ॥
ట నల । ము । కో ॥ రా యీ । వే । ళ . ॥

3. నిదనీసరి । నీసరిసని । దానిసనిద ॥ పాదనీద । పామద । పమగ ॥
. అ । క్క . . . . । ర . . . . ॥ తో . నీ . । కా । గి . . . ॥

మా పద । నిసరిగ । సరినిస ॥ దానిసాని । దనిసరి । సనిదప ॥
ట నల । ము । కో ॥ రా . యీ । వే . . । శ . ॥

4. దానీసా । రిగసరి । నిసదని ॥ నిదని రిసనీద । పదనిస । నిదపమ ॥
అ । క్క . । ర ॥ తో నీ . । కా . । గి ॥

పగమా పద । నిసరిగ । రీసా ॥ సరిగనిసరి । దనిసా । పదనిస ॥
ట నల । ము . । కో ॥ రా . యీ । వే । శ . ॥

నిదపమ
. ప్రొక్కెర ॥

చ పద । నినిపా । దా ॥ పా . । దపమగ । మాదప ॥
. అరు । దు । గా ॥ దా . । నీ । మే . . ॥

దా దని । సా . । సా ని ॥ దనిసారిసనిద । పా . । మా . ॥
లు అలి । గే . । ది ॥ యీ । పా . । టి ॥

గమదపపమ । గరిరీ । సా । . ॥
చా । లు । ను । ॥

రిస । నిదనిస । నిదాప ॥ పామదపా । పపమగ । మా ॥
. సర । స . । మా ॥ యే నె । మ్మే . . । లు ॥

దపదాదని । సా । సా ॥ సానిరిసని । దనిసా । పదనిస ॥
చా । డి । విం ॥ టి వి । గా । బో ॥

నిదపమ
లు . . ప్రొక్కెర ॥

**అవతారిక** :

ఈమె స్వీయ మధ్య విరహోత్కంఠిత స్వామి తనమీద అలిగినాడని వాపోవు చున్నది మధుర కథన చతురయగు చెలి 'నావంటి చెలియుండ నీవేల చింతించెదవని, నీ స్వామిని తోడితెచ్చెద,' అని చెప్పి ఈమెను ఊరడించుచున్నది

**రాగం - తోడి - ఆదితాళం**

ప నెలత అతడు అలిగేదివెల్ల - నెనరు గాదటవే ?

అ ప వెల వెల బోనేల మోము - చెలువునితోడి తెచ్చెదనె ॥ నెలత ॥

చ కాటుకకన్నుల నీరు - ఘనమైన నీలములవలెనె
పైటతడిసి రవికదూసి - గుబ్బలపై నిండెనె
యేటికి యీ వట్టివెతలు - యిందువదన వెరవనేలే
నేటి మాపటివేళ - నీవిభుని నినుగూర్చెదనె ॥ నెలత ॥

2 వాని ప్రేమ తెలియకనె - వలపు నీవు నిలుపలేక
మేనెంతో కరిగె గాక - మెలకువ దెలియక
ఓ నాతిరో నన్నువినా - నూరడించే చెలులున్నారా ?
నే నీదాననై నందుకు - నీ వారుల వేడదగునా ! ॥ నెలత ॥

3 వనిత మువ్వగోపాలుడౌ - వరదుడు నిన్నుగూడి ఆ
వెనుక కనులెత్తి యేచెలినైన - జూచునా ?
మనసు గట్టిచేసుకోవే - మగువ నామాట నమ్మవే !
కినుక వలదే తాళుకోవే - వనబోణి గెలుపునుండవే ॥ నెలత ॥

ప సరి గా మా నినిపా । దా దదమా । దనిసరి సనిదని॥
నెల త అ త । డు అ । లి గే ॥

సా సనిదా । పా పమగా । గరిరీ సా ॥
ది ఎ । । ల ॥

దమదని సానిద మగమద నీదమ । గరిగమ ధామగ । రీరిని సా ॥
నె న రు . । గా । ద ట వే ॥

2 సరి గా మా నినిపా । దా దదమా । దనిసరి సనిదని ॥
నెల త అ త । డు అ । లి గే ॥

దనిసరిగరి నిద మదనిద మగరిగ । మగరిని ధనిసరి । గమపదనిస
ది ఎ - । । ల్లి ॥

సరిగ నిసరి దనిస పదని దమగరి । గమదని సరినిద । మగరిని సా॥
నె . న రు । గా । ద ట వే
॥ నెలత

అ ప. పదనీ పదమా పా పమగమ । మదపా దా । దసనీ సా ॥
వె ల వె ల బో । నే ల । మో . ము ॥

సనిదని సరిగా గరిరీ సా । సరిస నిదమ మద । మ మగరి సరిగమ ।
చె లు వు . ని తో । డి . తె చ్చె । ద . నే . .

పాపగ మా మానిని దాపమ । పా । . ॥
నె ల . త అ . త . । డు . . । . ॥

చ

రిగ మా మాదమ మగగరి । సరినీ రీ । గా మా ॥
వని త ము వ్వ । గో పా । లు డా ॥

గమ దదమా దా దనిసా । సనిదా దదమగ । గరిరీ సా ॥
వర దు డు ని । న్ను గూ । డి ఆ ॥

సరి సా సనిధా ధసాని । సా సా రి । గా మా ॥
వెనుక క ను లె । త్తి యే । చె లి ॥

దని సారినిదమదని దమగరి । సా । ॥
నై న ఝూ . చ । నా .। ॥

సరి గా మా మదపా । దా దని । సా సా ॥
మన సు గ ట్టి । చే సు । కో వే ॥

దని సా సా సనిదా । దమ మద నీసని । దమగరి సా ॥
మగు వ నా మా . । ట న । మ్మ . వే ॥

పదనీ॥ పదమా పాపగ మా । మదపా దా । దసనీ సా ॥
కి ను క వ ల దే । తా కు । కో వే ॥

సనిదని స రి గా గరిరీ సస । సరిని నిదమ మద । మమగరి సరిగమ॥
న న లో . . ణి . . గెలు । పు న . నుం . । డ వే . ॥

పాపగ మా మా నినిదా । పా । . ॥
నెల త అ త . । డు । ॥

**అవతారిక.**

ప్రౌఢ నాయికయగు ఈమె తనకు తోచిన శుభ శకునములు చెలికి చెప్పుకొని ఈవేళ విజయరాఘవ శౌరని విడిదలో సేవించుకొనుటకు అదృష్టము కలిగినదని సంతోషించుచున్నది. ఈ పదమునందు క్షేత్రజ్ఞులు చక్కటి శకునము లను మూడింటిని చెప్పియున్నారు ప్రొద్దున లేచి నిలువుటద్దమున పొడగాంచుట పూర్ణ కుంభములను దర్శించుట, ద్విజరాజుల సేవించుట, అను ఈ శుభ శకునములను ఎంతో అందముగా ఈ పదమున దిలి చరణములలో అమరినవి ఇందుగల 'పద నిసరిస దనిసని దపమ గ' అను రాగ సందర్భము చాలా అపురూపము ఈ పదమును కాంభోజిరాగములోనిదిగా అచ్చుపుస్తకములలో ఉన్నది కాని తోడి రాగములోనే మాపాఠము

రాగం - తోడి - త్రిపుటతాళం

ప సుదినమాయెనే ! యీప్రొద్దు సుదినమాయెనే యీప్రొద్దు

అ ప. మదనావతారుని సేవ - మనకు కలిగెనమ్మా ॥ సుదిన ॥

చ ప్రొద్దున నిలువుటద్దము - బొడగన్న ఫలము ఈ
ముద్దుమోము చూడగలిగె - ముద్దులగుమ్మ ! ఈ ప్రొద్దు ॥ సుదిన ॥

2 ప్రొద్దున పూర్ణకుంభములెదురైన - ఫలము యీ
భూపాలకుంజరునినే - బొడగంటినమ్మా ! ఈ ప్రొద్దు ॥ సుదిన ॥

3 ద్విజరాజులసేవించిన - దివ్య శకునఫలము ఈ
విజయరాఘవ శౌరిని నే - విడిదిలోగంటినమ్మా ! ఈ ప్రొద్దు ॥ సుదిన ॥

పా పగమా । మా ని నిదపా । పా దప దా ॥ పదప దనీ । సా । ॥
సు ది న । మా । యే ॥ నే । ।

ద నిసా . గ । సనినిప । దా ॥ దమమనినిద । దమమగ । గరిరీ ॥
యీా । ప్రొ । ద్దు ॥ సు ది న । మా । ఏ ॥

సా । . । ॥ (1) దాపా ఎగ । మా ని నిదపా । దా ॥
నే । । ॥ యీా । ప్రొ । ద్దు ॥ ॥ సుదిన ॥

2 వ దనిసరిస దనిసని । దపపమ । పా గ మా ॥
యీా । ప్రొ. । ద్దు . ॥ ॥ సుదిన

అ.ప దప । దా గా । గరిరీ ॥ సా । సనినిప । దా ॥
. . మద । నా । వ ॥ తా । రు । ని ॥

పదపదనీ । సా । . ॥ దని । సా . । సనినిద ॥
సే. . । వ । , ॥ . మన । కు . । క ॥

దమామదమ । మగగరి । రీసా ॥ పద నిసరిసదనిసని । దపపమ । పా గమా
ని గె. . । న । మ్మ . ॥ యీా . . । ప్రొ . । ద్దు .
॥ సుదిన

చ రి మ । మా । మా ॥ మతపపపమ । మగగరి । రీసా ॥
. . ప్రొ । ద్దు । న . ॥ ని . లు . । వు . । ట ॥

రీసారి । గా . । మా ॥ మా మాదపపగ । మాదప । దా ॥
ద్దము . । పొ । డ ॥ గ . . న్న । ఫ ల । ము ॥

దా  ద ప । దా . గ । గ రి రీ ॥ సా  . । స ని ని ప । దా . ॥
యీ . ము । ద్దు  । మో . ॥ ము · । చూ । డ ॥

ప ద ప ద నీ । సా । ॥ ద ని । సా । స ని ని ద ॥
గ లి । గే । ॥ ము । ద్దు । ల ॥

ద ప మ ప మ గ । గ రి రీ । సా ॥ ప ద ని స రి స ద ని స ని । దపపమ । పా గ మా ॥
గు । మ్మ । ॥ యీ । ప్రొ । ద్దు ॥

॥ నుదిన ॥

**అవతారిక**

పరకీయయగు ఈమెను స్వామి ఎంత గారాబముగా లాలించి ఆనందింప చేయుచున్ననూ, ఎప్పుడో చిరుకోపముతో ఏమియో అన్నాడని ఈమెకు కోపమువచ్చినది అది తెలిసి చెలి 'అతడు సామాన్యుడా! పరమాత్ముడైన మువ్వగోపాలుని హస్తము సోకినంతనే సరసిజాక్షి నీజన్మము సఫలమాయనే నీపై గల ప్రేమానురాగములతో అతడు ఏదైన ఒకమాట అనుటయో ఒకపనిచేయుటయో జరిగిన దానికి నీ వలుగ తగునా?' అని మందలించుచున్నది

**రాగం - తోడి - త్రిపుటతాళం**

ప సరసిజాక్షి! నీ జన్మము సఫలమాయెనే

అ ప. పరమాత్ముడైన మా మువ్వ గో - పాలుని హస్తము సోకినంతనే! ఓ! ॥ సరసి ॥

చ నమ్మికలిచ్చి నీవు నన్నెంతకైనను - అమ్మకొమ్మనగ
సమ్మతిగ ముద్దు ముద్దుగ నిన్ను - రొమ్మునుంచగ
నెమ్మితో రాతిరి పగలువాడు - నీవద్దయుండగ
కొమ్మరో! కోపమువచ్చినంతనె
కొట్టరాదటవే! ఓ చెలియరో ॥ ॥ సరసి ॥

2 నలినాక్షి! నీ వెంత కసరుకొన్న - నవ్వుచేసుకోగా
చెలువముగా నీకు తగిన సొమ్ములు - సింగారించగా
వెలది నీ కురులు దువ్వి - విరులు దురునుగా
అలుకవచ్చినచేత ని - న్నదలించరాదటవే ఓ చెలియరో ॥ సరసి ॥

3 సారెకు నీకు దృష్టి దాకినని - చాటున నుంచగ
చేరి మువ్వగోపాలుడు - నీకు సేవ చేయగాను
కోరినప్పుడె నిన్ను గూడి - కూరిమి కొసరగ
(శ్రీ)రామ! రామ! నిన్ను వాడు - చెనకరాదటవే ఓ చెలియరో ॥ సరసి ॥

స రి సా రి । గా । మా ॥ మా మ ని ని ద పా । పా ద వ । ద ని స రి ॥
స ర సి । జా । క్షి ॥ నీ - । జ । న్మ . ॥

సా ద ని । సా సా రి ని । ని ద ద మ ॥ ద మ గ గ రి రి । సా । ॥
ము స ఫ । ల । మా ॥ ఏ । నే । ॥

2 రి సా రి । గా . । మా ॥ మా మ ని ని ద పా । పా ద ప । ద ని స రి ॥
స ర సి । జా . । క్షి ॥ నీ . । జ । న్మ ॥

సా ద ప । ద ని స రి । గ రి రి స ॥ ని స రి ద ని స । ప ద ని స । ని ద మ గ ॥
ము స ఫ । ల . । మా ॥ ఏ . । నే । ॥ సరసి ॥

అ. ప . ద ని । సా । సా ॥ స రి గ రి స ని । ని స ని ద । దా ॥
ప ర । మా । త్మ ॥ డై । న । మా ॥

దా ప మ । పా . । ప మ మ గ ॥ మా మ ని ద । పా ద ప । ద ప ద ప ॥
. ము . । వ్వ । గో ॥ పా । లు । ని ॥

ద ప ద ని స రి । స రి నీ । ని ద మా ॥ గా గ ద ప । ప ప మ గ । గ రి రి ॥
హ . . । స్త । ము . . . ॥ సో . . । కి । నం . ॥

సా . . । స న్ని ధా । నీ . ॥ సా . . । స ని ద మ । గ రి రి ॥
త . । నే . . । . . ॥ ఓ . . । . . । ॥ ॥ సరసి ॥

**అవతారిక ,**

ఈ పదమునందలి నాయిక సామాన్య ప్రౌఢ అతృప్త

గనుకనే నాయకుని స్పష్టముగా' **హితవైనచోటనీహితవింతేగాక నే నింపొదునటరా !'** అని అడుగుచున్నది ఈపదమున ' మ గ ప మ ' అను ప్రయోగము అక్కడక్కడ కనబడుచున్నది విజయరాఘవ ముద్రాంకితముగా ఈ పదమును శ్రీ విస్సా అప్పారావుగారు, శ్రీ గిడుగు సీతాపతిగారు, మొదలయినవారు అచ్చువేసియున్నారు కాని ' వితరణశూర మువ్వగోపాలుడ ' అను పారము మా గురువులు చెప్పియున్నారు గనుక ఆ పాఠమునే ఇందు పొందుపరచితిని

రాగం - సావేరి - త్రిపుట తాళం

ప హితవైనచోట నీ హితవింతేగాక
నే నింపొదునటరా ?

అ ప వితరణశీలుడ మా మువ్వ గోపాలుడ
విందువ నామాట ఓ జాణ ॥ హితవైన ॥

చ ముచ్చటైన ఒక్కముద్దు బెట్టెదనంటే
మోమెత్రు జేసేవు
పచ్చితేరగ దానిపలుకెంపులుంచితే
బాగాయననియుందువా ఓ జాణ ॥ హితవైన ॥

2 ఇందు నే చేపట్టి - యింటికిరమ్మంటే
యెంతైన కసరితివి
సందిటపై గోరులు - సఖియ యుంచితే
సంతోషపడియుంటి - ఓ జాణ! ॥ హితవైన ॥

3 ఇసుమంత సేవు నన్నేలి - మువ్వగోపాల
యింటికి పొమ్మంటివి
రసికుడా దానింట - రాతిరి నాలుగు జాములు
రమ్యముతో నుంటివి ఓ జాణ! ॥ హితవైన ॥

ప. స రి । మా । మా ॥ మా । మా । ప మ గ స ॥
. హి త । వై . । న ॥ చో । ట । నీ ॥
రి రి మ । పా । దా పా ॥ మా మ గ । ప మ గ స । రి ॥
హిత । విం । తే ॥ గా । క . । నే . ॥
రి స రి । రి దా । ద ద ప మ ॥ గా రి . । సా . । సా . ॥
నిం . । పొ । దు ॥ న ట । రా । ॥

2 . . స రి । మా . । మా . ॥ మా మ ప దా । ద ద ప మ । గా గ స ॥
. . హిత । వై । న , ॥ చో । ట . । నీ ॥
రి . రి మ । పా । దాపా ॥ మా . మగ । పమగస । రి . ॥ రి . . స రి । రిదా । దదపమ ॥
హిత । విం . । తే . ॥ గా . । క . . । నే ॥ నిం । పొ । దు ... ॥
గా రి . । సా . । సా . . ॥
న . ట । రా । . ॥

అ ప సా పప । పమదప । దా ॥ దా సా । సా । సా ॥
వి త । ర । ణ ॥ శ్రీ . । లు । డ ॥

రి సనిదపద । సరిమా । గగరీ ॥ రీ సా । రిసనిప । దా ॥
మా ము । వ్వ । గో ॥ పా । లు । డ ॥

దా మప । దా గరి । సా ॥ సా । ససనిప । దా ॥
వి ం । దు । వ ॥ నా । మా । ట ॥

మా పదపా ద । మా పద పద । పమగస ॥ రీ
ఓ । । జా ॥ ణ

2 మా పద పా దని దా । మా పద పా ద । పమగస ॥ రి
ఓ । । జా ॥ ణ

3 సా రిస రిమపదసా । సా । సని దా పదమా ॥ గగరీ
ఓ . । । జా ॥ ణ హితవైన ॥

చ మా । మా । మా ॥ మా । పమగస । రి ॥
ము । చ్చ । టై ॥ న । ॰ । క్క ॥

రీ రిమ । పా దప । దా పా ॥ మా గ పమగసా । రి । రీ ॥
ము । ద్దు । బె ॥ ట్టై ద । నం । చే ॥

రీ.. స రి। రి దా। ద పా మ॥గా గ స। రీ .।సా ॥
... మో ।మె ।ర్ర ॥ జే ।సే ।వు ॥

...దా।పాపమ।దపదా॥సా.సా ।సా ।రిసనిప॥దా .పద।సా.రి గస।రీ ॥
.. ప ।చ్చి ।తే ॥ర గ.।దా ।ని .॥ .పలు।కెం ।పు.॥

సా ।ససనిప।దా ॥దా మప।దాగరి।సాసా॥సా సా ।ససనిప।దా ॥
లుం. ।చి .।తే .॥ ..జా ।గా ।యోన॥ని యుం।దు ।వ ॥

సా రిస రిమపద సా।సా ।సని దా పదమా॥గగరి
ఓ । ।జా ॥ణ హితవైన॥

**అవతారిక :**

దివ్యా దివ్య అయిన నాయిక స్వీయప్రౌఢ

గనుకనే 'నా పుణ్యము చక్కనౌ నాటి దినములెల్ల నన్ను చేపట్టలేదా! ఈపట్ల విడనాడె - వెన్నెల చీకటి ఎవరికైన లేదా వానితో వాదా?' అని ఎంతో వినయ వినమ్రతతో తన భాగ్యమునే తలచుకొన్నది గాని స్వామి సహచర్యము పొందిన ఇతర కామినులను కాని, స్వామినికాని పల్లెత్తుమాట అనలేదు 'బావిలో నీరు వెల్లువ బోవునటవే!' అని తనయందు స్వామివారికి గల ప్రేమానురాగమును బావిలోని నీటివలె స్థిరమైనవని తన చెలికి చెప్పుకొనుచున్నది

**రాగం - సావేరి - త్రిపుటతాళం**

ప. లేమరో! మా మువ్వగోపాలుడెంతైన - లెస్సయుండితే చాలునే

అ. ప వేమారు దూరేది తగవా? బావిలో నీరు
వెల్లువ బోయ్యీనటవే? యెంతటి దిటవే ॥ లేమరో ॥

చ నాపుణ్యము చక్కనౌ నాటిదినములెల్ల - నన్ను చేపట్టలేదా?
యీపట్ల విడనాడితే వెన్నెల చీకటి
యెవరికైన లేదా? వానితో వాదా ॥ లేమరో ॥

2. పలుమారు నావెతజూచి నొచ్చిననోట - బలుక పొయ్యేరుసుమ్మీ!
అలిగి మీచేతనే నాడించినట్లైతే
అతని మనసు నొచ్చునే యేమివచ్చునే ॥ లేమరో ॥

3 కన్నెరో ననుగూడి కౌగిటలీనమై - యుండ మువ్వగోపాలుడు
వెన్నవంటి మనసు రాయిచేసుకొన్నాడు
విడనాడి యిందు రాడు మోముజూడడు ॥ లేమరో ॥

ప. సా రి స । రి మ పా మ । పా ॥ పా ప మ । ద ప ద ప । పా ద ప దా ॥
లే । మ । రో ॥ మా । ము । వ్వ ॥

దా. మ ప । దా దా గ రి । సా ॥ సా । స ని ని ప । దా ॥
గో । పా । లు ॥ డెం । డై . । స ॥

పా సా రి స । రి మ ప ద ప ద సా । స రి దా ద ప ॥ మా పా ద ద ప మా . । గా గ స । రి రి ॥
. తె । స్స । యుం . ॥ డి తే . . । చా . । లు ॥

అ ప సా . పా । ప మ ద ప । దా . ॥ సా . . । సా . రి రి స ని ప । దా . ॥
నే . వే । మా . । రు ॥ దూ । రే . । ది . ॥

ద ప పా దా । సా . । సా రి గ గ రి ॥ సా రి స రి ప మ గా । గ రి రి । సా ॥
త గ . । వ . । . ॥ బా . . . . । వి । లో . ॥

సా . . । స ని ని ప । దా ॥ . ద ప । దా దా గ రి । సా . . ॥
నీ . । రు । . ॥ . వె . । ల్లు . . । వ . ॥

సా । స నినిద । పా ప మ ॥ దా । పా । ॥
బో । య్యో . । న ట ॥ వే . । . । ॥

పా మ పా దని । దపదమ మా । గ గ రీ ॥ సా
ఎం త । టి । ది . ట ॥ వే లేమరో ॥

చ దా । పా । పా ॥ పా । పా । ప మ ద ప ॥
నా । పు । ణ్య ॥ ము । । చ ॥

దా సరి । రి మ ప ద ప ద సా । స ని దా ద ప ॥ సాపా ద దపపమా . । గాగస । రీ రీ ॥
క్క నౌ । నా . । . టి ॥ ది న । ము । ల . ॥

సా సా రి స । రీ ప మ గా । గ స రీ ॥ సా । స ని ధా । సా రి మా ॥
ల్ల న । న్న । చే ॥ ప । ట్టి । లే ॥

పా మ ప దా ద ప ప మ । పా । ॥ పా । ప మ ద ప । దా ॥
. । దా । ॥ యీ । ప । ట్ల ॥

రీ సా । సా । సా రి రి సనిప ॥ దా ప ద । సా రి గ స । రీ ॥
వి డ । నా । డి ॥ తే వె । న్నె । ల . ॥

సా రి స రీ ప మ గా । గ రి రీ । సా ॥
చీ । క । టి ॥

మ ప । దా దా గ రి । సా ॥ సా । స ని ని ప । దా ॥
ఎ వ । రి . । కై ॥ న । లే । వా ॥

పా మ పా ద ని । ద ప ప మ మా । గ గ రీ ॥ స
వా . రి । తో । వా ॥ దా వేమారు ॥

**అవతారిక .**

ఇందలి నాయిక స్వీయ ముగ్ధ

గనుక నే చెలిమికత్తెలు 'అలుకో పొలయలుకో' తెలియలేక తికమకపడుచున్ననూ ముగ్ధ గనుక చెలులతో చెప్పుకొనుటకే సిగ్గుపడుచున్నది. కలహాంతరితయగు ఈమెను ఊరడించుటకు చెలులుచేయు ప్రయత్నములు ఎంతో రసవంతములగు మాటలలో క్షేత్రజ్ఞులు ఈపదము చెప్పియున్నారు

**రాగం _ సావేరి - త్రిపుటతాళం**

ప అలుకో పొలయలుకో ! - తెలియదమ్మలార !

అ ప తలపులు తెలియవనెను - తాళరే మీరు చెలులార ॥ అలుకో ॥

చ కన్నె చిన్నతనమేమంటే - కన్నులు తేలవేసెను
చిన్నెలుచూచి యాపె విభుడు - చిరునవ్వు నవ్వెను ఓయమ్మా
ఉన్నరీతిదేమంటే _ యువిద ! యెంతేని యసురుసురనేను
వెన్నుని నేనదలించితే - విని విన నట్లుండెను ॥ అలుకో ॥

2 చెలిని విభుని భుజముపై - జేరుకపోతే వలదని
సొలపున చెంగట కూ - ర్చుండమనెను
అలివేణి ! యతని కెమ్మోవి _ యానెదననియందుకోబోతే
చెలువుడావలిమోమై తన - చెక్కిలి గదియించెను ॥ అలుకో ॥

3 రమ్మని తిల్ల గోవింద - రాజా! యని పిలిచి
కొమ్మరో! తన పేరు మువ్వ - గోపాలుడనెను
యెమ్మెతో మీయిద్దరు - నెనసియుంటిరా? యంటె
నెమ్మితో నాపె కద్దనెను నెలత, యతడు తలయూచెను ॥ అలుకో ॥

ప రిసారీ । పా । పాపమ ॥ దపాపదా । సా । . ॥
అ లు । కో । పొల ॥ య లు । కో । ॥

సనిపదపా । పా మ । పాదని ॥ ద పాపామ । గగరీ । సా ॥
తె లి । య । ద ॥ మ్మ । లా । ర ॥

2 రిసారీ । ద దపమ । దపదా ॥ దపాపదా । సా రి । గారీ ॥
అ లు । కో । పొ ల ॥ య లు , । కో । ॥

సరిగరిసని । దదపమ । దదమద ॥ సా । నిదపమ । గగరీ ॥
తె లి । య । ద ॥ మ్మ । లా । ర ॥

అ ప॰ దపాదా । సా । సా ॥ సనిపదా. । సా రి । గారీ ॥
త . ల । పు । లు ॥ తె లి । య । ॥

సరిరీపమ గరి । రీ . । సా ॥ దదగరిగరి । సా. । సనిదా ॥
వ లె . . . । ను . । . ॥ తా. । ళ । రే ॥

పమపదపద । సా రి । గా. ॥ రిసనిదపమ । దదపమ । గసరిస ॥
మీ . । రు । . ॥ చె . లు . . । లా. । . ర . ॥ అలుకో ॥

చ దా । పా । పా ॥ పా పమ । దదపా । దా ॥
క । న్నె । చి ॥ న్న . । త . । న ॥

పమా పదా । ద దపమ । గగరీ ॥ రీ సరి । ప మా ప । గగరీ ॥
మే । మం । జే ॥ క । న్ను । లు ॥

రీసా । సనిపధ । సా రి ॥ గా రీ । మపదా । పా ॥
తే । ల । వే ॥ । సే . । ను ॥

పా . మా । మా । మా ॥ మపా మప దపాద । దపామ । ద దపమ ॥
. చి । న్నె । లు . ॥ చూ । చి । యా ॥

దా । పాపమ । పా ॥ పా దదస । సనిదా । ద పామ ॥
పె । విభు । డు ॥ చిరు । న । వ్వు ॥

దదపమ పదమా । గగరీ । సా ॥ రీసా రి । గాసా । రీ ॥
న । వ్వే । ను ॥ ఓ । య । మ్మా ॥

దా । పా । పా . ॥ పమా పదా । దపపమ । గగరిరి ॥
ఉ । న్న । రీ ॥ తి దే । మం । జే . ॥

సా । రి సనిప । ధా . ॥ సా . రిగస । రీ . । రీ . ॥
ను । యు వి । ద ॥ ఎం . । తే । ని . ॥

సరిప మా ప । గగసా । రీ . ॥ సా రీ । మపదా । పా . . ॥
యసు . । రు . । సు ॥ ర . . । నే . . । ను . . ॥

దపా దా । సా । సా ॥ సనిపదా । సా రిం । గా రీ ॥
వె న్ను । ని । నే ॥ న ద । లిం । ॥

సరిరీపమగరి । రీ । సా ॥ దదగరిగరి । సా । సనిదా ॥
చి । తే । ॥ వి ని । వి । న . ॥

పమపదపద । సా రి । గా రీ ॥ రిసనిదపమ । దదపమ । గసరిస ॥
న । ట్లుం । ॥ డె । ను . । ॥ అలుకో ॥

**అవతారిక**

ఈమె స్వీయ నాయిక 'తాళి మొకరికన్నావద్దా' అని సఖి ఈమెను మందలించుచూ 'మీ తగవులు తీర్చుటకే మా కాలము సరిపోవునట్లున్నది చిరుకోపముతో అతడొక మాట యన్న, నీవైన నూరకోనరాదా! పాలు నీరువలె కలసియుండవలసిన మీ యిరువురిలో ఏలనే ఈ తగవులు?' అని బుద్ధులు చెప్పుచున్నది అచ్చుపుస్తకములలో ఈ పదము సావేరి రాగములో నున్నది మంగళకైశిక రాగమున మా పాఠము

మంగళకైశిక రాగము భాషాంగము రెండు మధ్యమములును సందర్భానుసారముగ నిందు వచ్చును వెంకటమఖి సంప్రదాయమున చ్యుత పంచమ మధ్యమము ఈ రాగమున చెప్పినను, ఏలనో దీనిని భాషాంగమనలేదు మాయామాళవగౌళ జన్యముగా ఇప్పుడు దీనిని పరిగణింపవలసియున్నది అతిప్రాచీనరాగమగు ఈ మంగళకైశిక 72 మేళకర్తల పద్ధతి రాక మునుపే ఎంతో ప్రచారమున నున్నది

స రి గ మ ప మ ద ని సా - స ని ద ప మ గ రి సా అను ఆరోహణావరోహణములు కలిగియున్నను, 'గ మ $\overset{2}{\text{మ}}$ మా $\overset{2}{\text{మ}}$ గ రి సా - స ని రి గ మా' - 'మ గ ద ప స ని రి స' అనునవి విశేషప్రయోగములుగా గుర్తించుకొనవలయును ఇచ్చట ఒక విషయమును మనము చెప్పుకొనవలసి యున్నది మేళకర్తల పద్ధతికి పూర్వముండిన రాగములు చాలావరకూ ఆరోహణావరోహణముపైగాక కొన్ని ముఖ్యమైన స్వర సందర్భములు గల రాగపుఛాయలతోనే ఎక్కువగా గుర్తింపబడుచుండెడివేమోనని అనుకొనవలసియున్నది ఇందుకు మంగళకైశికి, ఆహిరి, ఘంట, సైంధవి, నవరోజు, మారువ ద్విజావంతి, గౌరిపంతు, మొదలగు రాగముల స్వరూపములే మనకు ఉదాహరణములు.

రాగం - మంగళకైశిక - త్రిపుటతాళం

ప తాళి మొకరికన్నా వద్దా - ఓ చెలియరో

అ ప లోలాక్షి ! మువ్వ గో - పాలునికి నీకు మాటలైతే ॥ తాళి ॥

చ వాడలుగ నీవలుగ వళమె మీకై తిరుగు
లాడినది చాలునే యెవరు మెత్తురే
చూడగ మీరినట్లున్నది మీకు కోపము
వీడక ముక్కున నున్నది ఓ చెలియరో ॥ తాళి ॥

2 చలమున వాడొకటంటె సైగగా నూరకుండక
చెలియరో ! యిదేటి కోపము చెల్లునె మీతోడ
చెలిమి చేసిన పాపము యెందుకె మీకు
వలువని మనస్తాపము ఓ చెలియరో ॥ తాళి ॥

3 ఎలమి పాలు నీరువలెనె - కలసి మువ్వగోపాలునితో
చెలియరో ! యీచలమేటికి ? యిటువంటిగుణము
చెల్లునే నీవంటి మేటికి వివేకమింత
వలువదా లెస్సాయెను నేటికి ఓ చెలియరో ॥ తాళి ॥

ప : . . స రి । రి మా । మా . . ॥ గ మ్మా మ మ్మా । మా మ్మ ద । మ్మా మా ॥
. . తా . । ళి . । మొ ॥ క రి . । క . న్నా

గా మ మ్మ మా మ్మ గ । రి గ రీ । సా ॥ సా స ని ధా । రి స రీ । గా ప మ గ రి ॥
వ । ద్దు . . । ॥ ఓ । చె । లి . ॥

అ ప సా గ మ । దా । ద ని ని ద ॥ ద మా పా । పాపమ గా । మా ద ప ॥
య లో । లా । ను ॥ ము వ్వ । గో । పా ॥

దా ని ని । ద ని సా । స ని రీ ॥ సా స ని । దా ద మ । పా ప మ గ రి ॥
లు ని । కి । నీ ॥ కు మా । ట । లై ॥

సా
తే తాళి మొకరి ॥

చ స ని ధా । రీ సా । రీ ॥ మ గ మా మ్మ ద మ్మ మ్మ । గ మ మగరీ । సా ॥
వా . । డ లు । గ ॥ నీ । వ లు । గ ॥

స రి । గా । మా ॥ ద ప దా . । ని ని దా । పా . ॥
వ ళ । మే । మీ ॥ కై । తి రు । గు ॥

. మా । మ గ మ్మా । మా ॥ గ మ మ్మ మా గ । రి గ రి । సా . ॥
. లా । డి । న ॥ ది । చా । లు ॥

సా సని ధా । రీ । రీ ॥ మ గ మా మ్మ ద మ మ్మ । మ గ రీ । సా . ॥
నే ఎ వ । రు । మె ॥ త్తు . । రే । . . ॥

. . స రి । గా . । మా ॥ ద ప దా । ని ని దా । పా ॥
. చూ । డ । గ ॥ మీ రి . । న . . । ట్లు . . ॥

పా మా । మ గ మ్గా । మా ॥ గ మ మ మా గ । రి గ రి । సా . ॥
న్న ది । మీ । కు ॥ కో . । ప । ము . ॥

గ మ । దా । ని ని దా ॥ ద మా పా । ప ప మ గ । మా ద ప ॥
. వీ । డ । క ॥ ము । కు్క । న ॥

దా ని ని । ద ని సా । స ని రీ ॥ సా స ని । దా ద మ । పా ప మ గ రి ॥
ను । । న్న ' ॥ ది ఓ । చె । లి . . ॥

సా
య తాళిమొకరి ॥

**అవతారిక**

ఈ పదమునందలి నాయిక పరకీయ, తృప్తాతృప్త నాయకుని చేష్టలకు తా నెట్లు పరవశురాలైనదియు చెలికత్తెకు చెప్పుచూ, 'అంతటి జాణతనముగల వానిని మాట చమత్కారముగల నీవే తిరిగి తోడుకొనిరాగలవు' అని వేడుకొనుచున్నది

మారువ రాగము ఇప్పటి మాయామాళవగౌళ జన్యమని చెప్పుకొనవచ్చును ఈ రాగము ప్రాచీనము వెంకటమఖి సంప్రదాయమున భాషాంగము, దేశీయము పదమునందు గల మారువ రాగమున ఆరోహణావరోహణములు ఇట్లున్నవి స మ గ మ ద ని స - స ని ద ప గ మ గ రి స ఈ స్వరములన్నియు మాయామాళవగౌళ స్వరములే గనుక ఈ రాగము భాషాంగముకాజాలదు ఉత్తరదేశపు సంగీతపద్ధతియందు 'మారువ' యను నొక రాగము గలదు కాని అది సంపూర్ణముగా దీనికి భిన్నము గనుక దేశీయరాగమనుటకు అంతగా సావకాశము కానరాదు రాగములలో కాలక్రమమున కొన్ని మార్పులు వచ్చు చుండుట అందరూ ఎరిగిన విషయమేకదా! గనుక దీని నిట్లు వదలి రాగమునందలి విశేష ప్రయోగములు గమనించుడు 'పా గ మా గ దా ద ని సా', 'సా రి గ రి స నీ', 'స గ మ ద పా' 'స ని దా', 'స రి గా రీ', 'ప మ ప గ మ గ రీ' ఇవి రాగమునకు సూచనలుమాత్రమే! తక్కినవి పదముల నభ్యసించి గ్రహించునది

రాగం - మారువ - త్రిపుటతాళం

ప. అమ్మమ్మ! వీడెంత నెరజాణడైనాడే!

అ ప ఎమ్మెలాడి! మువ్వగోపాలు నిటు తోడితేవే ॥ అమ్మ ॥

చ చిరునవ్వు నవ్వుతావచ్చి చేపట్టినదే కాని
మెరుగు పయ్యెద తీసే దెరుగలేనైతి నమ్మా!
కురులు నెరులు తీర్చి విరులు చట్టినదే కాని
చురుకు కెంపు మోవిపై నుంచగ నేమి తెలియనైతి ॥ అమ్మ ॥

2 చెలియ! యేకాంతమునకు చవిమూచినదెకాని
వెలయు ముద్దుమాటలు విననేరనైతి
గళము ముద్దిడి నన్ను గారవించినది గాని
తళుకు చెక్కిట గోరుతగిలి నొగిలేమొ తెలియనైతి ॥ అమ్మ ॥

3 గరిమ మువ్వ గోపాలుడు కౌగిలించినదెకాని
యిరువురి మేను లొరసే దెరుగలేనైతి
విరుబోణి! పోక ముడివిడిచి అంతరంగమున
మరియేమో చేసెనో మగువ! యేమితెలియనైతి ॥ అమ్మ

ప సప। పా మ గా। మా ॥ దపదమ పా మ। గమ పా మగమ।
అ । మ్మ . । మ్మా ॥ పి . । డెం . . ।

గా రి పమగరి॥ సా గమ। పనిదా పని। సా ॥ సనిసరి సని దద పమపద।
త . . ॥ . నెర। జా . . । ణ ~ . ॥ డై . . . నా . ।

పనిసా। సనిదమ పమపమ॥ గరిగరిసా
. । దే . . . ॥ .

అ ప. . పమ। పా । పపమగ॥ మదపదా.। పామ పా । పానీ॥
. ఎ . । మ్మో . । లా . . . ॥ డి . . । ము । వ్వ . ॥

సా . సని । సాగమ గరి । సాసని ॥ సరి సా ని పద పా మ । పద మా ప పమ ।
గో . పా . । లు . । నిటు . ॥ తో డి । తే ।

గా మ పమ గరి ॥ సా
. వే ॥ అమ్మమ్మ ॥

చ. పద । దమ పా । ప ప మా ॥ గమ పా మ గమ గా రి । పమ గరి సా ని ।
చిరు । న । వ్వు ॥ న వ్వు । తా ।

ధపనీ సా ॥ . . సగ । మాపమ గమ । పాదప మప ॥ నినిపా నినిదా దదమా ।
వ చ్చి ॥ చే । ప । ట్టి ॥ న దే గా ।

పమ గా మా । పా ॥ దమ । పా । పపమగ ॥ మదపదా । పా మ పా । పానీ ॥
. . । ని ॥ మెరు । గు । పై ॥ ర్యో ద । తీ । సే ॥

సా స ని । సాగమ గరి । సాసని ॥ సరి సా ని పద పా మ । పద మా ప పమ ।
ది . ఎరు । గ . । తే ॥ నై తి । న . ।

గా మ పమ గరి ॥ సా . పద । దమ పా । పపమా ॥ గమ పా మ గమ గా . రి ।
. మ్మ . ॥ కురు । లు । నె . . ॥ రు . లు . . ।

పమగరి సా ని । ధపనీ సా ॥ సగ । మాపమ గమ । పాదప మప ॥
తీ . . . । . ర్చి ॥ . విరు । లు . . । చు . . ॥

నినిదా నినిపా దదమా । పమగా మా । పా ॥ . . దమ । పా । పపమగ ॥
ట్ట న దే । గా । ని ॥ చుకు । కు । కె . ॥

మదపదా । పా మ పా । పా నీ ॥ సా సని । సా గ మ గరి । సా స ని ॥
మ్మో వి । పై । నుం ॥ చ గ । నే । మి ॥

సరిసా నిపదపా మ । పదమా పపమ । గా మపమగరి ॥ సా
తె లి । య నై । . . తి ॥ అమ్మమ్మ ॥

**అవతారిక**

ఈ నాయిక స్వీయ, ముగ్ధ, కలహాంతరిత అన్యాయత్తచిత్తుడైన నాయకుని చేష్టలను గమనించియు, తనయందే తప్పును ఆరోపించుకొని, తాను చేసిన పనులు వివరించి, నాయకుడు తనయందు విముఖుడై యుండుటకు కారణము తెలుసుకొనలేకుంటి నని చెలికత్తెతో చెప్పుకొనుచున్నది

**రాగం - మారువ - త్రిపుటతాళం**

ప ఎంత మాటలాడెనమ్మా - యింతిరో నావిభుడు నన్ను

అ ప చెంతచేరి మోవితేనె - చప్పనని మోమటు త్రిప్పెనేమో ॥ ఎంత ॥

చ రమ్మని చేబట్టి నేను మా యింటికి - రా రమ్మంటి
నీ వెవరో ? నే నెవరో ? నేను - నీ వాడు గాదు పొమ్మనెను ॥ ఎంత ॥

2. కులుకు గుబ్బల రొమ్ము గుమ్మ - కౌగిలీయను నే బోతే
ఉలికి లేచి కసరుకొని వనిత నీతో
పొందు చాలు పొమ్మనెను ॥ ఎంత ॥

3. చెలియ మా మువ్వ గోపాలుని - చిత్తము రంజిల్ల చేసి
యెలమిపైకొని ఉపరతి సేయగబోతే
ఈ పొందు వద్దు పొమ్మనెను ॥ ఎంత ॥

ప.  . సప । గా మ గా మ । రి ॥ సా రిగరిస నిసాని । సా రి సా రి । గా ॥
. ఎం. । త । మా ॥ టా డె । న । మ్మ . ॥

గరిసప । పా గ మా । దా నినిదా ॥ నిసరి సా రిగ రిసనిసాని ।
యిం । తి । రో ॥ నా వి . ।

దద పా గ మ గ । పా గ మ గరి ॥ సా.
ఖు డు । న ॥ న్నూ ఎంత ॥

అ. ప  పా గ । మా గ మా గ । దాదని ॥ సా । సా ని సారిగ । రిససా సా ని ॥
. చెం. । త । చే. ॥ రి । మో । వి ॥

సారిగా రిరిగారి । సారిగ రి స । సనిసా సనిదా ॥ పా పా గ । మా గ దా ।
తే . . నే . . । చ ప్ప । న. . ॥ ని మో । మ . ।

నినిదని సా ॥ సా రి గ రిస సని సరిసని । దదపగ మగ దద । పగమగ రిగరి ॥
టు . . . . ॥ త్రి . . . . ప్పె . । నే . . । . మో . ॥

సా . .
. . . ఎంత ॥

చ. సా రి । గ రి సా రి గ । రి స నీ స ని ధా ॥ స ని స గ మా మ గ మ ద పా ।
. ర । మ్మ . । ని . . ॥ చే . ప . . . , ॥

స ని ద ని సా స ని । దాపా ॥ పా ద । ని ని దా ప దపా । ప ద మా మగరీ॥
ట్టి నే । ను ॥ . మా , । యిం టి . । కి ॥

స రి గా స రీ । పా గ మా గ । రిగరీసా ॥ . పా గ । మా గ మా గ । దాదని ॥
రా ర । మ్మం . । , . టి ॥ . నీ . । వె . । వ . ॥

సా . । సా . ని సా రి గ । రి స సా సా . ని ॥ సా రి గా . రి రీగారీ ।
రో . । నే . । నె . ॥ వ . . రో . ॥

సారిగ రి స । సనిసా సనిదా ॥ పా పా గ । మా గ దా । నినిదని సా ॥
నే ను । నీ ॥ వా డ । ను గా । - - ను ॥

సా రి గ రి స స ని స రి స రి । ద ద ప గ మ గ ద ద । ప గ మ గ రి గ రీ ॥
పో మ్మ . । నె . . . . . । . న ॥
సా

మ్మ ఎంత ॥

**అవతారిక :**

ప్రౌఢ నాయిక యగు ఈమె పరకీయ రాక రాక తన ఇంటికి వచ్చిన స్వామికి ఎదురేగి, తోడితెచ్చి, అలంకరించి, కస్తూరి నామముపెట్టి, సరసోక్తులతో సంతోషపరచి, 'చలువ చప్పరములో సరమాడేటంతలో కోడికూసె నయ్యయ్యో! నా గుండె ఝులు ఝల్లుమనె నమ్మా' అంటుంది ఈ పదము అచ్చుపుస్తకములలో సౌరాష్ట్రరాగమని వేయబడియున్నది మా పాఠము బౌళి

ఈ బౌళి రాగము ప్రాచీనరక్తిరాగములలో ఒకటి దీనిని పూర్వాచార్యులు ఘన రాగ ఉత్తర పంచకమున చేర్చియున్నారు వెంకటమఖి సంప్రదాయమున క్షేత్రజ్ఞుని పదము నందున్నట్లే యున్నది ఇది మాయామాళవగౌళ జన్యముగా ఇప్పటి గ్రంథకర్తలు వ్రాసి యున్నారు.

**ఆరోహణ :** స రి గ ప ద స - అవరోహణ స ని ద ప గ రి స అని యుండుటచే ఇది 51 వ మేళమయిన కామవర్ధని జన్యమనిననూ అనవచ్చును ఉత్తరదేశస్థులు ఇదే ఆరోహణావ రోహణములు గల రాగమును 'త్రివేణి' అని అందురు పదమునందలి రాగ సంచారములు అతి మనోజ్ఞములు మాటలయందలి భావములను అందముగా వెలువరించగల స్వర సందర్భములు గమనార్హములు

**రాగం - బౌళి - త్రిపుటతాళం**

ప : కోడికూసె నయ్యయ్యో నా - గుండె ఝల్లు ఝల్లుమనే నమ్మా ॥

అ ప॰ చేడెరో నాసామివద్దచేరి - నేనే మాటాడునంతలో ॥ కోడి ॥

చ చెలువుని కెదురేగి - చెలగించి తోడితెచ్చి
కలపమ్ముమై నిండ - అలది కస్తురి నామముబెట్టి
కలువరేనితో - కలహము ముగియించి
చలువ చప్పరములో - సరసమాడేటంతలో ॥ కోడి ॥

2 విరులు శిఖనిండజుట్టి - వింతగా సొమ్ములుబెట్టి
బురుసు రుమాలుజుట్టి - పొందుగా తురాయి చెక్కి
సరసుని మోవి జూచి - సారె సారెకు ముద్దుబెట్టి
గురు కుచములతో రొమ్మ - గుమ్మిపై కొనేటంతలో ॥ కోడి ॥

3 మ్రొక్కి వేడికొని యెంతో - మోహమున ముద్దు బెట్టి
అక్కరో! సిగ్గింతలేక - ఆవేళ నీవివదలించి
మక్కువమీర మదన - మం ... ... ... నిల్లుజేర్చి
చక్కని మువ్వగోపాల - సామితో కలసేటంతలో ॥ కోడి ॥

ప సా స రి । గా । పా ॥ పా । ప ద ద ప ప గ । ప గ ద ప ॥
, కో . । డి . । కూ. ॥ . . సే . । న . . . । య్యే . . . ॥
దా . । పా . ॥ గ ప ద సా . । స ని ని ప । దా . ॥
యో్య । ॥ నా । గుం । డె ॥
దా గ గ । పా ద ని । దా పా ॥ పా గ గ ద ప । ప ప గ రి । సా ॥
. ఝు లు । ఝు । . లు ॥ మ నే । న . । మ్మా . ॥

అ ప పగ । దపదప । దా ॥ సా రి గా పగ । గ రి రీ । సా ॥
చే । డే । రో ॥ నా । సా । మి ॥

రీ । సా సా రి గ । రి స సా ॥ స ని దా । పా ద గ । పా ॥
. వ । ద్ద । జే ॥ రి . . . । నే । నే . ॥

గా । పా దని । దా పా ॥ పా గ గ ద ప । గ ప గ రి । సా ॥
మా । టా । డు ॥ నం । త । లో ॥ కోడి ॥

చ గగ । పా । పా ॥ పా ద ద పా । దా । ద ప ద ప ॥
చెలు । వు । ని ॥ కె దు । రే । గి ॥

ద ప ద ప గ గ । పా పా ద ని । దా పా ॥ పా గ గ ద ప । ప ప గ రి । సా . ॥
. చెల । గిం । చి ॥ తో . డి । తె । చ్చి ॥

. స రి । గా ప । గ రి రీ ॥ రి స సా । స ని ని ప । ధా ॥
క ల । ప . । ము . ॥ మై । నిం । డ ॥

సా స రి । గా ప । గ రి రీ ॥ రీ సా స రి । స రి ధా । సా ॥
.. అల । ది । క ॥ స్తురి । నా । ॥

సా రి గా . । పా . । పా . ॥ పా . ప గ । ద ప ద ప । దా . ॥
మ ము । బె । ట్టి . ॥ . క లు । వ . . । ల ॥

సా రి గా పగ । గ రి రీ । సా . ॥ సా స రి । గా ప । గ రి రీ ॥
రే . . । ని . । తో . . ॥ క ల । హో । ము ॥

రీ సా । స నినిప । దా ॥ దా గగ । పా పద । సా ॥
ము గి । యిం । చి . ॥ చలు । వ । చ ॥

సనిదదనిద । దా పా । పదగా ॥ పా గగ । పా దని । దా పా ॥
ప్ర ర . । ము . । లో ॥ సర । స । మా ॥

పా గగదప । పపగరి । సా ॥
దే . టం । త . । లో ॥ కోడి ॥

**అవతారిక**

విరహోత్కంఠితయగు ఈ నాయిక కలహాంతరిత, స్వీయ 'నన్ను, నా గుణమును, నా ప్రేమను తెలిసిన నీవు నన్నిట్లలయించుట న్యాయమా! నాకు చెలికత్తెవైన నీవే - చెలువుడవైన నీవే ఇంతేకాదు చింతించిచూడ నా జీవస్వామివి నీవే ' అని తన సర్వస్వమైన మువ్వ గోపాలస్వామికి చెప్పుకొనుచున్నది ఈ పదము అచ్చుపుస్తకములలో **బిళహరి** రాగమని యున్నది కాని మాకు **బౌళిలో** పాఠము

**రాగం - బౌళి - త్రిపుటతాళం**

ప ఇంత తెలిసియుండి - యీగుణమేలరా ?

అ ప పంతమా మువ్వ గో - పాల! నా సామి! ॥ ఇంత ॥

చ **అలుకచేసి** యింటికి రా - వైతివి ఎవరైన
చెలికత్తెలున్నారా! పిలువ వచ్చేరా ?
చెలికత్తెవైన నీవె - చెలువుడవైన నీవే
**తలచిచూడ** నా **పాలి** - దైవము నీవే నా **సామి** ॥ ఇంత ॥

2\. వింతదానివలె నన్ను - వేరుచేసిరావైతివి
అంతరంగులున్నారా ? నన్నాదరించేరా ?
అంతరంగమైన నీవె - ఆదరించిన నీవె
చింతించి చూడ నా - జీవనము నీవె నా సామి ॥ ఇంత ॥

3 శ్రీనిధి! మువ్వగోపాల! చేపట్టి నన్నేలితివి
నా నేర్పు లెవరైన ఆ - నందించే రా ?
నా నేర్పులైన నీవె - నమ్మికలిచ్చిన నీవె
అనగా బలికెద నా - ఆనందమైన నీవె నాసామి ॥ ఇంత ॥

ప. . దా । పా దని । దా పా ॥ పా ద దపపగా । పదపా గప । గరి గరి ॥
ఇం । త . । తె ॥ లి సి । యు౦ । ॥
సా సరి । గా పాదప । గరిగరి ॥ స రిగా రి రిగపా గ । గప దా దపపగ । పా ॥
డి యూ । గు । ణ ॥ మే । ల । రా ॥

అ ప పమ । పా ద సా । సా రి గ స ॥ రీ సరి । గా ప గ । గ రి రి ॥
పం । త । మా ॥ మా ము । వ్వ । గో ॥
సారిగ రిస సనిదా । పాదగ । పా. ॥ సరిగా రిరిగ పా గ । గపదా దపపగ । పా ॥
పా . । ల . । . . ॥ నా . . । సా . । మి ॥
ఇంత ॥

చ. . సరి । గా ప । గగరీ ॥ సా రిగరీ । రిసనిధ । సా . . ॥
అలు । క . । చే ॥ సి . । యిం . . . । టి ॥
సా సరి । గా । పా ॥ పా దదపగ । పా పద । ని నిదా ॥
కి . రా వై । తి . ॥ వి . ఎ . । వ । రై . . ॥
పా పగ । పా । దా ॥ దా పగ । పా దని దస । సనిదా దప ॥
న . చెలి । క । త్తె ॥ లు . । నా్న . . । ర . . . ॥

పగ పాదప గరి। సా.రి గరి। గా ॥ పాపద దపపగ। పా । ॥
పి. లు. . .। వ . । వ. ॥ చ్చే । రా । ॥

. . సరి। గా ప। గ గరీ॥ సారి గరీ। రిసనిధ। సా .॥
. . చెలి। క. త్తె। ॥ తై .। న । నీ ॥

సా సరి। గా । పా ॥ పాదదపగ। పాపద। నినిదా॥
వే. చెలు। వు । డ. ॥ వై న । నీ । . ॥

పా .పమ। పా దసా। సా రిగస॥ రీ సరి। గాపగ। గరిరీ॥
వే ,తఅ। చి । చూ ॥ డ .నా। పా । లిదై॥

సా రిగ రిస సనిదా। పాదగ। పా ॥
వ ము । నీ । వే .॥

సరి గా రి రిగ పా గ। గపదా దపపగ। పా ॥
నా. . । సా । మి ॥ ఇంత।

**అవతారిక**

విరహోత్కంఠితయగు ఈ నాయిక ప్రౌఢ, స్వీయ తనయందు ఎంతో అనురాగము గల నాయకుడు ఒకప్పుడు తనను లాలించిన విధములు, పలికిన పలుకులు, తలచుకొని విరహార్తయై తన చెలికత్తెతో చెప్పుకొని దైన్యమును పొందుచున్నది

నాదనామక్రియ రాగము ప్రాచీనము ని స రి గ మ ప దా - ద ప మ గ రి స నీ అను ఆరోహణావరోహణములు కలిగియున్ననూ మధ్యస్థాయి యందలి నిషాదమును కొంచెముగా సోకెడి సంగతులు కలిగియున్నది 'ప ని దా పా' అను ప్రయోగమున కించిత్ కైశిక నిషాదము కూడ వేయుట వైణికుల సంప్రదాయము గనుక దీనిని భాషాంగమనియే చెప్పకొనవలెను. ఇది ఇప్పటి మాయామాళవగౌళ మేళ జన్యము వెంకటమఖి సంప్రదాయమున ఈ రాగమును సంపూర్ణ సంపూర్ణముగా నిచ్చి మాయామాళవగౌళమేళమునకును, దీనికిని అంతగా భేదము లేదేమోనని తోచుచున్నట్లుగా చెప్పియున్నారు. క్షేత్రజ్ఞుని పదమునందు కనుబరచిన రాగ స్వరూపమే ఇప్పుడును వాడుకలోనున్నది

రాగం - నాదనామక్రియ - త్రిపుటతాళం

ప. అయ్యయ్యో వెగటాయెనే

అ. ప. పయ్యెదపై జేరి పవ్వళించే సామికి ॥ అయ్యయ్యో ॥

చ వెలది నా మోము రెప్ప - వెయ్యక కనుగొన
కలయనిండు సంజ చీ - కటి గ్రమ్మితే
కలికి నీ ముద్దుమోము - కానరాక యుండునని
తెలిపి ప్రొద్దుండగానే - దీపము తెమ్మనె సామికి ॥ అయ్యయ్యో ॥

2. వనబోణి ! వినుమమ్మ ! - నాపై చాల ప్రేమచే
తనదంతమున నా అ - ధరము నొక్కి
మొనసి మాటాడితే - మోవి విడువ వలెనని
యనువచే సైగ - లాడుచున్న సామికి ॥ అయ్యయ్యో ॥

3 మదిరాక్షి ! వినుమమ్మ ! - మా మువ్వగోపాలుడు
నిదురించిన కౌగిలి - వదలీనని
పదరికయ్యమీది దు - ప్పటి కొంగులు నాలుగు
ముదముతో గట్టిగా - ముడి గొనుమను సామికి ॥ అయ్యయ్యో ॥

ప . రిసనీ। రి మగ। గా ॥ గా సరి। గమపద మ। గస రీ॥
. అ ।య్య ।య్యో ॥ వెగ। టా । . యె ॥

అ ప॰సా .సరి। మా .। మా ॥ మా....। గామపమప। గా ॥
నే .ప.।య్యే ।ద ॥ పై । జే । రి ॥

గా . మా। మగమా। పాపమ॥ మామపదప దా। మపపాదప। పాపమ॥
... ప ।వ్వ ।రిం ॥ చే . । సా . । . . ॥

గమా గమ పమ। గమగరి। గా. ॥
మి . . । కి ...।... ॥

2 గా రిసనీ । రి గమప దపమద । పమమా మా ॥ మా . . । గామప మప । మా గ మా గ ॥
. పై । య్యో । ద - ॥ పై . । జే . . । రి . . . . . . ॥
గా గామగ । మగమా । పాపమ ॥ మా మపదప దా । మప పాపని । దపపమ ॥
ప । వ్వ । రిం ॥ చే . । సా । . ॥
పమ గా గమ పమ । మా ద పమగా । గా ॥ గా సరి । గ మపద దమ । గస రి ॥
మి . । కి । ॥ వెగ । టా । . యె ॥
సా . .
నే అయ్యయ్యో ॥

చ. . సరి । మా ప మా ప । మా గ మా గ ॥ మా । మా । మా . . ॥
వెల । ది . । నా . ॥ మో । ము । రె ॥
గా మా । మ గమా । పా . ॥ పా పద పా । పా । దపపమ ॥
వ్వ వె । య్య । క ॥ క . ను . । గొ . . । న . . ॥

2. గా సరి । రిగమప దపమద । మా ॥ మా । మా । గామప మప ॥
. . వెల । ది . . । నా ॥ మో . . । ము । రె . ॥
మగా గరి । రిగమప దపమద । మా ॥ పావద పా । పా । దపపమ ॥
వ్వ . . వె । య్య . । క . ॥ క . ను . । గొ . . । న . . . ॥
గా రిని । రి । గా . ॥ గా । గా । గా ॥
. కల । య । నిం . ॥ దు . । సం . । జ . . ॥
రి రిసి । రి . । గా . ॥ రి మా । మా ప మా . ప । గా . ॥
చీ । క . । టి . ॥ గ్ర . । మ్మి . . . । తే . . ॥

గా . . మ మ । గా । గా ॥ రి స ని రీ । గా । గా ॥
క లి । కి . । నీ ॥ ము ద్దు । మో . । ము ॥
గా స రి । మా । మా . ॥ గా . . । గా . । గా . ॥
కా । న . । రా ॥ క । యుం । డు ॥
రి స ని రీ । గా గా । గా . ॥ గా . మా । మ గ గ మ । పా ప మ ॥
న ని । తె లి । పి ॥ ప్రొ । ద్దుం । . డ ॥
మా మ ప । మా మ ప ద ప । దా ॥ ప మ పా । ప మ మా । గా ॥
గా । । నే . ॥ దీ । ప । ము . ॥
శా ద పదపని దా । పా . । మా ॥ గామప మామప । గా । రి స నీ ॥ సా .
తె । మ్మ । నె ॥ సా . । మి । కి . ॥ . . . .
అయ్యయ్యో ॥

**అవతారిక**

ప్రౌఢ యగు ఈ నాయిక పరకీయ, విరహోత్కంఠిత ఈమె పనుపగా చెలి నాయకునివద్ద కరిగివచ్చినది ఆమెతో తననాయకుడు తుపాకుల కృష్ణరాయడు ఏమని ఆనతిచ్చెనో తన చెలిని దాచక చెప్పమని లాలనగా 'బంగారుబొమ్మా' అని పిలిచి యడుగుచున్నది.

ఫరజు రాగము ప్రాచీనము భాషాంగము కాదు ఇది యిప్పటి 15వ మేళమయిన మాయామాళవగౌళ జన్యము. స గ మ ప ద ని స – స ని ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు. ఇది దేశీయరాగమయిన కావచ్చు పదమునందలి సంచారములు గమనించినచో ఇది తన దేశీయభావమును పోగొట్టుకొని, కర్నాటక రాగములలో నొకటిగా కలిసిపోయినట్లే తోచుచున్నది

రాగం – ఫరజు – త్రిపుటతాళం

ప. ఏమనెనే సుద్దులు – ఏమే బంగారుబొమ్మా!

అ ప ఏమనెనే మరుగేల దాచకే
రామ తుపాకుల రాయడు నీతో ॥ ఏమనె ॥

చ. మానిని ముందుగా నా – మాట నీవెత్తితివో?
తానే పల్కరించెనో – దయ నాపై కలిగి
కానుక తనచేత – బూనెనో? యందిమ్మని
అన తిచ్చెనో? నామీద – ఆన ఓ చెలియా! ॥ ఏమనె ॥

2 వనితరో! వాడిడకు - వచ్చెదననెనో ? లేక
నను తోడితెమ్మనెనో ? - నాప్రాణవిభుడు
నెనరుతో మాటాడెనో ? - నేరమెంచెనో ?
వినిపింపు వానిమాట - వినముచ్చటయ్యీని ॥ ఏమనె ॥

3 వేడుక తుపాకుల - వేంకటకృష్ణుడు
కూడే వేళలోనే - నోడించితినంట
నేడాసుద్దులేమైనా - నీతో మందలించెనో ?
మోడిగ నున్నాడో ? - ముదితరో! వినిపింపవే ॥ ఏమనె ॥

ప స ని । సా మ గ । మా ॥ ద ప దా . । స ని ద ని । సా ॥
ఏ । మ । నే ॥ నే । సు . . । ద్దు . ॥
సా స ని । ప ద మ ప । మా ॥ మ గ మ ద ప ద । మ ప మ గ । రి రి స ని ॥
లు ఏ । మే । బం . . ॥ గా రు . । బో . । . . . ॥

అ ప సా సని । సామగ । మా . ॥ దపదామగ । మాదప । దా . ॥ సనిదా . । సనిదని । సా , ॥
మ్మా . ఏ । మ । నే . ॥ మ రు । గే । ల . ॥ దా చ । కే । రా . ॥
సా . స ని । సారిగ రిస । సరినీ ద ప ॥ మగమ ద ప ద । మ ప మ గ । రి రి స ని ॥
మ . తు । పా . . । కు ల . ॥ రా . . య . । డు . . . । నీ . ,  ॥
సా
తో ఏమనె ॥

చ: . మ ద । పా । పా . . ॥ ప ద ప ప ద ప । ప మ పా । ప ప మ మ ॥
. మా । ని . । ని . ॥ ముం దు । గా । నా . ॥

గా స ని । సా గా । మ గ మా ॥ ప ద పా దా । ప మ పా । మ గ మా ॥
. మా । ట . । నీ ॥ వె । త్తి । తి ॥

పా . స గ । మా ద ప । దా నీ ॥ సా । స ని దా । పా ద మ ॥
వో . తా । నే । ప ॥ ల్క । రిం । చె ॥

పా . మ గ । మ ద ప ద । మ ప మా ॥ ప మ గ మ గ రి । సా । ॥
నో దయ । నా । పై . ॥ క . లి । గి . । ॥

. . మ ద । పా । పా . . ॥ ప ద ప ప ద ప । ప మ పా । ప ప మ మ ॥
. . కా . । ను . । క . ॥ త . . న . . । చే . . . । త . . . . ॥

గా . . స ని । సా గా । మ గ మా ॥ ప ద పా దా । ప మ పా । మ గ మా ॥
. . . . బూ . । నే . . । నో . . . ॥ యం । ది . . । మ్మ . . ॥

పా , మ గ । మా ద ప । దా ॥ స ని దా . । స ని ధ ని । సా . . ॥
ని . ఆ । న . , । తి ॥ చ్చె . నో । నా । మీ ॥

సా . స ని । సా రి గ రి స । స రి నీ ద ప ॥ మ గ మ ద ప ద । మ ప మ గ । రి రి స ని ॥
ద . . ఆ . । న . . । ఓ . . ॥ చె లి । య । ॥

సా

పమ్మనె ॥

**అవతారిక :**

స్వీయ మధ్య విరహోత్కంఠిత యగు నాయికను, ఆమె సౌందర్యమును, సుందరము లయిన ఉపమానములతో దూతిక చెప్పుచూ ఆమె విరహమును వర్ణించుచున్నది

సౌరాష్ట్రి రాగము ప్రాచీనము ఇందు రెండు నిషాదములు వచ్చుచుండుటవలన ఇది భాషాంగము 'ని సా ని' అనునప్పుడు కాకలి నిషాదమును 'ద నీ ద పా' అనునప్పుడు కైశికి నిషాదమును పలికించుట సంప్రదాయము ఇందు గల ధైవతములన్నియు చతుశ్రుతి ధైవతములే గనుక దీనిని వాడుకలో చక్రవాకము జన్యమని చెప్పుట యుచితము.

వెంకటమఖి సంప్రదాయమున దీనిని మాయామాళవగౌళ జన్యముగానే చెప్పి యున్నారు కాని పదములు మొదలగు రచనలలో ఎచటనూ శుద్ధ ధైవత ప్రయోగము కానరాదు

స రి గ మ ప మ ద ని సా - స ని ద ని ద ప మ గ రి స అనునవి ఆరోహణావ రోహణములు ఇది రక్తి రాగము రాగ సంచారములు పదములను పరిశీలించినచో స్పష్టము కాగలవు.

రాగం - సౌరాష్ట్రి - త్రిపుటతాళం

ప : పతిరున రమణిన్ని గెలిచి నీ - వెట్లా రూపొదువో

అ. ప. చూతము రారా ! మదన నీ
చేతి బలిమి మా చెలియబలిమి ॥ ప తీరున ॥

చ. రాతిరనే యేనుగ నెక్కి - రాకాచంద్రుడు గొడుగుగాను
లేత తెమ్మెర మొదలైన బలముల - చేతగెలిచెద నంటివా ?
పోతుటేనుగు కుంభములే - పొలతి గుబ్బలు మోము చంద్రుడు
నాతి ప్రాణమూ చలువ తెమ్మెర - జాతి
వారిలో పగలు గలవా ॥ ప తీరున ॥

2 జంట విరిదమ్మిరెయెద - నంట గుమ్మెదనంటివా ?
దంటవే చెలికేలు దమ్మి - తమ్మి యొక్కటె సుమ్మి ?
తుంట విల్లొక్కటి నీది - తునియని విండ్లు చెలియ కనొ్బమలు
యింట గెలిచి రచ్చగెల వవలెనను - ఎన్నిక లేక బూనితివి ॥ ప తీరున ॥

3 అంచలు మాచెలిని జూచి - యడుగుబెట్ట వెంచిచూడ
పంచెవన్నెల చిలుక - పలుకులే చానపలుకులు
పంచబాణముల నీదు - పడతి చూపులే తూపులనగ
నెంచశక్యముగాదా మీద
నేలుకొన్నాడు మువ్వగోపాలుడు ॥ ప తీరున ॥

ప. ద ని । సా . । సా ॥ సా . । సా రి గ । రి స సా ॥
. . . ప । తీ . । రు ॥ న . । ర మ । ణి . ॥

స ని దా । దా పా । పా మ ॥ పా మ గ మ । పా ద ని ద ని । స ని ద ద ॥
ని . . . । గె లి । చి . . ॥ నీ . . వె . । ట్లా . . . . । . . . ॥

పా పదపమ। గ మగరి। స రి గ మ॥
రూ ।పౌ . । దు ॥

2 పా మదని। సా । సా స ని॥ రీ రి స సా। సా । ॥
వో ఏ । తీ । రు ॥నా । । ॥

అ ప పదపద। పమ మా మగరీ। సరిసరి॥ గమా దపమ। దద పా। దా .॥
. చూ । త . । ము. ॥ రా. రా । మ ద। న . .॥

దసా నిసరి। రి గా గ। గా పమ గరి॥ సా రి గ రి స నిదా । ద నిదస దప। పా ॥
నీ . చే । తి । బ ॥ లి మ . । మా । ॥

పా మగమ। పా దని దని। సా ని దద॥ పామ మగరీ। సా రిగమ। పాపమ॥
చె లి। య . । . ॥ బ . లి । మి . । . . ॥

దా . .
. ఏ తీరున॥

చ దనిదస। దదపా। పా ॥ పా పమ। గా మప మా ప। దపపమ॥
... వా ... । తి । ర ॥ వే . . । ఏ . . . । ను ॥

మా గ పమగరి । సారిస సరి। సా . ॥ సా సరిసరి। సా । స ని॥
గు . . . . । నె . । క్కి ॥ . రా । కా । . చం ॥

ధ ని ధ స ధ ధ ధ ధ। ధా ధ సా ని। సా రిరి॥ సా । సా రి। గ గ రీ॥
ద్రు . . డు । గొ డు । గు . ॥ గా. । ను । లే . ॥

సా ధ ని । సా . రి । గా రి ॥ మా గ గ మా । పా । పా . . ॥
త . తె . । మ్మొ . । ర ॥ మొ . ద . । లై . । న . . ॥

ద ని సా రి స ని స । ని ద ద ప । ప మ గ రి ॥ రి సా । స ని ధా । ధా పా ॥
బ ల . । ము । ల ॥ చేత । గె । లి . ॥

ధ పా ప ధా । స ధ నీ । సా రి రి ॥ సా స రి । గా । గా . ॥
చె ద । నం . । టి . ॥ వా పో । తు । చే ॥

మా గా । మ గ మా । పా మ ॥ ధా ని సా ని । ద ని దా । పా ॥
ను . గు । కుం । భ ॥ ము । . . । లె ॥

పా మ గ । మా మ ప । దా పా ॥ మా గా । స రి స రి । రి స సా ॥
. పొ ల । తి । గు ॥ బ్బ లు । మో । ము ॥

సా ని ధా । స ని స రి । రి స సా ॥ సా . . ద ని ద స । ద ద పా । పా . ॥
చం ద్రు . । . . । డు . ॥ . . నా । తి . । ప్రా . . ॥

ప మ ద ప మ మ । మ గ ప మ । గ రి స రి ॥ గా మ పా మ । దా ద ని । సా స ని ॥
ణ . మా । చ । లు ॥ వ . । తె । . మ్మొ . ॥

రి స రి । రి మ గా । గా ప మ గ రి ॥ సా రి గ రి స స ని దా । ద ని స రి । సా . ॥
ర . జా । తి . . । వా . , ॥ రి లో . । వ . గ . । లు . . ॥

సా రి సా ని । ద ద పా । పా మా ॥ ద ప మ గ రి స । గా మా । పా మ ॥ దా . .
గ . । ల . . । . . . ॥ వా . . . . । . . । . . . . ॥ . . .

॥ పతిరున ॥

**అవతారిక :**

ప్రేమ గర్వితయగు ఈమె స్వీయ, ప్రౌఢ ఈ పదమునందు మన సంప్రదాయము ననుసరించి అన్యోన్యానురాగవంతులయిన దంపతులు ఏడుజన్మలవరకు దంపతులుగానే పుట్టుచుందురను విషయమును క్షేత్రజ్ఞులు అతిమధురముగా చెప్పియున్నారు ఈ పదమునందుగల చరణములు మూడు ఒక్కొక్క చరణమున ఇద్దరిద్దరు దంపతులను ఉదహరించినారు వీరిలో నలుడు - దమయంతి, శ్రీరాముడు - సీత, హరిశ్చంద్రుడు - చంద్రమతి, అనుభవించని కష్టములంటూ లేవు శ్రీకృష్ణుడు - రుక్మిణి, రంగేశుడు - రంగనాయకి, మన్మధుడు - రతి, కష్టములే ఎరుగని సుఖములను అనుభవించినవారు నాయిక ' ఇద్దరివలెనే కూడి ఎవరున్నారురా - ఒద్దికతో మనవలెనున్నారా ' అనుచూ ' కష్టసుఖములు రెండిటిలోను నీ వెంట ఉన్నాను సుమా ! ' అని చెప్పుచున్నది మాటల యర్ధమునకు తగిన స్వర సందర్భములుగల ఈ పదము అతిమనోజ్ఞము

రాగం - సౌరాష్ట్రి - త్రిపుట తాళం

ప ఇద్దరివలెనే కూడి - ఎవరున్నారు ? తెల్పరా !

అ ప : ఒద్దికతో మనవలె - నున్నారా ? మువ్వగోపాలా ! ॥ ఇద్దరి ॥

చ : మున్ను నలరాజు నీవైతే - ఆ ముదిత దమయంతి నే నే
చెన్నుగ శ్రీకృష్ణుడు నీవైతే - ఆ చెలియ రుక్మిణిదేవి నేనే ॥ ఇద్దరి ॥

2 అల రఘురాముడు నీవైతే - అయిన సీతాదేవి నే నే
ఇలను రంగేశుడు నీవైతే - యేలిన రంగనాయకి నేనే ॥ ఇద్దరి ॥

3 సత్యహరిశ్చంద్రుడు నీవైతే - స్వామి! చంద్రమతి నేనే
నిత్యము మదనుడు నీవైతే - నీకు రతీదేవి నేనే ॥ ఇద్దరి ॥

ప . . సని । సా సాపమ । మ గ మా ॥ పద పా ద పమ మా । మగమా మగసా । రీ . ॥
. ఇ . । ద్ద । రి ॥ స తె । నే . । గూ ॥
రి . సగ మా । పా ద స । ద ద పా ॥ పా ప మ ద ప మ । మగమా మగసా । రీ ॥
డి ఎ వ । రు । . ॥ న్నా । రు । ॥
స ని సా స ని ధా ధా । ధ ని సా ని స రి । సా ॥
తె . . । ల్పె . । రా ॥

అ ప: . పదపద । పమమా మా । మా గ రీ ॥ సగమా మగమా పా । పా గ మా । మదద ప ॥
. ఓ . . । ద్ది . . । క ॥ తో . . . . . । మ న । వ ॥
దా సని । సామగ । గాపమ గరి ॥ సా రిగ రి సనిదా । ద సదస దప । పదపద పమ ॥
లె . ను । న్నా . । రా ॥ ము . వ్వ . . . . । గో . . . . । . . . ॥
మ గ మా మ గ రి సా । సా । . ॥
పా . . . । ల । . . ॥

చ• దనిదస । దాదప । పా. ॥ పా పమ । రి గమప దప । పమమా ॥
ము । న్ను. । న ॥ ల . । రా । . . జు ॥

మా మగపమ గరి । సారిస సారిస । రీ . ॥ సా సా ని సారిగ । రిస సా సని । ధా ధప ॥
నీ । వై । తే ॥ ఆ ముది. । త । దమ. ॥

దా ధని సా సని । ధనిసా నిసరి । సా ॥ పదపద । ప మమా మా । మా గరీ ॥
య్యం తి । నే । నే ॥ చె । న్ను । గ. ॥

స గమా మగమా పా । పా గమా । మదదప ॥ దా దని సా సని । దనిసా నిసరిస । రీ ॥
(శ్రీ) । కృ । ష్ణు డు ॥ నీ . । వై. . । తే. ॥

సా సా నిసని । సామగ । గాపమ గరి ॥ సా రిగరిస నిదా । దసదస దప । పదపద పమ ॥
ఆ చెలి । య । రు . . ॥ క్ష్మి ణి । దే. . . । వి . . ॥

మగమా మగరీ సా । సా । ॥
నే . । నే । . . ॥ ఇద్దరి॥

**అవతారిక :**

స్వీయ నాయిక యగు ఈమె మధ్య ధీర నాయకుని చేష్టలు తనకు తెలిసిననూ వ్యంగ్యముగాను, ఏమియు యెరుగనిదానివలెను, అతనికిమాత్రమే తెలిపెడు విధముగా సందర్భోచితములైన మాటలను చెప్పుచూ 'దోషహారతులిప్పింతునా! మల్లెపూల పాన్పుపై చల్లదనమునకు మొల్లలు పరపింతునా!' అని ఇనపురి స్వామియగు మువ్వ గోపాలదేవుని హేళన చేయుచున్నది.

రాగం - సౌరాష్ట్రి - త్రిపుటతాళం

ప చక్కనైయ్యా యేమి యుప - చారములే సేయింతును

అ ప నిక్కముగ శ్రీకర దోషహారతుల - నిప్పింతునో ॥ చక్క ॥

చ మల్లెపూల పాన్పుపైని - చల్లని మొల్లలే పరపింతునో
చల్లని వాసన గాలికి - చామరలే వేయి తునో ॥ చక్క ॥

2 మంచిగంధంబలదినే ఆకు - మడుపులందిత్తునో
అంచితమైన మోవి నొక్కితే - అందుకే రవలు చెక్కింతునో ॥ చక్క ॥

3. చక్కని మా యినపుర సామి - మువ్వ గోపాల యిం
నొక్కసారి నే నే యోల లాడింతునో ॥ చక్క ॥

ప . సా । దా దప । దనిసరి సరిసని ॥ దనీదపా । పమగమా పద । నిదపా
... చ । క్క । నై ... ॥ య్యా । ప . మి । .

ప మగమ ॥ మగాసరి సా । సని ధా ధసా ని । రి ॥
యు ॥ ప చా । ర । ము . ॥

గమపమ గసరి గమదా । పాదని సని । రిరిసని దనిసా ॥
లే . . సే । యిం . । తు ॥

దదపమ గమరిరి । సా । ... ॥
నో . . । . । . ॥

అ ప . . దని । సా । సా ॥ సని సా రిగ రిస । సా ని సా ని । దనీదపా ॥
. ని । క్క । ము . ॥ గా । శ్రీ । క ॥

పా మగమ । పాదని దనిసా । సనిదా దనీద ॥ పాపమగమ పదనిద ।
ర . . దో । ష . . । హో ॥ రతు లి ।

ప మగమ మగరి । రి ॥ రి పసా సా
ప్పిం . . . . । తు . ॥ నో . .

---

* ఈ పదమునందలి తక్కిన చరణములన్నియు మొదటిపంక్తి పల్లవివలెను, రెండవ పంక్తి అనుపల్లవివలెను పాడుకొనవలెను.

**అవతారిక :**

ఈ పదమునందు నాయకుడు నాయికను బ్రతిమాలుకొనుచున్నాడు 'ఆమె మనసు ఒకవేళ నవనీతము, ఒకవేళ పాషాణమట కూరిమితో నీవే నేననుట ఏమైననేమి ఎవరు చెప్పిన మాటలు విన్నదో ? ఏమో ! ఇప్పుడు తనయందు విముఖతను కనబరుచుచున్నది ' అని నాయకుడు వాపోవుచున్నాడు

రాగం - సౌరాష్ట్రి - త్రిపుటతాళం

ప ఇక నిన్ను నమ్మరాదే ఓ - యింతిరో ! మాటలే లే

అ ప ఒకవేళ నవనీతము - ఒకవేళ పాషాణము
అకట నీ చిత్తము - అమ్మయ్యో ! ఓ చెలియ ॥ ఇక ॥

చ సరసుడని మెచ్చుకొందువు - ఈవేళ నీ
చక్కెర కెమ్మోవి అన మందువు
తిరుగులేని కోపము తెచ్చుకొందువు - నాదు
సరసకురావు ఎంచక నిన్ను దూరేవు ॥ ఇక ॥

2. చెలువుడని భక్తి సేతువుతమి - దెలిసి ప్రేమచే జేరదీతువు
కలికిరో ! తిరుగ కాక సేతువు
చలమేల జేసేవు ? చాలు చాలు పదివేలు ॥ ఇక ॥

3 కూరిమి నీవె నే నంటివి మువ్వ - గోపాల! యని కూడియుంటివి
వేరేయింతుల జాడివింటి విడిచేదేలా ?
వారిజముఖి! యేల వాదాడ వచ్చేవు ॥ ఇక ॥

వ: గ మ । దా పా । పా మా ॥ మ గ ప మ గ మ । మ గ పా । స రి స రి ॥
. ఇ క । ని । న్ను ॥ న । మ్మ । రా . ॥
సా । రి రి స ని । ధా ॥ ధా రీ । సా . రి । గా రీ ॥
దే । ఓ . । ॥ . యిం । తి । రో ॥
గ మ ప మ గ రి । స రి సా । స రి స రి ॥ స ని ధా . । ని స రీ । సా ॥
మా । ట । . ॥ తే । . । లే ॥

అ ప . ని ద । పా । పా మ ॥ మ పా ద ని దా ప । మ గ రీ । సా ॥
. ఒ క । వే . । శ ॥ న . వ । నీ । త ॥
సా . గ మ । పా । పా మ ॥ దా . ద ని । సా । సా ॥
ము . ఒ క । వే । శ ॥ పా . . । షా । ణ ॥
సా స రి । సా రి । గా రీ ॥ ప మ గ రి గ రి । సా ని । దా ॥
ము . అ క । ట । నీ ॥ చి . . . । త్త । ము ॥
దా . ద ని । సా . రి । స ని దా ॥ ప మ ద పా మ । గ మ గ రి । సా . ॥ సా
. . అ । య్య । య్యో . . ॥ ఓ । చె . । లి . ॥ య . . ఇక ॥

చ . నిద । పా । పా . ॥ మగ మా పద పద । ప మ గరి । రి సా ॥
. సర । సు । డ . ॥ ని । మె । చ్చు . ॥

సా . । స ని ధా । ధ నీ ధ ॥ పా ధ ని । సా రి । గా రీ ॥
కొం । దు - । వు . ॥ . . . ఈ । వే । ళ ॥

గా గ మ । పా ద । ప మ మా ॥ గ మా గ రీ । స రి స రి । సా . ॥
నీ చ । క్కే । ర ॥ కె . . । మ్మో । వి ॥

సా ని ధా । ధ సా ని । స రి స రి ॥ సా । । ॥
అ న । మం । దు ॥ వు . । । ॥

. ని ద । పా । పా మ ॥ మ పా ద ని దా ప । మ గ రీ । సా ॥
. తిరు । గ । లే . ॥ ని . . . । కో । ప ॥

సా . గ మ । పా . । పా . మ ॥ ధా ద నీ । సా । సా ॥
ము . తె । చ్చు . । కొం . ॥ దు వు । నా . । దు ॥

సా స రి । సా రి । గా రీ ॥ ప మ గ రి గ రి । సా ని । దా . ॥
సర । స । కు ॥ రా . వు . । ఎం । చ ॥

దా పా ద ని । సా రి । స ని దా ॥ ప మ దపామ । గ మ గ రి । సా ॥ .
క న । న్ను । దూ రే ॥ . । . । వు . . ॥ . ఇక ॥

**అవతారిక**

ఈ పదమునందలి నాయిక సామాన్య ప్రౌఢ క్షేత్రజ్ఞులు ఈ పదమునందు వాడిన కొన్ని మాటలకు అర్థము తెలియుటలేదు సందర్భమునుబట్టి 'ఇన్నూరు ఘట్లు' అనగా రెండు వందల నాణెములు అని ఊహించుకొనవచ్చును గాని 'బేరా జబ్బ' అను పదమునకు అర్థం ఏమైయుండునో తెలియవచ్చుటలేదు ఇదియుగాక సాహిత్యము పూర్తిగా లేదు

ఈ సింధూర తిలక రాగమునకు లక్షణములు ప్రాచీనుల గ్రంథములలో కానరాలేదు పూర్వాంగమున అసావేరి స్వరములు ఉత్తరాంగమున శంకరాభరణస్వరములు కలిగిన ఈ రాగము ఎందువలన వాడుకలో లేకపోయినదో అర్థమగుటలేదు ఇది భాషాంగము. ఆరోహణమున చతుశ్రుతి రిషభము అవరోహణమున శుద్ధరిషభము వచ్చును

ఆరోహణ · స రి మ ప ద సా - అవరోహణ. స ని ద ప మ గా రి సా

ఇది ఇప్పటి మేళకర్తలలో 17 వ మేళమగు సూర్యకాంతమునకు జన్యము

**రాగం - సింధూరతిలక - ఆదితాళం**

ప: తప్పించుకొంటి ఏమూాయే - తరుణి మువ్వ గోపాలుడు

అ ప: ఎపుడైన ఒక్కసారి - ఇందు రాకపొయ్యేన ॥ తప్పించు ॥

చ: ఈరేయీా నన్నుగూడితే - ఇన్నూరు ఘట్లిచ్చేనని
సారె సారెకు నన్ను వేడెనే ఓయమ్మ వాడు ॥ తప్పించు ॥

2 బేరాజబ్బుమాట ( ? ) లాడెనే అయితే నే మాయ
( ? ) బేర జబ్బు చేసుకుంటి జడ కొద్ది వేయవా
నారీమణిరో! విజయ రాఘవ నాయుని సానిగ ( ? ) చేత ॥ తప్పించు ॥

ప: ద సా రి గ రి । రి స సా స ని దా । ని ద పా ద ప మా ॥
. త ప్పిం . . చు । కొం చే । నే . మా ॥
ప ద ప రి మ పా . ద సా । స ని దా ని ద పా । ద ప మా ప మ గా ॥ గ రి రి సా
య త రు ణి ము । వ్వ గో । పా లు ॥ డు

2. రి మ పా ద ని ద ప । మా ప ద ప మ । గా గ రి రీ ॥ సా
. త . ప్పి . . . చు । కొం . . చె । ఏ మా . ॥ యె

అ ప: . . . పా ద ని ద ప మా పా । ద ప దా । సా సా ॥
. ఎ పు డై . . న । ఒ క్క । సా రి ॥
. రి సా . రి గా । గ రి రీ సా । స ని దా ని ద పా ॥
. . ఇం దు . రా । క పొ । య్యే న . ॥

2. ద ప మా రి మ రి మా గ గ రి రి । సా గ రి స రి । సా ని సా ని ॥ ద ద ప
. . ఇం . దు రా . । క . పొ . . । య్యే . . న . . ॥ . .

తప్పించు ॥

చ దస దా పా । పమ పద పమ గా । గా గ రి రీ ॥

ఈ రేయీా । న న్ను । గూడి ॥

సా సా సని ధ ధ సా ని । సరి సా రీ మ రి । పమ గా గ రి రీ ॥

తే ఇన్నా . రు । ఘ ట్టి । చ్చే న . ॥

సా పా దని దప మా పా । దప దా । సా సా ॥

ని సా రె సా । రె కు । నన్ను ॥

రి సా రి గా । గ రి రీ సా । స నిదా నిదపా ॥ దప మా పా

వే డె నే । ఓ య । మ్మ వా ॥ డు . తప్పించు ॥

అవతారిక

ధీర నాయిక యగు ఈమె స్వీయ, ఖండిత, మధ్య గనుకనే, 'ముందటివలె నాపై నెనరున్నదా?' అని మొగముపై స్పష్టముగా అడుగుచు తాను చేసిన పూజాఫలమిదియే కాబోలు నని నొచ్చుకొనుచున్నది 'కంచి వరదుడైన మువ్వ గోపాలరాయడా! చాలు నీ మొగమిచ్చకపు మాటలు ముచ్చటలికనేల?' యని తనకోపమును వెల్లడించుచున్నది

భైరవి రాగము అతి ప్రాచీనము భాషాంగము రక్తిరాగము 'ప ద ని సా' అనునప్పుడు చతుశ్రుతి ధైవతము, 'స ని ద పా' అనునప్పుడు శుద్ధ ధైవతము పలుకును ఇది సంపూర్ణ సంపూర్ణము వెంకటముఖి సంప్రదాయమున గల భైరవికిని, క్షేత్రజ్ఞులవారి పదములలోగల భైరవికని పెద్ద తేడాలు లేవు గంభీర ప్రకృతిగల ఈ రాగము, ప్రాచీనుల కాలమునుండి నేటివరకు ఇంచుమించు ఒకేవిధముగా కనబడుచున్న రాగములలో ఒకటి క్షేత్రజ్ఞులవారి పదములు అత్యంత మనోజ్ఞములగు, రాగ సంచారములకు నిఘంటువులవలె నున్నవి

రాగం - భైరవి - త్రిపుటతాళం

ప ముందటివలె నాపై నెనరున్నదా? నాసామి! ఆ
ముచ్చటలిక నేలరా?

అ ప ఎందుకు మొగమిచ్చకపు మాటలాడేవు - ఏరా!
మువ్వ గోపాల నాసామి! ॥ ముందటి ॥

చ పిలువనంపిన రావు - పిలిచినను వినవు
పలుమారు వేడితే - పలుకరించవు
వలపు నిలుపలేక - సదయుడవని నిన్ను
తలచి తలచి చాలా - తల్లడిల్లుచేగాని ॥ ముందటి ॥

2 చిన్ననాటనుండి - చేరిన దెంచక
నన్ను చౌకచేసేది - న్యాయమా ?
వన్నెకాడ నీదు - వంచన లెరుగనా
నిన్నన పనిలేదు - నే చేసిన పూజకు ॥ ముందటి ॥

3 కలువల రేడంచు కంచి - వరదా నిన్నా
లలన యింతదూరము - రానిద్దేనా ?
అలరు విల్తుని కేళి - నలముకొనుచునన్ను
కలసిన పాపానికి - కన్నుల చూడవచ్చితివో ॥ ముందటి ॥

ప: . . . రిగరి । గా పమ । పా ॥ దా పా । పా । దపపమ ॥
. . . ముం . । ద . । టి . ॥ వ లె . . । నా । పై . ॥

పా . పద । నిసరీ । సా ॥ సదదరిసని । నిదదా । పా . ॥
. . . నెవ । రు . । న్న . . ॥ దా నా . । సా . । మి ॥

పా మ పా . మ పా । ప దపని ద ప । పా ॥ పమ గా మ పదపా । పాపమ గరి ।
అ . . ము । చ్చ । ట . . ॥ లి . . క . । నే . . ।

2. రిసరి॥ సా రి గ రి । గ మ ప ద నిద । దపపా ॥ పా ప ని ద ప దా । పా మ పా . మ ।
అ॥ రా . . ముం । ద . । టి ॥ వ . లె । నా . . . . ।
పా . ॥
పై ॥

3 పా మ పా . మ పా ద ప । దా ని స । నిదపా॥
ఆ ము । చ్చ । . ట ॥

అ ప. ప ని । ద ప ద మ । పా ॥ ప ద ప ద ని ద । సా ని సా ని । సా . ॥
ఎం । దు . । కు ॥ మొ గ । మి । చ్చ ॥
సా ద ని । సా । రి గ గ రి సా ॥ సా ని రి స ని । ని ద దా । పా . ॥
క పు । మా । ట ॥ లా । డే . । వు . ॥
పా . ద ని । సా . . । సా ॥ సా స ప పా ద ప । దా పా ని స । ని ద పా ॥
. . . ఏ । రా . . । . ॥ . ము । వ్వ . । . . గో ॥
ప మ గా మ ప ద పా । పా ప మ గ రి । రి స రి । సా
పా ల . । నా । సా ॥ మి ముందటివలె ॥

చ . . . ప ద । పా . । పా . ॥ మ ద పా . । పా . । ద ప ప మ ॥
. . పి లు । వ । నం ॥ పి . న । రా । వు . ॥
పా . మ మగ । మా . । పాదప ॥ మగ మాదప మగ । రి రి । సా ॥
. . పి లి । చి . । న . ॥ ను . . . । వి న । వు . ॥

రి గ । మా । మా రి ॥ గా పమగా రి । రిసరీ । సా . ॥
. పలు । మా । రు . ॥ వే . । డి । తే . ॥

. రీ గ రి । గమ పా ద । నిదదా ॥ పా పనిదప దా । ద పపమ । పా . ॥
. పలు . । క , । రిం ॥ చ . . . । వు । ॥

ప ని । ద ప పాదని । దపమా పమ ॥ పాద దారిస సనీద । సా ని సా ని ।
. వ ల । పు । ని ॥ లు ప । తే . ।

సా . ॥ ద ని । సా । రీ - గ గరిసా ॥ సాదరిసని । నిదదా । పా ॥
క . ॥ స ద । యు । డ . . ॥ వ ని । ని । న్ను ॥

. ద ని । సా । సారిద ॥ దసనిరిసని । ని ద దా । పా ॥
. త ల । చి । త ॥ ల . చి । చా . । ల ॥

పా మ పా మ పా ద ప । దా . నిస । నిదపా ॥ ప మ గా మపదపా । పాపమ గరి ।
త । ల్ల । డి ॥ ల్లు చే । గా . ।

రి స రీ ॥ సా
. ॥ ని ముందటివలె ॥

**అవతారిక**

ప్రౌఢ నాయికయగు ఈ కలహాంతరిత, స్వీయ తనపై అలుకవహించి తన చెంతకు రాని ప్రియుని తోడితెచ్చుటకు చేయదగు ఉపాయమును చెలికత్తెను అడుగుచున్నది ఈ పదమునందుగల రాగ భావములు మాటల యర్థములకు తగిన విధముగా జోడించి క్షేత్రజ్ఞులు సహజమగు అభినయమును తన సంగీత సాహిత్యములలో స్ఫురింపజేసి యున్నారు

రాగం - భైరవి - త్రిపుటతాళం

ప ఎవ్వరి నంపుదు ? ఏమిసేయుదు నీవే - యిది బుద్ధియనవమ్మా !

అ ప మువ్వగోపాలుడు మోడిచేసుకొన్నాడు
మొన్నటాల నుండి రాడు నీ తోడు ॥ ఎవ్వరి ॥

చ: అతివ చులకనని అందు పోరాదనీ
అతని పిలువనని అంటే నా మదిలోని
వెతలెట్లు తీరు నెన్నాళ్ళున్న మితిలోని పోరు నీకంటె నాకు
హితవరు లెవ్వరున్నారు ? పలుమారు ॥ ఎవ్వరి ॥

2 మనసు కరుగ మంచి మాటలాడి నామీద
నెనరు పుట్టించేది నీ భారము గాక యే
వనిత కేలా దైవము నన్ను వినవే నీ పాలాత్రోసినది
అనుమాన మిక నేలా ? యీవేళ ॥ నెవ్వరి ॥

3 అక్కరో ! మువ్వగోపాలుడతను కేళి కూడగ
ఎక్కడ మనసని చెక్కిలి నొక్కితే
మక్కువలేని వానివలెనె మ్రొక్కేనేగాని విడనాడి యీ
దిక్కుకు రాక మానె నినుగాని ॥ ఎవ్వరి ॥

ప స ని । సా । రీ . ॥ రీ . । గ రి రి స । రి గ రీ గ ॥
ఎ । వ్వ । రి ॥ నం . । పు । దు . ॥
స రీ రి గ రి । గా ప మ । పా ॥ దా పా . । ద ప మ గ । రి సా ॥
- ఏ . . । మి । సే ॥ యు దు । నీ । వే ॥
సా స రి । సా ధ । ధ స ని ధ ॥ ధ స ని సా । రి గ మ ప । మ గ రీ ॥
. యిది । బు . । ద్ధి ॥ య న । వ . . । ॥

2 సా స ని । సా । రీ ॥ మ రి ప మ ద ప । మ గా రి । రీ ॥
మ్మా ఎ । వ్వ . । రి . ॥ నం . . . । పు . . । దు . ॥
గ రి రి స రి గ రి । గా ప మ । పా . ॥ ద ని సా రి స నీ । ని ద దా । పా . . ॥
. ఏ । మి . । సే ॥ యు . దు . . । నీ . . । వే . . ॥

పమపా గ రి । సా . ని । సాపా ॥ పా దానిస నిద । పాపమ గ రి । రి ॥
. యిది । బు । ద్ధి ॥ యన । వ . । ॥

2. సా సని । సా । రి . . ॥ మ రిపమదప । మ గా రి । రి ॥
మ్మా . ఎ । వ్వ । రి ॥ నం । పు । డు ॥
గరిరిస రిగరి । గమపద నిద । దా పా ॥ పా పనిదపదా । పా మపా మ । పా ॥
. . ఏ . । మి . । సే ॥ యు డు । నీ । వే ॥

3. పా ద ని । సరిసస । పా ద దపమా ॥ పా సనిదప । మగ రి । సా ॥
యిది । బు । ద్ధి . ॥ యన । వ । మ్మా ॥
సగరి రి ని
॥ ఎవ్వరి ॥

అ. ప: . రిగరి । గా పమ । పా . . ॥ ప దపదనీ । సా సని । సా ॥
. . ము । వ్వ . । గో ॥ పా । లు । డు ॥
సాపా పద । నిసరీ । సా ॥ సానిరిసని । ని దదా । పా ॥
మో । డి । చే . ॥ సు కొ . । న్నా । డు ॥
స నినిగరి । సా . । సాసని ॥ ద నిసా ని । ని దదా । పా ॥
మొ . న్న । టా . । లా . ॥ నుం డి । రా . । డు . ॥
పా . ద దనిసప । ప పమగ । రి . రి ॥ సా .
నీ . . . . . । తో । . . డు ॥ నే నెవ్వరి ॥

చ రి గ । రీ । రీ ॥ గా రీ । గ రి రి స । రి గ రి గ ॥
మ న । సు । క ॥ రు గ । ముం . । చి ॥

రీ రి గ । మా । ప మ ప మ ॥ ప ద ప ద ని స । ని ని దా । పా ॥
. మా । ట । లా ॥ డి నా । మీ । ద ॥

ప ద । పా । పా ॥ ప గ మా ని ప మ గ । రీ । సా ॥
నె న । రు । పు ॥ ట్టిం । చే । ది ॥

సా రి గ । మా । ప మ ప మ ॥ ప ద ప ద ని స । ని ని దా । పా ॥
నీ । భా । ర ॥ ము . । గా । క ॥

పా ప ద । పా । పా ॥ మ గ మా ని ప మ గ । రీ । సా ॥
యే వ ని । త । కే ॥ లా । దై । వ ॥

సా రి గ । మా । మా ॥ ప ద ప ద ని స । ని ని దా । పా ॥
ము న । న్ను । వి ॥ న । వే । . ॥

పా రి గ । మా । పా ॥ ప ద ప ద స ని । సా సా । సా . ॥
నీ । పా । ల ॥ త్రో . . । సి న । ది ॥

సా పా స ని । ని గ రీ । సా సా ని ॥ ద ని సా రి స ని ద । ని ద దా । పా . ॥
అ ను మా । . న । మి క ॥ నే . । . । లా . . ॥

పా ద ద ని స ప । ప ప మ గ । రీ ॥ సా
యీ । వే . । ళ . . ॥ వే . నెవ్వరి ॥

**అవతారిక :**

నాయిక సామాన్య తనకు అనుకొననివిధముగా స్వామి అనుగ్రహము లభించుటచే ఆనందపరవశయై ' ఎన్నాళ్ళకెన్నాళ్ళకి వీధిలో నిన్ను కన్నుల పండువుగా కనుగొంటి నేడు ' ' కృపగలదా మా మువ్వగోపాల సామి! అపురూపదర్శనం బాయెగద నేడు!' అని సంతోషముతో తన స్వామిని పలుకరించుచున్నది

రాగం - భైరవి - త్రిపుట తాళం

ప అపరూప దర్శనం - బాయగదా నేడు

అ ప కృపగలద మా మువ్వ - గోపాల! సామి! ॥ అ ॥

చ ఎన్నాళ్ళ కెన్నాళ్ళకి వీధిలో నిన్ను
కనులపండువుగాను - కనుగొంటి నేడు
ఉన్నదా ? నా మీద - ఉల్లమున దయనీకు
ఉన్నాను నీ దయ - పన్నగశయనా నాసామి ॥ అ ॥

2 త్రోవతప్పివచ్చితివో - తోయజాక్షికి నీకు
ఈవేళ కలహంబు ఏమైన కలదా ?
నీవేల బొంకెదవు నెనరు గలిగినచోట నె
యివేల నేరములు - రావా నా సామి ॥ అ ॥

3 సందేహామేల ఇక శయనించి సమరతులు
జెంది నన్నుపరతులు సేయ మనకు
మెండైన నీకు ఆనంద మయ్యేచోట
కందర్ప జనక చక్కని మువ్వ గోపాల ॥ అ ॥

ప: స రి । సా . ధ । ధ స నీ ధా ॥ ధ సా ని సా । రి । రి గ మ గ రి రి స ॥
. అప । రూ । ప ॥ ద । ర్శ । నం ॥
రి గ రి గ మ పా । పా ని ద ని । స రి సా ॥ స ని । ద ప ప మ । గ రి రి ॥ సా
జా । య । గ . ద ॥ నే । । డు ॥
అపరూప ॥

అ.ప . ప ద । పా । పా ద ని ద ప మా ॥ దా దా । పా గ రి రి స । రి ॥
.. కృ ప । గ .. । ల ॥ దా మా. । ము । వ్వ ॥
రి గమ గరిరిస రి । రిగమ గరిరి । సా ॥ సారిస నీ సా ని । స నిదప । పమగరి ॥
గో . . . . । పా .. । ల ॥ నా . । సా . । మి ॥
రి సా
. . అపరూప ॥

చ: . రి గ । మా . । పా మ ॥ దా దా । ద రి స ని ని ద దా । పా ॥
. ఎ . । న్నా . । ళ్ళ . ॥ కె న్నా । ళ్ళ .. । కు ॥
. . ని ద । ని సా ని । ని ద ద ప ॥ ప మ గ మ ప ద పమ గమపద । పమగా రి । సా ॥
. . . . ఈ . । వి । ధి . ॥ లో . । ని । న్ను . ॥

స రి । సా ధ । ధ స నీ ధా ॥ ధ సా ని సా । రీ । రీ గ మ గ రి రి స ॥
క ను । ల । పం ॥ డు వు । గా . । . . ॥

రీ గ రి గ మ పా । పా ని ద ని । స రి సా ॥ స ని । ద ప మ గ । గ రి రీ ॥
క ను గొ . । టి । ॥ . నే । । డు ॥

సా రి గ । మా । పా మ ॥ దా దా । ద రి స ని ని ద దా । పా ॥
ఉ । న్న . । దా ॥ నా మీ । ద । ॥

. . ని ద । ని సా ని । ని ద ద ప ॥ పమగమ ప ద ప మ గ మ ప ద । పమగా రీ । సా ॥
. ఉ । ల్ల । ము న ॥ ద య । నీ । కు ॥

, పద । పా । పా ద ని ద ప మా ॥ దా దా । పా గ రి । రి స రీ ॥
. . ఉ. । న్నా । ను ॥ నీ ద । య . . । ప ॥

రీగమ గరిరిస రీ । రీగమ గరిరీ । సా ॥ సారిస నీ సా ని । స నిదప । ప మగరి ॥
న్న . గ । ళ య । న . ॥ నా । సా . । మి . . ॥

రీ సా

అపరూప ॥

**అవతారిక**

ఈ పదమునందలి నాయిక స్వీయ, మధ్య. ఈమె తన స్వామితో వేడుకకై పెనగు లాడినదట 'నావంటి సఖియ లేకున్న మీ వేడుకలు చెల్లునా! ఆ యూ వింతలకేమి కొదువ లేదు వగలుసేయక జోడుగూడి మీరుంటే, సొగసు చూచెదనని' చెలికత్తె నాయికా నాయకుల పొలయలుక తీర్చి సంతోషించుచున్నది ఈ పదము అచ్చుపుస్తకములలో సావేరి రాగమని ఉన్నది మా పాఠము హిందోళ

హిందోళరాగము ప్రాచీనము కావ్యప్రసిద్ధము ఈరాగమును చతుశ్శృతి ధైవతముతో పాడుట క్షేత్రజ్ఞుని పదమునందు గోచరించును వెంకటమఖి సంప్రదాయమున దీనిని శుద్ధధైవత ముతోనే చెప్పియున్నారు కాని చతుశ్శృతి ధైవతముతో పాడెడి ప్రాచీనపద్ధతి, ఇంకను అక్కడక్కడ వాడుకలో నున్నది ఇందుకు ఉదాహరణ శ్రీ త్యాగరాజస్వామివారి 'మనసు లోని మర్మము' అను కీర్తన

ఆరోహణ స గ మ ద ని స - అవరోహణ స ని ద మ గ స

రాగం - హిందోళ - త్రిపుటతాళం

ప: సామిగా రారాయంటే కో - పమా?

అ. ప ఏమినేరమమ్మా! మువ్వగోపాలుని ముచ్చటతీర ॥ సామిగా ॥

చ. నీమాటలు నమ్మరాదు - నీకే కోపమైనగాని
కోమలి! నాడే గంటి నీ గుణము తెల్లను - సీమలో మగవారివలె
నేమైన నేరము చేసితే - ఏమిసేతువో
తెలియదికనైన చలము మాని ॥ సామిగా ॥

2 నీవే అతనిని విడనాడి నీకేకోపమైనగాని
యీవేళ యిద్దరి వాదుల నెవరు తీర్చేరు?
నానంటి సకియలేకున్న మీవేడుకలు చెల్లునా?
ఆ యీ వింతలకేమి కొదవలేదు - వగలుసేయక ॥ సామిగా ॥

3. వేడుకతో నొకనాడైన వి - భుడు నీవు ముదము మీర
జోడు గూడియున్న - సొగసు చూచెదనంటేను
నేడు కలిగె భాగ్యము - నెలతరో! మీ అలుక తీర
పాడి పంతముల మాని - పతియైన మువ్వ గోపాలుని ॥ సామిగా ॥

ప. మా మగ । గా సా । సా ॥ సా ని గా స । ని ధ నీ । సా ॥
సా . మి । గా . । రా ॥ రా . . . । యం । చే . ॥
మా . దా । దా మా । గ మ గ గ ॥
కో . ప । మా । . ॥

2 మా మగ । గా సా । సా నీ ॥ సా గ సా । ని స నీ । ప గ మా ॥
సా . . మి . । గా . । రా ॥ రా । యం. । చే . ॥
ద ని సా స ని । సా । స ని ని ద ॥
కో. ప . । మా । . . . ॥

3 మా . మగ । గా సా । సా నీ ॥ సా గ సా । గ మ ద మ । ద ని సా ॥
సా . మి । గా । రా ॥ రా । యం । చే ॥
ని స గ గ సా । ని స ని స నీ । ద ని ద ని దా ॥
కో ప । మా । ॥

4 సా స ని । దా మా । గ మ గ గ ॥ సా గ సా । ని ధ నీ । సా ॥
సా మి । గా । రా ॥ రా । యం । చే ॥
ని స గ గ సా । ని స ని స నీ । ద ని ద ని దా ॥
కో ప । మా । ॥

అ ప మా మ గ । మా । దా ॥ ద నీ సా ని । సా । సా . ॥
ఏ మి । నే । ర ॥ మ మ్మా । ము । వ్వ ॥
ని స గ గ సా । ని సనిస నీ । ద నిదనిదా ॥ ని స గ గ సా । నిసనిస నిద । దనిదని దమ ॥
గో పా । లు ని । ము ॥ చ్చ ట । తీ । ర . . ॥
॥ సామిగారారా ॥

చ : . మా । మా । మా ॥ గ మ గ మ గా । గా సా । సా . ॥
. . . వే । డు । క ॥ తో . । నో । క . ॥
సా స ని । సా గ గ । స స ని ధ ॥ ధా స ని । సా । గా ॥
నా । డై । న . . ॥ వి । భు । డు ॥
గ సా గా । మా . । దా ॥ ద మా మా . । గ మ గ గ । సా . ॥
నీ । వు . । ము ॥ ద ము । మి . । ర ॥

మగ । మా । దా . ॥ దానిసాని । సా । సా . . ॥ . . ని స । గా । గా సా ॥
ణో । డు । గూ ॥ డి । యు । న్న ॥ సొగ । సు . । చూ ॥

సా ని నిదా । దా ద ని । సా స ని ॥ సా ని స । మ గ మ గ । గా సా ॥
చె ద । వం । చే ॥ ను నే । డు । క ॥

స గ స స గ స । స ని స ని । ని ద ని ద ॥
లి గె । భా । గ్య ॥

దా మా గ మ । ద ద మా । గ మ గా ॥ స మ గ గ మా । ద ద మా । దా నీ ॥
ము నె । ల । త . ॥ రో . . । మీ । య ॥

సా ని ని దా । ద మ దా । నీ ॥
లు - । క । ॥

సానినిదా । నిసగా । సా ॥ మా మగ । మా । దా ॥ ద నీసాని । సా । సా ॥
తీ । । ర ॥ పా డి । పం । త ॥ ము ల । మా । ని ॥

ని స గ గ సా । నిసనిస నీ । ద నిదని దా ॥ ని స గ గసా । నిసనిస నిద । దనిదని దమ ॥
ప లి యై . . । న । ము ॥ వ్వ . గో . । పా । లు ని ॥

॥ సామిగా రారా ॥

**అవతారిక**

ఇందలి నాయిక స్వీయ మానవతి ఇది పురుష విరహమును తెలుపు పదము నాయిక తనపై అలుక చేసినదని తెలుసుకొనిన నాయకుడు ఆమె మనసును తన వైపునకు మరలించుకొనుటకై చేసిన ప్రయత్నములు, ఆడిన చతురోక్తులు ఇందలి ఇతివృత్తము అచ్చు పుస్తకములలో ఈ పదము కాంభోజిరాగమనియున్నది మా పాఠము హిందోళవసంతము

హిందోళవసంతము ప్రాచీనము రక్తిరాగము స గ మ ప మ ద ని సా — స ని ద మ ప మ గ సా, అనునవి ఆరోహణావరోహణములు ఇది ఇప్పటి వాడుకప్రకారము 20 వ మేళమయిన నటభైరవి జన్యము వెంకటమఖి సంప్రదాయమున 'ద సా' అను ప్రయోగము గలదు. క్షేత్రజ్ఞుల పదమునందు ఇది కానరాదు ఆధునికులు కొందరు ఈ రాగమును 26 వ మేళమగు చారుకేశి జన్యమని చెప్పియున్నారు వాడుకలో ఇట్లులేదు పదమునందలి సంచారములు అతి మనోజ్ఞములయి రాగ స్వరూపమును వెల్లడిచేయుచున్నవి

రాగం - హిందోళవసంతం - త్రిపుటతాళం

ప పలుకులేటికి దయలు - బట్టబయలాయ

అ ప ఎలనాగ అవకాశము - ఏమున్నదయ్యయ్యో! ॥ పలుకు ॥

చ. నెట్టుకొన్నటి మమతచే - నిలువలేక మోవిమ్మంటే
పట్టి తోసి మనసు - గట్టిచేసుకొంటివి
చుట్టములు లేనివారు - సుదతి ఎవ్వరినో
పట్టుకొని పాకులాడి - నట్టాయె నావలపు ॥ పలుకు ॥

2. సతముగా నీపాదములె - గతియని నమ్మియుంటి
యితరునిగా జూచితి - వేమిసేతు సుదతి
సతులనమ్మే పాప - జాతి మగవారికి
గతులు లేదనుమాట - కలికిరో నిజమాయె ॥ పలుకు ॥

3 మొగమాటమేలనే - మువ్వగోపాలుడను గాన
అగడైతి నిన్నుగూడి - యందరిలోన
మగువ వాక్కున నొకటి - మది నొకటి యెంచుకొని
తెగనాడితివి మున్ను - దెలిలేనైతి నీతోడ ॥ పలుకు ॥

ప గ మ । పా । మా ॥ మ గ పా మ గ సా । స స ని ధ । ని ని సా ॥
ప లు । కు । లే ॥ టి కి । ద । య ॥

సా స ని । స । మా ॥ గ మ పా మా । గ మ దా । ద మ మ గ ॥
లు . ల । ట్ట । బ ॥ య । లా । . ॥

గా సా
య

2 . స ని । సా . । మా ॥ దా ని స ని ద నీ । సా ని । ద ని ద మ ॥ గ మ గ స
ల । ట్ట । బ . ॥ య . . । లా . । . . . . . ॥ య .

అ.ప:. . ద ని । సా మ గ । గా . ॥ గా మ గ గ స । గ స ని ద । నీ ॥
. . యెల । నా । గ - ॥ అ వ . । కా । శ ॥

సా . ద ని । సా గ స । స ని ని ద ॥ దానిస నిదనీ । ద దమా । పమ గా పమ ॥ గా సా
ము ఏ । ము । . న్న ॥ ద । య్య । ॥ యో్య

॥ పలుకు ॥

చ స ని । సా మగ । గామా ॥ మగమ పామ గమా । గా పమగా । పమగా గ స ॥
. నె । ట్టు । కొ . ॥ న్న . . ట్టి । మ మ । త చే ॥

సా స ని । నీ ని ధనిస । నిధనీ ॥ సా సనినిధ నీ । సా మ గ । మా ॥
నిలు । వ లే । క ॥ మో వి । మ్మం । చే ॥

గమ । పా మాపమ । గగమా ॥ గమ నిని దా । ద ద మా మమ । గాగగ ॥
గ । ట్టి తో । సి ॥ మ న . । సు । ॥

సా గమ । పామా । మాపమ గా ॥ మా గా । పమగా పమగా । పమగా గస ॥
. . ప । ట్టి చే । ॥ సు . కొం । . । టి ॥

సా సని । సామగ । గామా ॥ మగమ పామ గమా । గా పమగా । పమగా గ స ॥
వి ... చు । ట్ట । ము లు ॥ లే ని . । వా । . రు ॥

సా . . స ని । నీ నిధనిస । నిధనీ ॥ సా సనినిధ నీ । సామగ । మా ॥
. సు ద । తి । ఎ ॥ వ్వ । రి । నో ॥

. . . ద ని । సామగ । గా ॥ గామగగస । గ స ని ద । నీ ॥
. ప । ట్టు . । కొ . ॥ వి । ప్రా కు । తా ॥

సాసాదని । సాగస । స ని ని ద ॥ దానిస నిదనీ । దదమా । పమ గా పమ ॥ గాసా
డి . న । ట్టా . । యె . ॥ నా . . . । వ . । ల ॥ పు .

॥ పలుకు ॥

**అవతారిక .**

ప్రతిభాచతురయగు ఈ నాయిక పరకీయ పరోఢ ఈమె తనకు మువ్వపురిస్వామిపై గల మక్కువను, అతనితో తనకుగల సన్నిహితత్వమును మరుగుపరిచి 'చూడని కూడని నిందలు జోడించిరమ్మ నాపై' అని, చెలికత్తెతో 'నిజముగా స్వామికి తనపై అనుగ్రహము కలిగిననాడు తన దేవునకు పూలంగి సేవ చేయుదు' నని చెప్పుచున్నది

అతి ప్రాచీనమయిన ఆనందభైరవి రాగమున కాలక్రమమున కొన్ని మార్పులు వచ్చి యుండవచ్చునని తోచుచున్నది క్షేత్రజ్ఞుల పదములయందు సందర్భానుసారముగా రెండు గాంధారములు, రెండు ధైవతములు, రెండు నిషాదములు పలుకుచున్నవి. వెంకటమఖి సంప్రదాయమున శుద్ధ ధైవతము, సాధారణ గాంధారము, కైశిక నిషాదముమాత్రమే పలుకుచున్నట్లు చెప్పబడినను 'సంగీత సాంప్రదాయ ప్రదర్శిని' గ్రంథకర్త సుబ్బరామ దీక్షితులవారు అచ్చటచ్చట పంచశ్రుతి ధైవత ప్రయోగము కలదని వ్రాసినారు క్షేత్రజ్ఞుని పదములలోగల అంతరగాంధార, కాకలి నిషాద ప్రయోగములను పరిహరించి పాడి చూచినచో నది భావశూన్యముగాను, ఆనంద భైరవి రాగముగాకను కనబడుచున్నది గనుక నా పాఠమును యథాతథముగానే పొందుపరచి యున్నాను 'మ గ గ రి గా మ ప మా' అనునప్పుడు అంతరగాంధారమును, 'పా ద ప' అనునప్పుడు శుద్ధ ధైవతమును, 'స ని ని ద నీ స రి' అనునప్పుడు కాకలి నిషాదమును పలుకుట మా పద్ధతి 'ప ద ని ద ని సా' అనునది విశేషప్రయోగము ఈ రాగమును ఇప్పటి వాడుకలోగల 20 వ మేళమగు నటభైరవి జన్యముగా చెప్పుకొనవలెను 'ప ని సా' అను ప్రయోగముకూడా తరచుగా కనబడుచున్నది

ఆరోహణ స గ రి గ మ ప ని ప సా – ఆరోహణ స ని ద ప మ గ రి సా

రాగం - ఆనందభైరవి - త్రిపుటతాళం

ప చూడని కూడని నిందలు - జోడించిరమ్మా ఓయమ్మా!

అ ప అడుకోని వారున్నారా - హరిపై నాపై యేమో జనులు ॥ చూడని ॥

చ నిక్కముగ నతనిమోము - నిలిచి చూచినానా ?
అక్కరతీర కౌగలించియున్నానా ?
చక్కెరమోవియాని నేను - నొక్కి చవిచూచినానా ?
అక్కరో నే నతను ఈలాటి - చక్కనివాడన్నందుకు ॥ చూడని ॥

2 చేడెరో! అతనికి నేను యీడౌగు ననుచు మదిలో
వేడుకై యెవరితోనైన - ఆడుకొన్నానా ?
పోడిమిగా అతని ఎదము - పాడి విని ముదమందినాన ?
కూడ పంతముంచేతమ - కోరిక లాడించెనేమో ॥ చూడని ॥

3 సన్నుతాంగి! మువ్వపురి - సామి నాదు మనసుతెలిసి
మన్నించి మరుకేళి నన్ను - మరపియున్నాడా ?
కన్నెరో! మమ్మనినవారి - కన్నుపొడిచినట్లైతేను
చెన్నుగా మాదేవునికి - చేసేను పూలంగిసేవ ॥ చూడని ॥

ప . గ మ । పా । పా . ॥ పా పా । పా । పా . ॥
చూ । డ । ని ॥ కూ . । డ . । ని . ॥

పా మ గ । మా . । పానిప ॥ మపమామగ । గా రీ । గామా ॥
. . నిం . । ద । లు . ॥ జో . । డిం । చి . ॥

పా పా । పా । పా . ॥ నీపా . । ప పమా । గా రీ ॥
ర । మ్మా । . . ॥ ఓ . । య । . ॥

2 రీ సా మ గ । మా । పా ॥ పా . సా । ససనిద । దనిపా ॥
మ్మా చూ । డ । ని . . ॥ కూ । డ । ని . ॥

నిపామ మ గ । మా । పానిప ॥ మ గ మాపమ గరి । రీ గా । మగమా ॥
నిం । ద । లు ॥ జో . . । డిం । చి . . ॥

పా . . । పా । ॥ సా పా । ప పమా । గా రీ ॥
ర . । మ్మా । ॥ ఓ . . । య । ॥

3 రీ సా మ గ । మా . । పా ॥ ప ని సరిగరి నిసరిస । నిదనిప । నిపామ ॥
మ్మా . చూ । డ . . । ని ॥ కూ . । డ । ని . ॥

మాపమ గరి మ గ । మా । పానిప ॥ మ గపమనిప । ప మగరి । గా ॥
. నిం । ద . । లు . ॥ జో । డిం . । చి . ॥

మగమా . । పా । ॥ పాదని దనిసా । సా . । పా ॥
ర . . . . । మ్మా . । ॥ ఓ . . . . । య . । . . ॥

4 ప మగరి మ గ । మా . । పా . . ॥ పా । పమగరి । రీసా ॥
మ్మా చూ । డ . । ని ॥ కూ । డ । ని ॥
సా స ని । సా . । మా ॥ మా మప మాపమ । మ గరీ । గా ॥
నిం । ద । లు . ॥ జో । డిం । చి ॥
పమ గరిగరి । సా । . ॥
ర . . । మ్మా । ॥

అ ప . . పా । పా . । ప దనిద ॥ దనిప ని పమ । మమగరి । గా మ పమ ॥
ఆ । డు । కో ॥ ని వా । రు । న్నా ॥
మా ప మ । పా . । సా . ॥ సా మా । మమగరి । గాసా ॥
రా హ । రి । పై . ॥ నా । పై । . ॥
స నిదనీ । సా । సా ॥ పా సా । స సనిద । నీ పా ॥
యే . । మో । ॥ జ । ను । లు ॥
పమగరి
చూడని ॥

చ గ మ । పా । మా ॥ గా రీ । గమ పానిప । ప మగరి ॥
ని క్క । ము । గా ॥ న త । ని । మో ॥
రీ సా గ రి । సా . । స నిసని ॥ స గమపామ । మగరిగ । మపామ ॥
ము నిలి । చి . । చూ . ॥ చి । నా । నా ॥
మా . గ మ । పా . । మా . ॥ గా సమగరీ । రి గరిగ రిస । సా . ॥
. అ క్క । ర । తీ ॥ ర . । కౌ . । గ ॥

సా  ని స । గ రిసా । గ ససని ॥ సా . మా । మమగరి । గా మ పమ ॥
లిం . । చి । యు ॥ న్నా . । నా । ॥

మా  గ స । పా । పా ॥ పాదని ద ని దప । గమ పానిప । పమగరి ॥
చక్కె । ర । మో . ॥ వి యా । ని । నే . ॥

గా . గ మ । పానిప । పమగరి ॥ స నిపామా । మమగరి । గ మపమ ॥
ను . నొక్కి । చ । వి ॥ చూ చి । నా . । నా ॥

మా  ప ప । పా ప మ । పా ॥ పాస సని దని । సా । సా ॥
అక్క । రో । నే ॥ న త । ను । ఈ ॥

సా  ని స । రి గరిస । సా . ॥ స నిససనిద । నీ సరి । సా ॥
లా । టి . . । చ . ॥ క్క ని । వా । ॥

పని సారిస నిద । పా । ప మగరి ॥ గా
డ । న్నం । దు ॥ ను . చూడని ॥

**అవతారిక**

ఈ పదమునకు అనుశ్రుతముగా వినవచ్చుచున్న ఒక కథ గలదు క్షేత్రజ్ఞులు చిన్న వయస్సునందు తమ స్వగ్రామమగు మువ్వపురియందుగల ఒక దేవదాసిని కామించినారట ఆమె త్రికరణశుద్ధిగా గోపాలదేవునికి అంకితురాలైన దేవదాసి గనుక వీరిని దరికి రానీయలేదట ఒకనాడు మువ్వగోపాలుని ఆలయము చెంత నామెను ఈతడు బలాత్కరింపబోగా, బలవంతుడు, విద్వాంసుడు, రసికుడునగు అతనినుండి తప్పించుకొనుటకు ఆ దేవదాసి 'స్వామి! నీవు చదివిన వాడవు సంగీతమునందును, నాట్యమునందును సమర్థుడవు కవనము చెప్పగల గొప్పవాడవు. నేను మువ్వగోపాల దేవునికి అంకితురాలనైన దాసిని నుంగాడు పదములు నా స్వామిపై పాడి, అతనిని మెప్పించి నన్ను గైకొనుము విద్వాంసుడవయిన నీవు నాకొరకీ చిన్నపనిని చేయ లేవా!' అని ప్రాధేయపడినదట

అతడును ఇంత చిన్నపని చేసినచో ఈ స్త్రీ హృదయమును చూరగొనవచ్చుగదా! అని యెంచి ఆలయములోనికివచ్చి స్వామి సన్నిధిని పద్మాసనము వైచికొని కూర్చుండినారట ఘడియలు, ఝాములు గడచిపోయినవేగాని భగవంతుడయిన మువ్వగోపాలునిపై ఒక్క పల్లవినికూడ చెప్పజాలకపోయిన తన అసమర్థతపై పట్టుదల హెచ్చి, రెండహోరాత్రములు అట్లే యుండగా మూడవనాటి అర్ధరాత్రమున మువ్వగోపాలుని కరుణావిశేషమున జ్ఞానోదయమయి, ఈ ప్రపంచమునగల జీవాత్మలన్నియు స్త్రీలనియు, పరమాత్ముడైన మువ్వగోపాలుడొక్కడే పరమపురుషుడనియు, స్ఫురించి మధురభక్తి మనసునందంతటను నిండి 'శ్రీపతి సుతుబారికి నే నోపలేక నిను వేడితే కోపాలా! మువ్వగోపాలా!' అని అనుప్రాసాలంకారములతో మొదటి పదమును పాడినారట మూడుదినములపాటు అతనితోడనే స్వామి సన్నిధిని కూర్చొనియున్న ఆ దేవదాసి 'అయ్యో! నా దేవుడు నన్ను రక్షించుకొనలేకపోయినాడే ఈ మొండివాడు చక్కటి పదమును చెప్పి స్వామిని మెప్పించినాడే' అని చింతాక్రాంతురాలై లేచి అతని పాదములపై పడినదట అప్పుడాతడు వెనుకటి మూర్ఖ విద్వాంసుడు కాడుగదా!

ఆమెను లేవనెత్తి మధురభక్తి రహస్యమును ఆమెకుపదేశించి 'అక్కా నీవు స్వామికి నాకంటె సన్నిహితురాలవు నీతోపాటు నన్నును ఏలుకొమ్మని గోపాలదేవునికి చెప్పవమ్మా!' అని చెప్పి మరునాడే కాషాయాంబరములు ధరించి తన తులసిమూర్తియగు మువ్వగోపాలుని ధ్యానించుచూ, అతని నామాంకితముగా పదిగులు పాడుకొనుచూ, ఊరువదిలి వెడలిపోయి నారట

అటుతరువాత మధుర, తంజావూరు, గోల్కొండ మొదలగు రాజాస్థానములలో వేల కొలది పదములు పాడి తలిదండ్రులుపెట్టిన తన పేరునే మరచి క్షేత్రదర్శనములుచేసుకొనుచూ క్షేత్రజ్ఞుడను విఖ్యాత నామముతో ఆచంద్రార్కము నిలిచిపోయినాడు

రాగం - ఆనందభైరవి - ఆదితాళం

ప శ్రీపతిసుతుబారికి నే - నోపలేక నినువేడితే
కోపాల ? మా మువ్వగోపాలా ! ॥ శ్రీపతి ॥

చ ఏపొద్దు దానింటిలోనే - కాపైయుండి, నీ సరస స
ల్లాపాలా ? మా మువ్వగోపాలా ! ॥ శ్రీపతి ॥

2 పైపూత మాటలనేర్పు - జూపుదానిరతిపై నింత
తీపేలా ? మా మువ్వగోపాల ! ॥ శ్రీపతి ॥

3 చూపుల అన్యుల తేరి - చూడని నాతో లేనిక
లాపాలా ? మా మువ్వగోపాలా ! ॥ శ్రీపతి ॥

4 నా పొందెల్ల దానికబ్బి - యేపొందులేక యుసురనుచే
నాపాలా ? మా మువ్వగోపాలా ! ॥ శ్రీపతి ॥

ప . గ మ పా । పా . । పా పా ॥ పమ గ మపాదప । నిపాము । మాపమ గరి ॥
. శ్రీ ప । తి । సు తు ॥ షా రి । కి । నే . . ॥

గా గా గా మ ప మ । మా । మ ని పా ప మ ॥
నో ప . । లే । క . . ॥

మా మ ప మా మ గ గ రి । గా మ ప మ । మా ॥
ని ను వే । డి . ॥ తే ॥

మా గా గా మ ప మ । మా । మ ని పా ప మ ॥
. కో పా . . । లా । మా ॥

మ ప మా గ రి గా । మ ప మా గ రి । రి గా రి సా ॥
ము . . । వ్వ . । ॥

సా న్రీ సా మా । మ గ రీ । రి గా రి సా ॥
. గోపా . । ల . । . . ॥

2 గ మ పా ని స ప స । స స ని ద ని ద । పా ని నిపా మ ॥ పా
శ్రీ ప . । తి సు । తు . . ॥ శ్రీపతి ॥

చ. గ మ పా . । పా । పా పా ॥ పమ గమ పాదప । నిపాము । మాపమ గరి ॥
. ఏ ప్రొ । ద్దు । దా ॥ . నిం టి । లో । నే . ॥

గా గా గా . మ ప మ । మా . । మ ని పా ప మ ॥
. కా పై . । యుం . । డి . . . ॥

మా మ ప మా మ గ గ రి । గా మ ప మ । మా ॥
నీ స . ర . । స . . । స . ॥

మా గా గా మ ప మ । మా । మ ని పా ప మ ॥
ల్లా పా . । లా । మా ॥

మ ప మా గరి గా । మ పమా గరి । రిగారి సా ॥
ము . వ్వ । గో । ॥

సా నీ సా మా । మ గ రీ । రి గా ర సా ॥
గో పా । ల । . ॥ (శ్రీ)పతి ॥

**అవతారిక**

పరకీయ నాయిక సంకేత స్థలముక కలసిన తన ప్రియునికి ' మన గుట్టు బయలగును రేపు వత్తువుగాని పోరా ! నేటికీ తాళి ' అని భయ విహ్వాలలై నాయిక వేడుకొనుచున్నది

**రాగం - ఆనందభైరవి - త్రిపుటతాళం**

ప రేపువత్తువుగాని పోగా ! నేటికి తాళి - రేపువత్తువుగాని పోరా !

అ ప ప్రాపుగోరితిరా నాసామి మువ్వగోపాల ॥ రేపు ॥

చ. రాతిరిపగ లొకక్కతీరున నన్ను - రమ్మంటె మాయింటివారు
మాతులు త్రిప్పేరు - మొన్న వచ్చితినని
వాదేల తడవాయె - వద్దు నేటికి తాళి ॥ రేపు ॥

2 మరునాడె నన్నుగూడితివి - మరుకేళి కలసి నను మెచ్చితివి
మరియాద కలిగిన దొరబిడ్డ నీవై తే
తెరచిచూడర తలుపు తె వారెను తూర్పు ॥ రేపు ॥

3 రాపుసేయక నాతో పోర ! నన్నే - రతి నేలిన మువ్వగోపాల ?
కోపగించిపొయ్యేవు - కొన్నినాళ్ళాయె నీవు
తాపమణగలేదు - దయతో కలసిపోరా ॥ రేపు ॥

ప . గ మ । పా । పా ॥ పా పా । పా । నిపపమ ॥
రే । పు । వ ॥ త్తు వు । గా । ని ॥

పమపమగస । స నిసా । సాపా ॥ పపమగమా । పాదప । ప మగరి ॥
. పో . । రా । ॥ నే . టి । కి । తా ॥

గా . గ మ । పాపద । పామా ॥ మాగ పమగరీ । రి గరిస । సా ॥
శ్రీ . రే । పు . । వ ॥ త్తు . వు । గా । ని ॥

2 . ని స । మా । మాపమ గరి ॥ మగమగమగ । పమగరి । రిగరిస ॥
. పో । రా . । . ॥ నే . టి । కి . । తా ॥

అ ప సా పా । ప నినిప । పమ ప మ ॥ పాస సని దని । సా । సా . . ॥
శ్రీ . ప్రా । పు । గో . ॥ రి . తి . । రా । నా . ॥

సాపా ని స । రిగరిస । సా ॥ సా ని రి సనిధా । ద నిదప । పమగరి ॥
. సా . । మి । ము ॥ వ్వ . గో . . । పా . । . . ॥

2 గా స ప । పాపమ గరి । రి గరిస ॥ సారిస నిస సారిస నిదపా । ని పపమ ।
ల సా । మి . । ము ॥ వ్వ గో । పా . ।
పమగరి ॥ గా
॥ ల రేపువత్తువు ॥

చ . . గ మ । పా । మా ॥ మగారి । రి గరిస । సా . ॥

. రా । తి · రి .॥ ప . గ । లొ । క్క . ॥

సా స గ । గ సాని । సనిసని ॥ సా . । సా । సా ॥

. . . తీ . । రు । న . . ॥ న . । న్ను । ॥

సా ని సగమ । పానిప మా । మాపమ గరి ॥ రీ మగ మగ । మా . । మా . ॥

ర మ్మం . । చే . । మా . . ॥ యిం టి . । వా - . । రు . . ॥

మా పా । వ నినిప । వ మపమ ॥ పా సనిదని । సా । సా . ॥

మూ । తు । లు ॥ త్రి । ప్పే . . । రు ॥

సా . ప ని । స రిగరి పమగరి । సా ॥ సా ని దనీ । సా । సా ॥

. . మొ . । న్న . । వ ॥ చ్చి తి । న . . । ని . ॥

సాపాప మ । ప ని స ని । గరిసా ॥ సాని రి సనీ ద । ద నిదప । పా ॥

వా । దే । . ల ॥ త డ । వా . । యే ॥

పా గ మ । పా ద ప । పా మా ॥ మపమమగరి । ప మగరి । రి గరిస ॥

. వ । ద్దు । నే ॥ టి . కి । తా । ళి ॥

సా . .

. . రేపువత్తువు ॥

**అవతారిక**

నాయిక సామాన్య. ప్రౌఢ తన యింటికి చాటుగా రావలసిన అవసరమేమున్నది? 'సుదతిరో అలవాని సొమ్మేగదా ఈ మేను ఇందు వచ్చుట భేదమెంచా? ఈవేళ? ఇందు వదనా వాని ఇల్లు గాదటవే' అని చెలికత్తెకు చెప్పుచున్నట్లు నాయకుని మందలించుచున్నది.

రాగం - ఆనందభైరవి - ఆదితాళం

ప మంచిదినము నేడే మహారాజుగా రమ్మనవే

అ ప. పొంచి చూచినదేమొ - పొలతి మువ్వగోపాలుని ॥ మంచి ॥

చ. సుదతిరో అలవాని - సొమ్మేకదా యీ మేను
పద రితే ఏమో ఏమౌనో - పదుచుతనమందురేమో ॥ మంచి ॥

2 సదయు నిక విడనాడ - సహజమౌనటె యింక
కొదువ వద్దనవే ఆ కొమ్మ పేరెత్తనే ॥ మంచి ॥

3 ఇందువచ్చుట భేద - మెంచా యీవేళ
ఇందువదన వాని - యిల్లు గాదటవే ॥ మంచి ॥

4 అందున్న సుందరివలెనే - నందగత్తెగానా
ఎందుకే వట్టి దూరు - ఎవరు దండించేరో ॥ మంచి ॥

5 మునుపటివలె నాతో ముచ్చటలాడవచ్చితే
మనసీయక మాట్లాడితినా ? ॥ మంచి ॥

6 వనజాక్షి ! గోపాలుడౌ వాడే యీ చెలినిగూడ
తనకు ఇష్టమైతే తగదని చెప్పుదునా ? ॥ మంచి ॥

ప. స గ రీ సా . ని । సా మా । మగరీ గమపా ॥
మం చి ది । న ము । నే . ॥

మా గ మ పా . దని ద ని । పానిప పమపమ । మ గరీ గా ॥
డే మ హా రా జు । గా ర . । మ్మ న ॥

పమ గరిసని
వే . . మంచిదినము ॥

2 ప స ని సా ప ప । పనిప మపమ మ గ । రీ రిగమా మ ॥
. మ హా రా జు । గ ర మ్మ । . న . ॥

పమ గరిసని
వే మంచి దినము ॥

3. ప గ రి గా రి సాస ని । దనిసని రిసనిద । ప మనిప పమగరి ॥
మ హా రా జు । గ . ర । మ్మ న . ॥

ప మ గరిసని
వే . . . . . మంచిదినము ॥

అ ప:.. ప పమపమ పా । పా నిసా ని । సా సా ॥
...పొంచి చూ . । చి న . । దే మో ॥

సారిస నీ ప ని సరిగరి ని సరిస । స నిదా ద నిపా । ప పమా మగరీ ॥
పొలతి ము . । వ్వ గో । పా లు ॥

2 రిగ మా ప పానిప పా మ । ఎ స సనిదని । సా గ రి గరిస ॥
ని పొం చి చూ । చి న । దే మో ॥

సారిస నీ ప నిసరి గరి పమగరి । స నిదని సారిస । ని ద పానిప మగ ॥
. . పొ ల తి ము । వ్వ గో । పా . . లు ॥

పమగరిసని
ని . . మంచిదినము ॥

చ. ప ప పానిప ప మపమ । మగరీ గా । స రిగరి పమగరి ॥
సు ద తి రో । అ . ల । వా ॥

రిగరిససా స ని సా మా । మాపమ గరి గా । గ మపమ మా ॥
ని . సొ మ్మే కా । దా . . యీ । మే . ను ॥

ప ప పానిప ప మపమ । ప స స నిదని । సా సా ॥
. . ప ద రి తే । ఏ . మో . . । ఏ మో ॥

సారిస నీ ప ని స రిగరి ని సరిస । సనిదా ద నిపా । ప పమా మగరీ ॥
నో పడుచు . త । న మం । దు రే ॥

రి గ మా
మో

2 ప ని స రిగరి పమగరి । సనిదని సా రిస । ని ద పానిప మగ ॥
పడుచు . త . । న మం । దు రే ॥

ప మ గరిసని
మో మంచిదినము ॥

**అవతారిక .**

పరకీయ నాయిక యగు ఈమె పరోఢ, వాగ్విదగ్ధ తనవద్దకు వచ్చిన నాయకుని పొలయలుకకు తాళలేక 'ఊరకే చలముచేసేవేరా మ్రొక్కేరా - ఔరా! మువ్వ గోపాల గారవించి చూడరా!' అని తన ప్రేమానురాగములను గోపనములేక ప్రియునితో విన్నవించు కొనుచున్నది

రాగం - ఆనందభైరవి - త్రిపుటతాళం

ప ఊరకే చలము చేసే - వేరా మ్రొక్కేరా!

అ ప ఔరా మువ్వగోపాలా! - గారవించి చూడరా! ॥ ఊరకే ॥

చ సద్దుసేయక వేగ - వద్దికి రారా వట్టి
సుద్దులనే తేలించి - ప్రొద్దు బుచ్చకురా!
ముద్దులయ్య! నీ మోము - ముద్దుగులుకుచున్నదిరా
ముద్దుబెట్ట మనసయ్యీరా
మోము మోమున జేర్చ మనసయ్యీరా ॥ ఊరకే ॥

2 అరమరలు సేయకురా - హాపుసుకై నదాననురా
తరుణులవలె వలపు - దాచనేరనురా?
నెరనమ్మిన దాననురా - నిమిషమిక తాళలేరా
మరునిల్లు చెమ్మగిల మై - మరువ సాగెనురా! ॥ ఊరకే ॥

8 అక్కర తెలిసి వేగ - పక్కనంచుకోరా
చక్కని మా మువ్వగోపాల - చొక్కియున్నానురా!
నిక్కునా గుబ్బల గోట - నొక్కి యెద చేర్చుకోరా
యెక్కువైన రతులచే - గ్రక్కునన్నేలుకోరా! ॥ ఊరకే ॥

ప: . . . గా । మా । పా ॥ నీ పా । పా । పాపమ ।
. ఊ । ర . . । కే . ॥ చ ల . . । ము . । జే ॥

మగమపమప । మగరి । రిగమా ॥ పా పా । మా నిప । పమగరి ॥
సే . । వే . । . ॥ రా . . । మొ । క్కే . । . . ॥

2 రిగరిస గ మ । పా । పా ॥ పా స ససనిదా । ద నిదనిదప । ని పామ ॥
ర ఊ । ర । కే ॥ చ ల । ము । చే . ॥

మా మపమా గరి । మగమా । పా . ॥ సా మ గ । ప మనిప । పమగరి ॥
సే . । వే . । ॥ రా మ్రొ । క్కే । ॥

3 రీ సా పా । స సనిద । దనిదప ॥ పమగరి గ మ ।
రా . మ్రొ । క్కే । . . ॥ ర . ఊ । రకే

4 పా ప స । స నిదని । సాసప ॥ పమగరి గమ ।
రా మ్రొ । క్కే . । . . ॥ ర . ఊ । రకే

5 పా ప ని । సరిగరి నిసరిస । నిదపమ ॥ పమగరి గ మ ।
రా మ్రొ । క్కే . . । . ॥ ర ఊ . । రకే

అ ప. పమగరి పా । పాపమ । పా ॥ సా స సారిస నీ । స దనీ । సా ॥
ర . ఔ । ర . । ము ॥ వ్వ గో . । పా . । ల ॥

నిసనప ప ని సా । రి గరీ । సాసా ॥ స సనిదా దని దప । పానిప పమమా ।
గా ర । విం . । . చి ॥ చూ । డ ।

మాపమ మగరి ॥ రిగరీ సా
రా . ॥ ఊరకే చలము ॥

చ . పా । పా । పా . ॥ ప పమగరి । గాపమ గరి । రిగరిస ॥
స । ద్దు । సే ॥ య క । వే । ॥

సా నిస । మా . । మా ॥ గ రీ గ మ పమ । మా । మా . ॥
గ వ । ద్ది । కి ॥ రా రా । వ . । ట్టి . ॥

మా గ మ । పా . । పా ॥ పా . । ప దనిద । ద నిదప ॥
. సు । ద్దు । ల ॥ నే . । తే . । లిం ॥

ని పామ గ రి । గ మపమ । మా ॥ మ పమమగరి । గ మప మ । మా ॥
చి . ప్రో . । ద్దు । బు . ॥ చ్చ . కు . । రా . । . ॥

మగరీ గ మ । పానిప । మా ॥ మగరీ । రి గ రిస । సా ॥
. ము ద్దు । ల . । య్యా ॥ నీ . । మో . । ము . ॥

సా . ని స । మామా । మా ॥ మాపమగరి । గ మపమ । మా ॥
. . . ము ద్దు । గు లు । కు . ॥ చు . . । న్న ది । రా . ॥

మా . . ప ప । పా . । నిప పమ ॥ పాస ససనిదా . । నీ స రిస । సా . ॥
ముద్దు । జె । ట్ట మ ॥ న స । య్యా । రా ॥

సాపా ప ప । ని సరిగ । రీ సా ॥ సాని రిస నిద । ద నిదప । పా ॥
. మోము । మో । ము న ॥ జే ర్చ । మ । న ॥

మాప పమ గరి । ని సగరి । గా ॥ పమగరి
స . । య్యా । రా ॥ ఊరకేచలము ॥

**అవతారిక :**

స్వీయ, మధ్య, ప్రోషితపతికయగు ఈ నాయిక తన నాధుడు కార్యావసరమున తన్ను వదలిపోవుచూ చెప్పిన ఒక్కొక్క మాటను జ్ఞాపకముచేసికొనుచూ, ఆతని చేష్టలను తలచుకొనుచూ, చెలికత్తెతో చెప్పుకొనుచున్నది చరణమున, కన్నీరు నింపకుమని ఆమెకు చెప్పుచు తానే కన్నీరు నించుచున్నాడట ఇటువంటి మధురమయిన దృశ్యములు క్షేత్రజ్ఞులుకాక ఎవరు చెప్పగలరు

రాగం - ఆనందభైరవి - త్రిపుటతాళం

ప ఏమని తెలుపుదు ఏలాగు తాళుదు - ఏమిసేతునే ? ఓ చెలియ ?

అ ప. భామరో ! యూరికి బయలుకేరెడి వేళ
ప్రేమమీఱ నాసామి - పిలిచి చెప్పినమాట ॥ ఏమని ॥

చ అన్నమిందక - అతివెతనొందకుమని
కన్నీరు నింపకు - కలువరింపకుమని
ఎన్నెన్నో విధముల హితవులు తెలుపుచు
కన్నీరు నింపుచు - కాంతుడు చెప్పినమాట ॥ ఏమని ॥

2. నిడివి కన్నుల నీరు - నించుచు తలయూచి
తడలేక వేగ తానే - వచ్చెదనని
అడుగడుగున కుసు - రసురని మదిలోన
కదు మోహమున ప్రాణే - శుడు పలికిన మాట ॥ ఏమని ॥

3 ఏ నోము నోచితినో ? యెంతని వేడితినో !
తానేమి వ్రాసెనో ? తలమీద విధియని
పూనికతోడి మా మువ్వగోపాలుడు
సూనశరుని కేళి - సుఖయింతమనుమాట ॥ ఏమని ॥

ప గమ । పా । పా . ॥ పమ నిపా । పా ని నిపామ । పా ॥
. ఏ । మ । ని ॥ తె లు । పు । డు ॥

పా మగమ । పా పాదని । దపమా మా ॥ మా మప మపమ । మగగరి । గా ॥
. ఏ । లా । గు ॥ తా । ళు । డు ॥

గపమా గరి రిస । రి ససా । సా ॥ సా గ రి సస నీ । నీ స గా మ । పా ॥
. .. ఏ । మి . । . సే ॥ యు . . డు । నే . . । . . ॥

పామగ మగమగ గపమా । మానిప మగరీ । రి గరిగ రిస ॥
ఓ చే । లి . । య ॥

2 సా గమ । పా । పా ॥ పమ పస స సనిద నిప । దనిదని దప । ని పామ ॥
ఏ । మ । ని ॥ తె . లు । పు । డు ॥
ఏలాగుతాళుదు . ఓ చెలియ ॥

3 గమ । పా । పా ॥ పా పగ రిగ రిస । స నినిద । దనిదని దప ॥
ఏ । మ . । ని ॥ తె లు । పు । డు ॥
నిపామ గమ । పాదని దనిసా । సాపా ॥
ఏ . । లా . . । గు ॥ తాళుదు ఓ చెలియ ॥

అ ప   పా । పానిప । ప మపా ॥ పా స సని దని । సా । సా ॥
. భా । మ . । రో ॥ యూ . । రి । కి ॥

సారిస నీ పని సా । రి గరిగ రిస । సా ॥ సని సా సని దా । నీ స రిస । సా ॥
బ య । లు । దే ॥ రే డి . । వే । ళ ॥

సా ప మ । ప నిసరి గరి । సాసా ॥ సా ని రిసనిదా । దనిదని దప । ని పామ ॥
ప్రే । మ । మీ ॥ అ న । సా । మి ॥

పా మగమ । పా పాదని । తపమా మా ॥ మా పమ గరి । గా । గా మ పమ ॥
పి లి । చి । చె ॥ ప్పి న । మా । ట ॥

2 మా పా । పానిప । ప మపా ॥ పా స స ని దని । సా । సా ॥
భా । మ । రో . ॥ యూ । రి . । కి ॥

సారిస నీ పని సా । రిగరిగ రిస । సా ॥ సని సా సని దా । నీ స రిస । సా ॥
బ య । లు । దే ॥ రె . డి । వే । ళ ॥

పా ప మ । ప నిసరి గరి । సాసా ॥ సనిసరీ రిసనిదా । దనిదని దప । ని పామ ॥
ప్రే । మ . । మీ ॥ అ నా । సా । మి ॥

పా మ గ మ । పాదని దనిసా । సాపా ॥ మా పమ మగారి । గా । గా మ పమ ॥
పి లి । చి । చె ॥ ప్పి న । మా । ట . . . ॥

మా

శమని ॥

చ: .. సగరి । సా । సా ॥ సా । సా గ । రి రిసని ॥
అ న్న । మిం । ద ॥ క । అ । తి . ॥

సా నిస । మా । మా ॥ మమగరి గమ పమ । మా । మా గ ॥
. వెత । నొం । ద ॥ కు . । మ । ని ॥

పమగరి గమ । పా . । పా ॥ పా పని దనిద । దా ని పా । ని పామ ॥
. క । న్ని । రు ॥ నిం । ప . । కు . ॥

పా మగ రి । గా గా మ । పమమా ॥
. క లు । వ । రిం ॥

మా నిప మగారి । గా మ పమ । మా ॥ మా . పా । పాపనిపా । ప మపా ॥
ప కు । మ . । ని . ॥ ఎ । న్నె । నో్న ॥

పాస సని దని । సా । సా ॥ సారిస నీ పనిసా । రిగరిగ రిస । సా ॥
వి ధ . । ము । ల ॥ హి . త । వు . । లు ॥

సని సా సని దా । నీ స రిస । సా ॥ సాపాపమ । ప నిసరి గరి । సాసా ॥
తె . . లు । పు । చు ॥ క । న్ని . . । రు ॥

సా ని రిసనిదా । ద నిదని దప । ని పామ ॥ పా మ గ మ । పాపా దని । దపమా మా ॥
నిం . । పు । చు . ॥ . కాం . । తు . . । . డు ॥

మా . ప మమగారి । గా । గా మ ప మ ॥ మా
చె . ప్పి । న । మా ॥ ట ఏమని ॥

**అవతారిక :**

విరహోత్కంఠితయైన ఈ నాయిక పరకీయ, మధ్య బాలప్రాయమునుండియు తన్నేలిన మువ్వగోపాల విభునకు నేడు తనయందు నెనరు లేకపోయెనని చెలికత్తెతో 'అలిగితే భాగ్యమాయెగాక - తలిరుబోణిరో వాని దండింపగలమా ?' అని చెప్పుకొనుచున్నది ఈ పదమునందుగల హుసేని రాగచ్ఛాయలు అతిమధురములు చరణమును ప్రారంభించుచూ 'అరసొంపు మాటలు' అనునప్పుడు "స స పా పా" అను ఎత్తుగడవలన ఈ రాగమునకు పూర్వార్ధమున, ఉత్తరార్ధమున గల ప్రత్యేకపు సొంపులను ఎత్తి చూపుచున్నారా ? అని తోచుచున్నది.

హుసేని రాగమును హుశ్శాని, హుస్సేని, ఉసేని, హుసాని అని వేరు వేరు విధములుగా వేరు వేరు గ్రంథములలో వ్రాసియున్నారు పేరేదైనను రాగమొక్కటే. ఆయా ప్రాంతపు పలుకుబడి ననుసరించి గ్రంథకర్తలు వ్రాసియుండవచ్చును హుసేని 22 వ మేళమగు ఖరహరప్రియ జన్యము భాషాంగము స రి గ మ ప ని ద ని స - స ని స ప ద మ ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు అయినప్పటికి 'స స పా' - 'ప ని ద మా' - 'ప ద ని సా' - 'ప స ని సా' - 'ని ద పా' - 'ద పా' - 'మ గ ప మ గ రీ' మొదలగునవి రక్తి గల ప్రయోగసందర్భములు అనేకములు వచ్చుచున్నవి 'మా పా ద ప' - 'స ని స ప ద ప' అనునప్పుడు శుద్ధ ధైవతములు పలుకుట పద్ధతి మిగిలిన సంచారములను పదములను అధ్యయనముచేసి తెలుసుకొనవలెను.

## రాగం - హుస్సేని - త్రిపుటతాళం

ప అలిగితే భాగ్యమాయె గాకేమి వా - డలిగితే భాగ్యమాయె

అ ప తళిరుబోణిరో! వాని - దండింపగలమా వా ॥ డలిగితే ॥

చ అరసొంపుమాట - లాడే వానికి నేను
తరుణిరో! మంచి - దాన నయ్యేనా ?
సరసకు రాడాయె - సకియరో! నామోము
తిరిగి చూడడేమో - దేవుడున్నాడే! వా ॥ డలిగితే ॥

2 జాళిలేదిక - నేల నాతో పొందు
చాలుకాబోలు - సంతోషమాయ
ఈలాగునే వాని - కితవుగాదేమో
నీలవేణిరో! నాటి నెనరించుక లేక వా ॥ డలిగితే ॥

3 బాలప్రాయమునాడె - భ్రమయించి నన్ను వా
డేలిన సుద్దులెన్నెన్నో గలవు
చాలనాతో బా - సలు చేసినాడే, యో
బాలరో! మువ్వగోపాలు డిప్పుడు వా ॥ డలిగితే ॥

ప సాసనినిధ । ధాసని । సా ॥ సా . , . । సా । ॥
అలి । గి . । తే ॥ । వా । ॥

2. సాసనినిధ । నీరిస నీ । సా ॥ సా । ప రిగరి । నిసరిస ॥
డలి । గి । తే ॥ . । వా . । ॥

3 సాసనినిధ । నీరిస నీ । సా ॥ సా . । పా । పా మ పా . మ ॥
డ లి । గి । తే ॥ . । భా । గ్య ॥

పా సని । ని దపా । పాదప ॥ మగ మానిప మగ । రి । సా ॥
మా . . । యె । గా ॥ కే . । మి . । వా ॥ డలిగితే ॥

4 ప నిదనిసరి । స నిపద । మ పా ॥ మగ మానిప మగ । రి । సా . ॥
మా । యే . । గా . ॥ కే . . . । మి । వా . ॥ డలిగితే ॥

5 ప దనిసరిస । ని దపా । మా ॥ ప దనిపదప । మగ మానిప । మగ రి ॥
మా . । యె । గా ॥ కే । మి . . । వా ॥

సాసనినిద । ధాసని । సా . ॥
డ లి . । గి . । తే ॥
॥ శ్రీ ॥

అ.ప   పప । సా  । సా . ॥ సా ని రి సనిదా । పా । పమపమ ॥
తలి । రు . । బో ॥ ణి రో । వా . । ని . ॥

2 పా పప । రిగరీ సరీమ । గరిసా ॥ సా ని రిసనిదా । పా । పమపమ ॥
. తలి । రు . । బో ॥ ణి రో . । వా । ని ॥

3 పా పప । సా । రి గ మాపమ ॥ గరిసా । గరీని । సా ॥
. తలి । రు । బో ॥ ణి రో । వా । ని ॥

1) పా సని । నిదపా । పాదప ॥ మగ మానిప మగ । రీ । సా ॥
దం . । డిం । ప ॥ గ ల । మ - । ॥ తలిరు ॥

2) ప నిదనిసరి । సనిపద । మపా ॥ మగ మానిప మగ । రి । సా ॥
దం . । డిం । ప ॥ గ ల । మ । ॥ తలిరు ॥

3) ప దనిసరిస । నిదపా । మా ॥ పదని పదప । మగ మానిప । మగరీ ॥
దం । డిం । ప ॥ గ . ల । మ . । వా ॥ డలిగితే ॥

చ. ... సస । పా । పా ॥ ప మపాసని । నిదపా । పాదప ॥
. అర । సొం । పు ॥ మా । ట । లా ॥

మగ మానిప మగ । రీ . । రీ . ॥ గారి । రి స రీ మ । గ రిసా సా ॥
డే . । వా । ॥ నికి । నే . । ను ॥

సా రి రి । రీ మరి । మ రిమా ॥ పా దప । మగ మానిప । మగరీ ॥
తరు । ణి . । రో . ॥ మం . . . । చి . । . . ॥

రీసా స గ । గరిరీ । రి మగా ॥ మ గమపామ । మా । ॥
దా । న । నై ॥ య్యే . । నా . । ॥

పమ । పాసని । ని దదా ॥ ని దనిసాని । సా । సా ॥
సర । స । కు ॥ రా . । డా . । యె . ॥

సా పాసని । సా రిస । రీ మ గరిసా ॥ సాని రిసనిదా । పా । ప మపమ ॥
. సకి । య । రో ॥ నా . । మో । ము . . ॥

పా పప । సా । సా ॥ సని సారిస నిద । పా . । ప మపమ ॥
తిరి । గి । చూ ॥ డ । దే । మో . . ॥

పా సని । నిదపా । పాదప ॥ మ గ మానిప మగ । రీ । సా ॥
దే । వు । డు ॥ న్నా । దే . । వా ॥

పాసనినిధ । నీరిస నీ । సా ॥ సా . । పా । మా ॥
డలి . । గి . । తే . ॥ । భా . . । గ్య ॥

ప దనిసరిస । ని దపా । మా ॥ పదనిపదప । మగ మానిప । మగరీ ॥
మా . । యె . । గా ॥ కే . . । మి । వా ॥ డలిగితే ॥

**అవతారిక**

ప్రౌఢ నాయికయగు ఈమె పరకీయ, ఖండిత నాయకుని ఉదాసీనతను అతడు మభ్యపెట్టిన విధములును, ఆతనికే, మొగమాట మింతైనలేక ఖండితముగా చెప్పి తన కోపమును స్పష్టపరచుచున్నది

రాగం - హుసేని - ఆదితాళం

ప తెలిసె నీనెనరు లేని జాడలు తేటతెల్లముగను నాసామి !

అ ప వలదు నిలుఫ యీమాటలకేమివచ్చె మువ్వగోపాల నాసామి ! ॥ తెలిసె ॥

చ మనసు కలిగితే దినమొక్కసారి - మాయింటికి రావా ? యెంతో
చనువుమీర లాలించి ముద్దిడి - సరసనంచుకోవా ! నాసామి
తనివితీర మోవిచ్చి కప్పురపు-తావిమడుపులీవా ? యీ
తనువు నీదని నమ్మికజేసినయీ - తచ్చనలేగాని కొంచగాడవా ॥ తెలిసె ॥

2 ఊరిదాక పోయివచ్చేదని నీ - వూరకే యనలేదా ? అయి
దారు దినము లిందుండిమో మొక్క - సారి చూప రాదా ?
వారిజాక్షికి హితవై తేగాని - పేరు తలచ నీదా ? క
న్నీరు నించి దయ మరువకుమన్నది
నీతోనె గాదా ? మరియాదా ? ॥ తెలిసె ॥

3 కూడియుండలేదా ? నను మెచ్చి - కూరిమితో నీవు యిపు
డాడ కాడ కేమేమో తలచుక - అంతరంగ మీవు
జోడు బాయలేనని బతిమాలితె వేడ వలదనేవు నా
యీడు వార లెక సెక్కెము లాడుట
కింతచేసి నాడవు మంచివాడవు ॥ తెలిసె ॥

ప పాపద నీ సా । పా । సా ని సా ॥
తెలి సె నీ । నె । న రు ॥

పాదని దని సాసప । పాపమ గరి । రిగమా పా ॥
లే ని । జా । డ లు ॥

రీ రిగ మాపాదప । మ గ రి స । రీ రిని ॥
తే ట తె । ల్ల ము . । గా ॥

సా . ని స । రీ గ మగ । రీ గమ రిగ సా ॥
ను నా । సా । మి . ॥

2 పా పద నీసా । సా ని । సారీ ॥ సారిస నిద పాపమ । మాపమ గరి । గరిసా ॥
తెలి సె నీ । నె । న రు ॥ లే ని । జా । డ లు ॥

రీరిగ మాపా సనిదప । మగ రి స । రీ రిని ॥ పా ప స । ని రి సనిదపా । పమగరి సా
తే ట తె । ల్ల ము । గ ॥ ను నా । సా । మి .

అ. ప   ప ప సాసా । ని ద । పా మా ॥ ప పనిదనీ । సాసని । సాసా ॥
వ ల దు ని । లు . । పు యీ ॥ మా టల । కే । మి ॥

2 . . ప ప సా సరిగరి । నిసరిస ని ద । పా మా ॥ ప పనిదనీ । సాసని । సాసా ॥
. . వ ల దు ని . । లు । పు యీ ॥ . మా టల । కే . । మి ॥

3 ప ప సా రిగమాపమ । గరిసా ని ద । పామా ॥ ప పనిదనీ । సాసని । సాసా ॥
వ ల దు ని । లు । పు యీ ॥ మా టల । కే । . మి ॥
సానిస రీ సా । సా రీస నిద । పా మా ॥ పాపద దని పాపా । ని దపా । ప మగరి ॥
. వ . . చ్చె . । ము । వ్వ గో ॥ పా ల । నా । సా ॥

4 గ మ సానిస రీ సా । సారిస నిద । పా మా ॥ ప దనిస రిగరిస నిదపా మా ।
మి వ చ్చె । ము । వ్వ గో ॥ పా ల ।
ప దనీ పానిప । మాపమ గరి ॥ గ మ
నా । సా ॥ మి తెలిసె ॥

చ   రి రి రీ రి । గరిరి । రి గరిగ సరి ॥ రీ రిరిగ మ పా దప । మ గరీ । సా ॥
మ న సు క । లి గి । తే ॥ దిన మొ క్క । సా । రి ॥
రీ గామా । గాపాపమ । పాపమ పాపమ ॥ పా ప పమా మగరిగ మా ।
మా యిం । టి । కి రా ॥ వా . ।
పా దప మాపమ । మాగరి రి గమా ॥ పా ప ప సా స ని । దా పాదప । మాపాపమ ॥
రెయిం . । తో ॥ చ ను వు మీ । ర । లా ॥

పా దని దని పాదప మప । ప మగా మప । పమగా రి స ॥
లిం చి , । ము । ద్ది డి ॥

సా రీరిగ మాపా । దపమగ । రిస రీ గరి ॥ రీగరి సా ని స । రీ రిగ మగ । రీ గమ రిగసా ॥
సర . సనుం । చు । కో ॥ వా నా । సా . । మి ॥

2 సాప ప సనిసా పాదప । మప ప మగా । రిస రీ గరి ॥
నీ సరస నుం . । చు । , కో ॥

రీగరి సా . ప దనిస । రీ గరిస నిదపా । ద పమా పమగరి ॥
వా నా । సా ॥ మి . ॥

సా ప ప ప ని దాదని । సా సనిదా । పామా ॥ ప మ పా ప నిదా నిదాని । సాసని సా ।
త ని వి తీ । ర । మో ॥ వి చ్చి క । ప్పు ।

సాసా ॥ ప నిదా నీ । సా రీ । సాసా ॥ సా ప నిదానీ । సాసని । సాసా ॥
ర పు ॥ తా . వి మ । దుపు । లీ వా ॥ యీతనువునీ । ద । ని . ॥

ని స రీ సా । సారిస నిద । పమ పా ॥
న మ్మి క । జే । సిన యీ ॥

సానిస రీ సా । సారిస నిద । పామా ॥
త చ్చ న । లే । గా ॥

పదనిస రిగరిస ని దపా మా । ఎ దని పానిప । మాపమ గ రి ॥
ని కొం చ । గా డ । వా ॥

గమ

తెలిసె ॥

**అవతారిక**

మానవతియైన స్వీయ నాయిక ఈమె ఖండిత ఈమె ఊరకనే అలుగదట. తన చెలికత్తెల నందరిని పిలిచి, నాయకుని తప్పులను వారికి చెప్పి, తాను చేసిన ప్రతిక్రియలు చెప్పి 'అడుగరమ్మా! అతనిపై ఊరకే అలిగినానటరే?' అంటూ, అతనిపై లేనివి కల్పింపరాదని, 'వాడ వనితలెల్ల వినగ దానినే జూడక తాళలేనన్నది తానో? నేనో?' అని చెప్పి, అతనికి జవాబు చెప్పుకొనుటకు కూడ అవకాశ మియ్యకుండునంతటి తొందరపాటుతో దండించు చున్నది

ఈ ముఖారి రాగము అతి ప్రాచీనము భాషాంగము యిప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహరప్రియ జన్యముగా చెప్పకొనవచ్చును ఆరోహణమున చతుశ్రుతి ధైవతమును, అవరోహణమున శుద్ధధైవతమును వచ్చుట పరిపాటి 'స నిదమా' - 'ప ని దమా' - 'పదమా' అను సందర్భములలో అవరోహణమే అయినను చతుశ్రుతి ధైవతమే పలుకును వెంకటమఖి సంప్రదాయమున చెప్పిన ముఖారియు, క్షేత్రజ్ఞుని పదములయందలి ముఖారియు రెండుచుమించు ఒకటిగానేయున్నవి భాషాంగ స్వరము చతుశ్రుతిధైవతమైనచో ఈ ముఖారి నటభైరవి జన్యముగను, భాషాంగ స్వరము శుద్ధధైవతమైనచో ఖరహరప్రియజన్యముగను చెప్పకొనుటకు అవకాశము కలుగుచున్నది వెంకటమఖి సంప్రదాయమున ఈ రాగము నారీరీతి గౌళ జన్యము కొందరు యితరగ్రంధకర్తల మతములో నిది ఖరహరప్రియ జన్యము. ఇటువంటి రాగములకు జనకరాగములు నిర్ణయించుటకు పాటింపదగిన ఒకనియమము మా గురువులవలన విని యుంటిని సకృత్తుగావచ్చి, భాషాంగస్వరూపమును నిర్ణయించుటకుమాత్రము తోడ్పడుస్వరమును వదలి, అన్యస్వరములనుగమనించి, జనక రాగమును నిర్ణయించవలెను ఈనియమము చెప్పుటకు సుల భముగానే యున్నది కాని నిర్ణయముచేయుటకు దిగినప్పుడుమాత్రము కష్టముగానేయున్నది కారణము ముఖారిరాగమునందలి రెండు ధైవతములును, ప్రత్యేకములయిన ఒదుగులు, బిరువులు మొదలగువాటితో రాగస్వరూపమును నిర్ణయించునవిగాను, ఇది ఎక్కువగావచ్చును, ఇది తక్కువగా వచ్చును, అని చెప్పుటకు వీలులేకుండగను, వుండుటవలన వెంకటమఖియు, ఆధునికులునుకూడా

సరిగానే చెప్పినారనక తప్పదు కాని ఇంకొక్క సంప్రదాయమున్నది ఇటువంటివేగాక ఔడవ, షాడవములైన కొన్ని రాగములకు జనకనిర్ణయముచేయునప్పుడు 72 మేళకర్తలలో ఒకటినుండి ప్రారంభించి ముందుగా ఏ మేళకర్తకు ఈ రాగము అన్వయించుటకు వీలుగలదో ఆ మేళకర్త జన్యమని చెప్పవచ్చునను మతముకూడా ఒకటియున్నది

రాగం - ముఖారి - త్రిపుటతాళం

ప. అడుగరమ్మా! ఆతనిపై ఊరక - అలగినానటరే

అ ప. పడుచుతనము మాని మువ్వ గో -
పాల రాయని అనబెట్టి మీరు ॥ అడుగరమ్మా ॥

చ పూని దానింటికి పోగానే మా - పొలతి జూచి బెదరించితే
దానికి లంచమిచ్చెదనన్నది తానో ? నేనో ?
వానిపై లేనివి కల్పింపరాదు - వాడవనితలెల్ల వినగ
దానినే చూడక తాళలేనన్నది - తానో ? నేనో ? - అనబెట్టి మీరు ॥ అడుగరమ్మా ॥

2 అలుకు దీరి దాని వాకిట - నిలిచి వీధిలో నన్ను జూచి
తలుపుమూల దాగియున్నది - తానో ? నేనో ?
అలసివచ్చెననుచు జక్కె - రానవాలిచ్చిన నారగించి
తలిరుబోణి మోవి రుచికి రాదన్నది - తానో ? నేనో ? అనబెట్టి మీరు ॥ అడుగరమ్మా ॥

3 సొలపుమీర దాని రూపు - పలకమీద వ్రాసి పాణి
తలమున నుంచి కనుగొనుచున్నది - తానో ? నేనో ?
కలసి మా మువ్వగోపాలరాయని - కౌగలించితే అల్ల దాని
తలచి యసురసురన్నది - తానో ? నేనో ? అనబెట్టిమీరు ॥ అడుగరమ్మా ॥

ప. నిధ । సా । రీ ॥ మా । మాదప మగారి । రిసా ॥
అడు । గ । ర ॥ మ్మా । । . ॥

సారీ మా । పాపద । నీ దా ॥ దమ పాసని నిదదా । సా । సా ॥
అత । ని । పై ॥ ఊ । ర । క ॥

సదరి సనిదా ప । పా . । పా ॥ పమద పమగా రి । రీ గరి రిగస । సా ॥
అ ల । గి । నా ॥ న ట । రే । ॥

అ ప . దనిదా । దానిద దానిద । దానిద దానిద ॥ దపద సాని । ని దదా । పా ॥
ప . డు । చు . । త ॥ న ము । మా । ని ॥

నిదామ రి మ । పాపద । నీ దా ॥ దమ పాసని నిసదా । సా । సా ॥
ము । వ్వ । గో ॥ పా । ల । రా ॥

స రిస రిగరి । రిస రిపమ । గరిరిస ॥ సా రి దా నిదప । పాపమ గరి । రీ సా ॥
య ని . । ఆ । న ॥ బె । ట్టి । మీ ॥

సా
రు . అడుగరమ్మా ॥

చ: ప ద । పా మ । పా ద ॥ సా స ని । నిదదా । పా ॥
. పూ । ని । దా ॥ నిం । టి . . । కి ॥

పా . రి మ । పా . । దాపా ॥ ప మపామా । మ గరీ । రీ సా ॥
. . పో . । గా . । నే . . ॥ మా . । పొ ల । తి ॥

సా గ రి । సాసని । నిధధా ॥ సా । రీ సా । రీ మా ॥
జూ । చి । బె ॥ ద । రిం । చి ॥

పా . రి మ । పా । దాపా ॥ ప మపామా । గారీ । రీ సా ॥
తే దా । ని । కి ॥ లం । చ । మి ॥

సా స రి । సా ని । ని ధధా ॥ సా ధ స । రీ మా । మా ॥
. చ్చెద । న । న్న ॥ ది . తా । నో । . ॥

గ రిసరిమా । పా । . ॥ దానిద । దానిద దానిద । దా నిద దానిద ॥
నే । నో . । ॥ వా । ని । పై ॥

దపదసాని । నిదదా । పా ॥ నిదామ రిమ । పా । దాపా ॥
లే । ని । వి ॥ . క . । ల్పిం . । ప ॥

ప మపామా । గారీ । రీ సా ॥ సా . స రి । సా ని । నిధధా ॥
రా । దు । వా ॥ డ వ ని । త । లె . ॥

సా రి సా । రీమా । పా ॥ పా రి మ । పా ద । నీ దా ॥
ల్ల రు । వి వ । గా . ॥ దా । ని । నే ॥

ద మ పాసని నిదదా । సా । సా ॥ సా ప ద । సారిగ రిగ । రిససా ॥
చూ । డ । క ॥ తా ।ళ । లే ॥

సాగరి సనిదా । సా . । సా ॥ ప ద సరిరీ । । రిస నిద ॥
న । న్న । ది ॥ తా నో . । . . । నే ॥

సా । రిస రిపమ । గరిరిస ॥ సా రిదా నిదప । పాపమ గరి । రీ సా ॥
నో । అ । . న ॥ బె . । ట్టి । మీ ॥
సా
రు అడుగరమ్మా ॥

**అవతారిక**

స్వీయ మధ్య విప్రలబ్ధయగు ఈ నాయిక తన చెలులు ఎట్లు తనను మోసగించి నదియు చెప్పుచు, వారు మేక వన్నె పులులని నూగింజై నానాన నియరని, ముని ముచ్చులని, కాయజుని తలిరు పదను కత్తులని, తనకు మువ్వగోపాల భావమైన అఖిలాండ నాయకుడైన వరదు నికి గల అన్యోన్యతను చూచి ఓర్వలేకున్నారని వెళ్ళబోసుకొనుచున్నది

రాగం - ముఖారి - త్రిశ్ర ఏకతాళం

ప ఐరాదె నేస్తమమ్మలాక!

అ ప సారసాక్షిపోరేది - చాలునమ్మ చెలులతో ॥ ఐరాదే ॥

చ నామీద నెనరుకల్గి - నావారివలెనుండి
ఏమేమో విభునితో - ఎగబోసి నారమ్మా
ఆమాట నిజముచేసి - అతడింటు రాడాయె
వామాక్షిరో! మేక - వన్నె పులివంటి చెలులే ॥ ఐరాదే ॥

2 నుడువ నోరాడదమ్మ! నూగింజయిన నాననియరు
అడలినే నొకరితో - నాడుకోరాదె
పడతిరో! నామాటలన్ని - పలికేరే విభునితో
ముడుచుకపోయేరు - మునిముచ్చు లీ చెలులు ॥ ఐరాదే ॥

3 పాయక మువ్వగోపాల - భావమైన అఖిలాండ
నాయకుడైన వరదుడు - నన్నుగూడి
గాయక మెరుగడమ్మ - కటకట తెలియదు
కాయజుని తలిరు పదను - కత్తులమ్మ ! యీచెలులు ॥ ఐరాదే ॥

ప సని ధాసా । సా ॥ గరిరీమా । పాద సా ని ॥ ని దపదపమ । ప మగరిరిస ॥
ఐ రా । దే ॥ నే స్త । మ మ్మ ॥ లా । రా ॥

2 స నిధాసా । సా ॥ రీపమ గరిమా । పద సారిగ రిగ ॥ రిసనిదప । ద పమగరిస ॥
ఐ రా । దే ॥ నే స్త । మ మ్మా ॥ లా । రా ॥
ఐరాదే ॥

అ ప మరిమాపా । పా స నీదా ॥ దమ పాసని నిదదా । సా సా ॥ పాపదసా । రీ రీగరి సా ॥
సా ర । సా టి ॥ పో । తే ది ॥ చా లు । న .. మ్మ ॥
సా రి ద నిదప । పా ప మ గ రి స ॥
చె లు । ల . తో ॥ సారసాటి

2 పా పద సా । రీపమ గరి సా ॥ సా రి ద ని దప । పా ప మ గ రిస ॥
చా లు । న మ్మ ॥ చె . లు । ల . తో ॥ సారసాటి ॥

3 పా పదసా । రీ మా పమగరి ॥ సరిగరిగస రి సనిదమా । మపదపదమపమగరిగస ॥
చా లు । నమ్మా ॥ చె . లు . । ల . . తో . ॥ఐరాదే

చ దా నిదదా । నిదదా నిద ॥ దపదాసరి । స నిదాపా ॥
నా మీ । ద ॥ నె నరు । క . ల్గి ॥

ప రిమాపా । పద సనీ దా ॥ దపద సాద । సా సా ॥
న .. వా । రి ॥ వ లె । నుం డి ॥

మరిరిమపా । సని ని దపా ॥ పమ మదపమ గరి । రి రిగసా సా ॥
ఏ . మే । మో ॥ వి ఘ । ని తో ॥

సా రి మ సా । సనినిధధా ॥ సా సరిగరి సరి । మా మపదప మా । పా ॥
ఎ గ బో । సి . ॥ నా । ర । మ్మ ॥

మరిమాపా । పద సనీ దా ॥ దపదాసా । సా సా ॥
ఆ . మా । ట ॥ ని . జము । చే సి ॥

ద పదాసరి । గరిగరిగస ॥ సా సాగరి సనిదా । సా సా ॥
అ తడిం । దు . ॥ రా . . . । డా . యె ॥

ద పదా సా । సరిమా ॥ గ రి సరిగరి గస । సా . సా ॥
వా మా । ఢి ॥ రో । మే . క ॥

సా రిద ని దప । దాపా ॥ స నిదాపా । ప ప మ గ రి స ॥
వ న్నె । పు లి ॥ వం టి । చె లు . లె . ॥ ఐరాదే ॥

**అవతారిక**

సామాన్య, ఖండిత యగు ఈమె ప్రౌఢ, చతుర ఈమెపై అలిగి నాయకుడు ఆ కోపముతో ఈమెను ఉడికించుటకు యిరుగు పొరుగు వనితలను పిలిచెదనని మీసముదువ్వినాడట వెయ్యారు లిచ్చెదనన్నాడట ! అందుకని తన యిరుగు పొరుగు వారలైన కంచము పొత్తువారిని, చుట్టములను పిలిచి 'పదరి వానిచేతిపైడి పట్టుకొనకుడి' అని ఈమె హెచ్చరిక చేయుచున్నది కంచముపొత్తువారనుటలోను గల తెనుగు నుడికారపుటందము గమనింపదగినది

**రాగం - ముఖారి - ఆదితాళం**

ప : పదరి వానిచేతిపైడి - పట్టుకొనకుడి

అ ప కొదవలై యిచ్చ్యాని ముద్దు - గోపాలుడలగి వచ్చెను ॥ పదరి ॥

చ : విరిబోణి మీరు మేము - వింత వారము కాము
పొరి చూపలే కంచము - పొత్తువారము కామా
అరమరికలేని చుట్టాలగు మీకు మాకు
విరసమయ్యానునుచు - ఎరుకచేసెదమీకు ॥ పదరి ॥

2 చెలిమి నా యిరుగు పొరుగు - చెలుల పిలుతునని
తొలుత నాయొద్ద మీసము - దువ్వుకొన్నాడు
వెలది యా రోసాన వాడు - వేయారు లీయజూచెనే !
చెలగి యందు కాసించి - చేరి వానిచేత మీరు ॥ పదరి ॥

8 ఎప్పటివలెనే వా - డిందు వచ్చి నన్నేలితే
అప్పుడు చెప్పేనుగాని - యీసుద్దులెల్ల
కప్పురగంధిరో వాని - కసరివేసారుకోక
మొప్పెతనమున - మువ్వగోపాలుడలిగి వచ్చెను ॥ పదరి ॥

ప పపదసా । సాదా । రిసాని నిదాప ॥ పా పమ పా దరిసని । నిదాపపా । మగరిమ ॥
పదరివా । నిచే । తి పై ॥ డి ప ట్టుకొ । న కు । డి ॥

2 పామ పపద స రిగరి । పమగరి సా . ద । రిసాని నిదాప ॥
పదరి వా । ని చే । తి పై ॥
పా పమ పా ద రిస ని । నిదాప పా । మగరిమ ॥
డి ప ట్టుకొ । న కు । డి ॥

అ ప పా రి మపపా । పనిదప పమగరి । గరిరీ స ధ ॥
కొ దవ లై । యీ్యా । ని ము ॥
సా గ రి సా ని ని ధ ధా । సరిగరి మా । దపమగ రి మ ॥
వ్వ . గో పా లు । డ ల గి । వ చ్చె ॥

2 పామ రి మప పదనిద । సా రి సనిదప । పమగరి సరిగస ॥
ను కొ ద వ లై । యీ్యా . । ని ము ॥
రిగససా గ రిసా ని నిధ ధా । సారిమా పా । ద సా రి సనిద ॥
వ్వ . . గో పా లు । డ ల గి । వ చ్చే . ॥
పమగరిమా
ను . . పదరివాని ॥

చ. పద పా పా । పమమద పమగరి । రీ గస సా ॥
విరిబోణి । మీ రు । మే ము ॥

సా రి సా ని నిధధా । సాసా । రీ గస రీగస ॥
వింత వా. । రము । కా .. ॥

సా రి మ పా దానిద । నిదదా పా । మా ప మగరి ॥
ము పొరి చూప । చే కం । చ ము ॥

రిసా రి మ పాదప పమపమ । మగరీ మా । పదపద మప ॥
పొత్తు వా .. । ర ము । కా మ ॥

పా రిమ పా దానిద । దానిద దపాద । సా ని ని దదా ॥
· అరమరి । క తే । ని చు ॥

పా సరిస రీ పమగరి । రిగసా సాగరిసని । నిదదా సా ॥
ట్టా లగు మీ । కు మా ·।. · కు ॥

సా పద సరిగ రి రిగసా । సా ని నిదాము । ప ని నిదదా ॥
· విరస మ । య్యా న । ను ॥

సా రి మ పాదప । మపదప పమగరి । మా పదపద ॥
చు ఎరుకజే । సె ద । మీ ॥
మపమ
కు పదరివాని ॥

**అవతారిక**

ప్రోషిత పతిక, స్వీయ యిందలి నాయిక అన్యాయత్త చిత్తుడైన నాయకుని మౌనమును, ఉదాసీనతను భరింపలేక నాయిక 'ఏమనే వానతీరా ? తిలక మేతీరుగదిద్దుదునో ? దేవుడవని మ్రొక్కుదునో ? పొలయలుకసేయుదునో ?' అని తనకుగల నేర్పులన్నియు చెప్పుకొనుచు, అతని మనసు మరలింప చూచుచున్నది

**రాగం ముఖారి - త్రిపుటతాళం**

ప. ఏమ నే వానతీరా ? యేమిసేతురా ?

అ ప తామసమేల జేసేవు ? - దక్కితి మువ్వగోపాల ॥ ఏమనే ॥

చ పదము పాడగ వినేవో ! - చదరంగమేచూచేవో ?
సదయుడ ! కాగిలించేవో ! - చక్కెరకెమ్మోవే నొక్కేవో ? ॥ ఏమనే ॥

2. తిలక మేతీరు దిద్దుదునో ? - దేవుడవని మ్రొక్కేనో ?
పొలయలుకలేసేయుదునో ? - చెలిమితో లాలింతునో ? ॥ ఏమనే ॥

8 చేరి కూడియుందునో ? - చెక్కిలి నొక్కుదునో ?
కూరిమితో విడెమిత్తునో ? - గొబ్బున మువ్వగోపాల ॥ ఏమనే ॥

ప. సనిదా । సా । రిగరిగ ॥ రి సరి । సగరి సని । నిదపద ॥
ఏ । మ । నే ॥ వా । న . । తీ ॥

సా సాగరి । స నినిద । దా మా ॥ పా నీనిద దా । సా . । ॥
రా ఏ । మి । నే ॥ తు । రా । ॥

అ.ప. సా పద । సా । సా ॥ స దరిస గరి । రిసాని । నిదదా ॥
తా । మ । స ॥ మే ల . । జే . । సే . ॥

పా . పా । ప పమగ । రీ సా ॥ గ రీ రి మా । పాపని । ని దపద ॥ సా
వు ద । క్కి । తి ॥ ము వ్వ । గో . । పా . ॥ ల ఏమనే ॥

చ. సాగరి సనిదా । సా । రి గరిగ ॥ రి సరి । సగరి సని । నిదపద ॥ సా . ।
తి ల । క . । మే ॥ తీ రు . । ది । ద్దు దు . ॥ నో జే . ।

సనినిద । దామా ॥ పా నీనిద దా । సా । సా . . ॥ సా . పద । సా సా । సా ॥
వు . । ద ॥ వ ని । మ్రొ । క్కే ॥ నో పొల । యలు । క ॥

స ద రి సగరి । రిసాని । ని దదా ॥ పా పప । ప పమగ । రీ సా ॥
సే . యు । దు । నో ॥ చెలి । మి । తో ॥

గ రీరిమా । పా పని । నిదపద ॥ సా . .
లా . లిం . । తు । ॥ నో ఏమనే ॥

**అవతారిక**

విరహోత్కంఠితయగు ఈ నాయిక ప్రేమ తపస్విని త్రికరణశుద్ధిగా స్వామిని నమ్మిన ఈమెకు గోటనేమి వ్రాసిన అతని రూపుగానే తోచునట పరితో ముచ్చటలాడబోయినను అతని పేరే ముందుగా వచ్చునట కన్నుగూర్కి మేలుకాంచగనే, అతని చేరువనుండినట్లుండునట

మేడనెక్కుచు తన నీడ చూచుకొనగ, అతడే తనవెంట వచ్చుచున్నట్లుండునట. కృతిగూడి అతనిపేరు తలచి పాడుకొనగ, అతడు జోడుపాడినట్లుండునట ఈమె సంగీత సాహిత్యకోవిద. చిత్రకళా నిపుణ గనుకనే యింతచక్కగా తన స్వామియందలి ప్రేమాతిశయ మును చెప్పుకొనగలిగినది ఈ పదము క్షేత్రజ్ఞులదేనా? అను సందేహము తోచుటకు 'మువ్వ గోపాల ముద్ర' లేకుండుట తప్ప వేరుకారణము కానరాదు సంగీత సాహిత్యముల పోకడలు గమనించినచో క్షేత్రజ్ఞులు తప్ప వేరొకరిట్లు చెప్పగలరా? అని తోచకమానదు అచ్చునందు కొన్ని తప్పులతో కళ్యాణి రాగమున ఈ పదము కానవచ్చుచున్నది కాని మా పాఠము ముఖారి

రాగం - ముఖారి - త్రిపుటతాళం

ప నామనసువంటిదే నీ మనసైతే నా
నోము ఫల మీడేరురా అదిగాక

అ. ప. వే మారు చెరకున పండు పండినయట్లు
వేడుక యినుమడించురా! ఓరి వరద! ॥ నామనసు ॥

చ ఊరకయుండక గోటనేమి వ్రాసిన
నీరూపే ముందుగా వచ్చురా
నేనేరితో ముచ్చటలాడబోయిన నీ
పేరే ముందుగా వచ్చురా
పరాకన్నుగూర్కి మేలు కాంచిన నీ
చేరువ నుండినట్లుండురా!
ఈరీతి నామోహము - ఇది నీకు తెలుసును
ఎవరితో విన్నవింతురా - ఓరి వరద! ॥ నామనసు ॥

2 మేడనెక్కుచు తిరిగి - నీడ జూచిన నీవు
కూడవచ్చినట్లుండురా! - శ్రుతి
గూడి యునిచికొని - పాడినంతనె నీవు నా
జోడు పాడినట్లుండురా!
ఈడులేనిది నా వలపు ఇది నీకు తెలియును
ఎవరితో విన్నవింతురా? ఓరి వరద! ॥ నామనసు ॥

3 వినరా ఆహ్లాదమెపుడు? - నీ కౌగిట
పెనగొన్నట్లుండు! నేమందురా? - నా
మనసు పెరుందేవి వరదా! - యని తలచిన
నెనసి కూడినట్లుండురా!
ననుబోటి సతులెల్ల నీవు - నాసఖుడంటే
విన సంతోషమైయుండురా!
ఎవసిన తమిరహస్యమదినీకె తెలియు! నే
నెవరితో విన్నవింతురా? ॥ నామనసు ॥

ప .. ప ద । సాసా । సా ॥ సా రిగరీ సరిసా । ససనిద । దామా ॥
నా । మ న । సు ॥ వం . . । టి । దే ॥

మా పమ । పాసని । నిదాప ॥ ప పమగరీ । గ రిగస । సా ॥
. నీ । మ । న . ॥ సై . । తే । ॥

సా సాగరి । స నిధా । సాసా ॥ సారీరి । మా । మా ॥
నా . నో । ము । ఫ ల ॥ మీ . । డే । రు ॥

మానిప మగరీ । గరిగస । సా ॥ రీరిమా । పాసని । నిదామ ॥
రా । . । ॥ అ ది । గా । క . ॥

అ ప . మా ప ద । సాసా । సా ॥ సా రిగరీ సరిసా । ససనిద । దామా ॥
వే । మా । రు ॥ చె ర । కు . । న ॥

మా ప మ । పాసని । ని దామ ॥ పపమగరీ । గ రిగస । సా ॥
.. పం । డు । పం ॥ డి న । య . । ట్లు ॥

. సాగరి । స న్నిధా । సా . ॥ సా రీ రీ । మా । మా ॥
. వే । డు . । క . ॥ యి ను । మ । డిం ॥

మానిప మగరీ । గ రిగస । సా ॥ రీరిమపా । పాసని । నిధామ ॥ మా
చు . . । తా . . । ॥ ఓ . రి । వ ర . । ద . . ॥ . ॥ నామనసు ॥

చ: . దా నిద । దానిద దానిద । దానిద దానిద ॥ ద పదసాని । నిదదా । పా . ॥
. . ఊ । ర । క ॥ యుం . । డ । క ॥

. . . . ప ద । సా . రి । సనిదా ॥ పా . . । ప పమా । మగరీ ॥
. . గో । ట । నే . ॥ మి . । ప్రా . । సి . ॥

గరిగససా । సా । ॥ సా గరి । స నిధా । సా ॥
న . । నీ । ॥ రూ । పే । ముం ॥

స మరిరిమా । మానిప మగ । రీ మా ॥
దు గ । వ । చ్చు ॥

పా . । । ॥ పా మ నిద । దనిదా దనిదా । దనిదా దనిదా ॥
రా . । । . ॥ నే నే । రి . । తో ॥

ద పదసాని । ని దదా । పా ॥ ప ద । సా రి । స నిదా ॥
ము . . । చ్చ । ట ॥ . లా । డ । బో ॥

దాపా . । పపమా । మగరీ ॥ రీసా । । . ॥
యి న . । నీ . । . . ॥ . । . । ॥

. సాగరి । సనిధా । సా ॥ స మరిరిమా । మానిప మగ । రీ మా ॥
. . . . పే . । రే . । ముం ॥ దు . గ . । వ . । చ్చు ॥

పా సనిదా । సా । రీ . ॥ రీ రీ । రీ । రీ సా ॥
రా ప . । రా । క . ॥ న్నుగూ . । ర్కి . । మే ॥

రీ రీపమ గరి । రీసా । సా . ॥ . . సా । స నినిద । దామా ॥
లు కాం । చి న । నీ ॥ . చే । రు . । వ . ॥

పా నినిదా । దపదా । సా ॥ సా . । సా . . । . . ॥
నుం డి । న . । ట్లుం ॥ డు . । రా . । ॥

ప ద । సా । సా ॥ సా రిగరీ సరిసా । స ని నిద । దామా ॥
. . ఈ । రీ । తి ॥ నా । మో । హా . ॥

మా పమ । పాసని । నిదాప ॥ పపమగరీ । గ రిగస । సా ॥
ము . ఇ ది । నీ । కు ॥ తె లు । సు । ను ॥

సగరీ । సనిధా । సా సా ॥ సారీరీ । మా । మా ॥
. ఎ వ । రి । తో ॥ వి . । న్న । విం . ॥

మానిప మగరీ । గ రిగస । సా . ॥ రీ రిమ పా । పాసని । ని దా మ ॥ మా
తు . . । రా . । ॥ ఓ రి । వ ర । ద ॥

॥ నామనసు ॥

**అవతారిక**

స్వాధీన పతికయగు ఈమె సామాన్య తాను తమిమీరచేసిన పనులను మరచి, యితర నాయిక లెవ్వరో చేసిరని భావించి, ఆతని నడుగగా నాతడు తెలుసుకోమ్మనుగాని, చలియించని నిండుకుండవలె వేరేమి పలుకక యుండునట తిరువళ్ళూరి వీరరాఘవుడైన మువ్వ గోపాల దేవుడు ఎంత మంచివాడే ? అని ఈమె మురిసిపోవుచున్నది ముఖారి రాగమునందు గల కొన్ని ప్రాచీనప్రయోగములు ఈపదమునందు కనబడుచున్నవి

**రాగం _ ముఖారి - త్రిపుటతాళం**

ప సామికి సరి ఎవ్వరే ! నా చక్కని !

అ ప భామరో ! తిరువళ్ళూరి వీర రాఘవ ॥ సామి ॥

చ: నెలతరో ! యెప్పుడైన నేనే చెక్కిలి జీరి
కల గిఎరుక లేకయే - చెలియ జీరెనంటి నా
తెలుసుకొమ్మను గాని - అలిగి మారుబలుకక
చలియించని నిండుకుండవలె నుండునమ్మ ॥ సామి ॥

2. కదసి నేనే వాని మోవి - గంటి చేసి మరపున
పదరి యీలాగునవే _ పడతి యుంచెనందునె
ఆదరి న కోపగించిన - అలసిన సొలసిన
మదిరాక్షి ! నాచిత్తము స _ మ్మతి బరుచునమ్మ ॥ సామి ॥

3 ఖామరో మా మువ్వగో - పాలుడౌ వీరరాఘవుడు
గాముకేళి హాొయలుగ - గలసియుండగ
యేమగువ వద్దకైన - యీలాగుందువో యంటె
యీమాటెట్లంటివని - ఎంతో యుసురసెనమ్మి ॥ సామికి ॥

ప: రి గరీ । సా . ని । నిధధా ॥ ధసాసా । రీ సా । రీ ॥
సా । మి । కి ॥ స రి । ఎ । వ్వ ॥
మా . । పాపని । నిదదా ॥ సానినిదప । ప పమగ । రీసా ॥
రే । నా . । ॥ చ । క్క । ని ॥

2. రి మ । పాదప మగ । రీసా ॥ సా గరిసని ధస । రీ సా । రీ ॥
సా । మి । కి ॥ స . రి । ఎ । వ్వ ॥
మా । పా ద నిద । సా రి గరి ॥ మాగరిసా । ని దమప । దపపమ ॥
రే । నా । . . . ॥ చ । క్క ని । . ॥
గరిరిస
. సామికి ॥

అ ప: . దానిద । దానిద దానిద । దానిద దానిద ॥ దమామా । పా ద నిద । సా ॥
. ఖా । మ . . । రో . . ॥ తి . రు । వ । ళ్ళూ ॥
సా । రీగరి । సా ॥ సా . । ని దమప । దపపమ ॥ గరిరిస
రి । వీ । ర . ॥ రా , । ఘు వ । ॥ సామికి ॥

చ . రి మ । మా . । పాదప ॥ పమపా మ గ రీ । గ రిగస । సా ॥
నె ల । త । రో ॥ ఎ వ్వు । డై . । న . ॥

. ధస । రిమా । మ ॥ మా నిపమగ రీ । రిసారి గరి । మా ॥
నే । నే । చె ॥ క్కి . లి । జీ । రి ॥

రి మ । మా । పాపద ॥ సానినిదా । సా । సనిదా ॥
అల । గి । ఎ రు ॥ క । లే . । క ॥

పా మమ । పా । దాపా ॥ పమపా మగరీ । రీ గస । సా ॥
యే చె లి । జీ । రె ॥ నం . . । టి . । నా . ॥

సా రి మ । మా । పాదప ॥ ప మపా మ గరీ । రీ గస । సా ॥
తె లు । సు । కో ॥ మ్మ ను । గా । ని ॥

సా ధస । రీ మా । మా . ॥ మా నిపమగ రీ । స రిగరి । మా ॥
అల । గీ । మా ॥ రు బ . । లు . . । క ॥

1 మా ని ని । నీ । ని దదా ॥ దమామా । ప దనిద । సా ॥
క చె లి । యిం । చ ॥ ని నిం । డు । కుం . ॥

సా । రీ గస । సా ॥ సా । ని దమప । దపప మ ॥ గరిరిస
డ । వ । లె ॥ నుం । డు న । మ్మా . ॥

2. ని ద । ని ద నిద । ని ద నిద ॥ దామమా । ప దనిద । సా ॥
చె లి । యిం । చ ॥ ని నిం । డు । కుం ॥

సా । సరిగరి పమగరి । సా ॥ సా . । ని దమప । దపప మ ॥ గరిరిస
డ । వ . . । లె ॥ నుం . . । డు న । . మ్మా ॥ .
సామికి ॥

**అవతారిక**

నాయిక స్వీయ ముగ్ధ ఈమెను చెలి తనకుకూడ తెలియకుండ నాయకునితో రహస్య ముగా కలుసుకొనుటను తెలుసుకొని 'ఎంతటిదానవే? ఓ జాణ! మరులెక్కువై వాడే మమతతో పిలిచెనో? పరవశమై నీవే ప్రతిమాలితివో' అని లాలించి అడుగుచున్నది

ఈ కాపీ రాగము ప్రాచీనము దీని స్వరూపము కాలక్రమమున మార్పులుచెందుచూ వచ్చుచున్నట్లు తోచుచున్నది అంతరగాంధార శుద్ధధైవత కాకలినిషాదములు లేకుండ కాపీ రాగచ్ఛాయలు వచ్చునట్లు యిప్పటి ఖరహరప్రియ జన్యముగాపాడుకొను సంప్రదాయము ఒకటి యున్నది అది క్షేత్రజ్ఞులు చెప్పిన పదములలోన, త్యాగరాజస్వామివారి 'రామరఘుకుల జలనిధి సోమా' అను కీర్తనమునందును కానబడుచున్నది వెంకటమఖి సంప్రదాయమున కాకలి నిషాదము, అంతర గాంధారముల ప్రయోగమును జూపి భాషాంగమని చెప్పినారు. క్షేత్రజ్ఞులపదములలోగల కాపి శుద్ధకాపి స రి గ రి మ ప ని సా - స ని ద ని ప మ గ రి సా- అనునవి ఆరోహణావరోహణములు 'స ని ప మ గ రి సా' - 'మ గ ప మ గ రి సా' - 'ప ద ని రి స ని పా' - 'గా స రి మా' అనునవి విశేషప్రయోగములు తక్కినవి పదములు పారముచేసినచో స్పష్టమగును

రాగం - కాఫీ - త్రిపుటతాళం

ప॥ ఇన్నాళ్లు తెలియగనైతి యీ చెలిమి - ఎంతటిదానవే ఓ జాణ నే ॥ నిన్నాళ్లు ॥

అ॥ ప వన్నెకాడు మువ్వగోపాలుడే నిన్ను
వలచెనో? లేక నీవే పిలిచితివో నే ॥ నిన్నాళ్లు ॥

చ. పొరుగిరుగున ఒక్క సరసుడుయుంటే
చిరుతప్రాయపు నీవు ఊరకుందువటే ?
మరులెక్కువై వాడే మమతతో పిలచెనో ?
పరవశమై నీవే బ్రతిమాలితివో ? నే ॥ నిన్నాళ్లు ॥

2 అదిమి వాతెరయిచ్చి ఆముకొనెనో ?
ముదముతో చెక్కిలి నొక్కి - ముద్దిడుకొనెనో ?
కదసి నీవే వాని కౌగిట చేర్చితివో ? నే ॥ నిన్నాళ్లు ॥

3 మరుకేళిలో తానే పైకొనెనో ? లేక
మా మువ్వగోపాలుని నీవే పైకొంటివో ?
అరమరలేలనే ? పలుకవే ! చల్లగ
సరసముగ నన్నేలినట్లేయుండెనా ? నే ॥ నిన్నాళ్లు ॥

ప సా । స సనిద । నీ పా ॥ మగగమపని । మపమగ । రీ ॥
ఇ । న్నా । ళ్లు ॥ తె లి । య । గ ॥
నీ ససగరి । సా. । సా ॥ మ గరిమా । పా । నిదనీ ॥
నై. । తి । ॥ యీ చె । లి । మి ॥

2 సా గ రి । స సనిద । సనినీ పా ॥ మగ గమపని । మ పమగ । రీ ॥
నే ని । న్నా । ళ్లు ॥ తె లి । య । గ ॥
నీ ససగరి । సా । సా ॥ సా గరి । సా । స నిసా ॥
నై . । తి . । ॥ ఎం . । త । టి ॥

రీ  రిస । మమగరి । గసరీ ॥ నిమపాసా । స సనిద । సనినీ పా ॥
దా . । న .  । వే ॥ ఓ  . । జా  . । .  ణ ॥
నీ
వే .  నిన్నాళ్లు ॥

అ. ప : నిమ । పా  । పాసని ॥ సా  । రి గరిస । రీ ॥
వ । న్నె । కా ॥ డు  । ము । వ్వ ॥
రీరిస గ రి । గ మగరి । సా . ॥ సా నినిదా । నీరిస నీ । సా ॥
గో । పా  । లు ॥ డే  । ని । న్ను ॥
నిద । సనిగరి । సా ॥ నిమపా । సా । సా ॥
వల । చె । నో ॥ లే । క । ॥
. రిమ । పదనిరి । సా ॥ గరిసా । ససనిద । నీపా ॥
నీ । వే । పి ॥ ల చి । తి । వో ॥

2. సనిసని పమపా । పా । పనిసా ॥ రీ  రిస । మ మగరి । గసరీ ॥
. వ । న్నె । కా ॥ డు । ము । వ్వ ॥
రీ  గ రి । గమగరి । సా ॥ సానినిదా । నీరిస నీ । సా ॥
. . గో . । పా । లు ॥ డే । ని । న్ను ॥
. మప । ని సరిగ । రీ ॥ సా  సద । నిదనీ । సాసా ॥
. వల । చే . । నో ॥ లే . । । క ॥

సా పద । పద నీరిస । నీపా ॥ మనిపమా గా । సా రి మా । పా ॥
. నీ । వే . । . పి ॥ ల చి । తి । వో ॥

నీ సా । స సనిద । సనినీ పా ॥
నే . ని । న్నా । ళ్లు ॥ తెలియ నైతి ॥

చ॰ రి మ । పాపా । పా ॥ పని పాసని నీ । పాపమ । పా ॥
, పొ రు । గి రు । గు ॥ న । ఓ . । క్క ॥

. మగ । మగమగ । మగమగ ॥ రి మ । నిమప । మగారి । రీ . ॥
సర । సు । డు ॥ యుం । టే । . ॥

. గ రి । సా । స నిసా ॥ రీ రిరిస । మమగరి । గస రి ॥
. చి రు । త . । ప్రా ॥ యపు । నీ । వు ॥

సామగ । గరిరీ । మా ॥ ప ని పాపస నీ । పాపమ । పా . ॥
. ఊ । ర . । కుం ॥ దు . । వ । టే ॥

మ ప । సనిసని । సా ॥ రీ రిప । మమగరి । గసరీ ॥
. మ రు । లె . । క్కు ॥ వై । వా । డే ॥

. గరి । గమగరి । సా ॥ సాదనిదా । నీ రిస రీ । సా ॥
. . . మమ । త । తో ॥ పి ల । చే । నో , ॥

. మ ప । నిసరిగ । రీ ॥ సా సద । నిదనీ । సా ॥
. ప ర । వ । శ ॥ మై . . । నీ । వే . ॥

ప ద । ప ద నీరిస । నీపా ॥ మనిపమా గా । సరిమా । పా ॥
బ్రతి । మా . . । లి ॥ తి . . । . । వో . ॥
సనిసని
నే . . . విన్నాళ్లు ॥

**అవతారిక**

నాయిక సామాన్య, విరహోత్కంఠిత ఈమెకు మువ్వ గోపాలుని పొందుట యిష్టమే అయినను తనవారు ఒప్పుకొనలేదుట అయినను మోవి అదరుట, ఈవి వదలుట, మొదలగు శుభశకునములు తలచుకొని స్వామివచ్చునని యూహించుకొనుచున్నది

రాగం - కాఫీ - త్రిపుటతాళం

ప అదరీనే మోవి తనకు తానె - వదలీనె కైవి

అ ప మదిలోనవాడేమొ మంత్రించె గాబోలు
సుదతి మువ్వ గోపాలు జూచినది మొదలు ॥ అదరీనె ॥

చ ఇది యేమొ మాయచిలుకవచ్చి - బెదిరించిపోయేనే
నిదుర కంటికిరాక - నిన్నటాలనుండి
చెదరీనె చిత్తము - చెలియ యేమిసేతునే ॥ అదరీనె ॥

2 అప్పుడే కొమ్మా నన్నువా - డడిగించెనమ్మా!
వొప్పక మావార - లూరకుండుటజూచి
యుప్పతించివా - డసురుసురనె నేమో ॥ అదరీనె ॥

3 లీలతో నిందువచ్చి తగి - లించె నేమందు
బాలరో! మువ్వగో - పాలుడు ననుగూడ
నీలాగు నేమేమో - జాలము జేసెను ॥ అదరీనె ॥

ప . సరి । మా । పా . ॥ ప నిస నిపమ । మగరీ । రీ సా ॥
అద । రీ । నే ॥ మో । । వి ॥

సగరీ రిని సని । సా । రీ గ ॥ మా పద । పదనిస । రిగరిస ॥
త న । కు । తా ॥ నే వద । లీ । నే ॥

ని దనిసాని । పమగరి । రీ సా ॥
ఈ . । । వి ॥

అ ప. . ని ద । ని నిపా । నినిమా ॥ పా నిప । మగరీ మా । పా ॥
మది । లో । న ॥ వా . । దే । మో ॥

సా । స సనిద । ని నిమా ॥ ప నిపపసని । సా । సా ॥
మం । త్రిం । చె . ॥ గా . । బో । లు ॥

ప గ రీ । రిమరీ రిమరీ । రిగరిమ గరి ॥ సా . ని నిద । దాసని । సాసా ॥
సు ద । తి । ము ॥ వ్వ గో । పా । లు ॥

సా ని ద । పద నీరిస । సనిపమ ॥ మగరి రి సా । సా సాగరి । సా . ॥ . . .
ని . జూ । చి . । న ॥ ది మొ . । ద . । లు . ॥ . . .

॥ అదరినే ॥

చ. పప । పా । మా ॥ ప ద నిద నిరి । స నిపమ । గారి ॥
అది । యే . । మొ ॥ మా . । య । చి ॥

రీ సా । సగరీ రిని । సా ॥ సా స రి । గరి సరి । మా ॥
లు క , । వ . । చ్చి ॥ బె ద । రిం , । చి ॥

ప దనిదనిస । స నిపమ । పా ॥ ని ద । నినిపా । నినిమా ॥
పో । యే । నే ॥ ని దు । ర । కం ॥

పా నిప । మగరీ మా । పా ॥ పా సా । స నినిద । నినిమా ॥
టి । కి రా । . ॥ క . ని । న్న . । టా ॥

పనిపపసని । సా । సా ॥ సగరీ । రిమరీ రిమరీ । రిగరిమ గరి ॥
ల । నుం । డి ॥ జె ద । రీ । నే ॥

సాదనిదా । దాసని । సాసా ॥ సా ని ద । ప ద నిరిస । స నిపమ ॥
చి । త్త । ము ॥ చె లి । య । యే . ॥

మగరి రి సా । సా సాగరి । సా ॥
మి సే । తు । నే ॥ అదరినే ॥

**అవతారిక** ·

పరకీయ, దివ్యయగు ఈనాయిక మదనశాస్త్రప్రవీణగనుక చెక్కిట గోరులుంచుట, సిగను పూలుచుట్టుట, చెలువుడాయని భక్తిసేయుట మున్నగు నుపచారములు ఎన్నిచేసినను, నాయకుడైన మువ్వగోపాలునకు తనయందు కరుణ కలుగలేదని తన చెలితో చెప్పుకొని వాపోవుచున్నది ఈ పదము అచ్చుపుస్తకములలో హుస్సేని రాగమునందున్నది కాని మా పాఠము కానడలో

కానడ రాగము ప్రాచీనము భాషాంగము 'సనిసా' అనునప్పుడు కాకలి నిషాదమును 'నిసమాగరిస' అనునప్పుడు అంతరగాంధారమును హెచ్చుగా నొక్కిపట్టుట వైణికుల సంప్రదాయము. సరిగామపమదనిసా - సనిపమగామరిస అనునవి ఆరోహణావరోహణములు 'పదనిరిసనిప' - 'రిగ మాపమ గమరి' - 'సనిసధనిధనిరీసా' అనునవి విశేషప్రయోగములు వెంకటమఖి సంప్రదాయమున కానడరాగము వున్నట్లే లేదు బహుశః నాకు లభ్యముగాని గ్రంథములలో ఎచ్చటనైన దీని చర్చ యుండవచ్చునేమో !

రాగం - కానడ - త్రిపుటతాళం

ప ఏమిసేతునే కొమ్మ ! నే నెటుల సైతునే

అ ప. భామరో మువ్వగోపాలుడేలరాడే ? ఓయమ్మా ! ॥ ఏమిసేతు ॥

చ ఒద్దికతోడ చెక్కిటగోరు - లుంచనైతినో
దిద్ది మదనశాస్త్రమెల్ల తెలుపనైతినో
ముద్దుముద్దుగ నతనికేను - మ్రొక్కనైతినో ?
వద్దికిరమ్మని పిలువనంపితే - గద్దరించెనట గదవె ఓయమ్మ ॥ ఏమిసేతు ॥

2 వంచనలేక సిగను పువ్వు - లుంచనైతినో ?
యించుకించుక సేపు కౌగి - లించనైతినో ?
లంచమిచ్చి కెమ్మోవానిలా - లించనైతినో ?
కంచుపదనువంటి మనసు - కనుక వాడిందురాడే ! ఓయమ్మ ॥ ఏమిసేతు ॥

3 చెలువుడా ! యని చాలభక్తి - సేయనైతినో ?
చెలిమితోడ మోము మోము - జేర్చనైతినో ?
కలికి ! మా మువ్వగోపాల రమ్మని - కలయనైతినో ?
యలుకచేసి అల్లదాని - వలనుజిక్కిరాడే ! ఓయమ్మా ॥ ఏమిసేతు ॥

ప నిస । రీపా । మా గ మా గ ॥ మ రిరి గమరి । రి సరీ । సా ॥
ఏ . । మి । సే ॥ తు నే । కొ । మ్మా ॥

సా నిరి । సా . ని సా ని । సా ధ నిధ ॥ ని సా నిరీ । సా । ॥
నే . నెటు । ల । నై . ॥ తు । నే । . ॥

2 నిస । రీ రీ మ । రి సనీ పా ॥ ని సరిమగమ । రి సరీ । సా . . ॥
ఏ । మి । సే ॥ తు నే । కొ । మ్మా ॥

3 నిస । రీ నిద । పమమరి మరి ॥ మరిరి గమరి । రి సరీ । సా ॥
ఏ । మి । సే ॥ తు నే । కొ । మ్మా ॥

4 గమ । ద నిసరి । స నిపా ॥ మ రిరి గమరి । రి సరీ । సా ॥
ఏ । మి । సే ॥ తు నే । కొ । మ్మా ॥

అ ప. మానిప । పమమరి మరి । మ రిమా ॥ ద నిదదసని । సా । సా ॥
భా । మ । రో ॥ మా । ము । వ్వ ॥
ప రి । సా । సా సా రి ॥ ని సనిదనిద । సా ని నిరి । సా ॥
గో । పా । । లు ॥ డే ల । రా । డే . ॥

1. సా సని । ని పమప । దనిసమ ॥ గ మరిస
ఓ . । య । . ॥ మ్మా భామరో

2 నిస రి మ । రిసనీ పా । మగగమ ॥ రీ సా
ఓ . । య । ॥ మ్మా భామరో

3 నిసరిమగమ । రి సని ప । మగగమ ॥ రీ సా
ఓ । య । ॥ మ్మా భామరో

4 ప నిసరి మగామ రిసనిప । మా ద దనిసని । పమగమ రి ॥ సా
ఓ . . । య . । ॥ మ్మా . ఏమిసేతు ॥

చ .. నిస । రీ । రీ ॥ రీ సా । మగమా । రీ సా ॥
. ఓ । ద్ది । క ॥ తో . । డ । చె ॥

ని దప మగమ । రీ । సా . ॥
క్కొ ట । గో . . । రు ॥

ని రి । సా । సాసని ॥ ధనిధధసని । సనిరీ । సా ॥ పా । పపమగ । మాదా ని ॥
లుం । చ । నై ॥ తి । । నో ॥ ది । ద్ది । మ ద ॥

పదనిసా । సాసని నీ । పా . ॥ మప । పా స సనినీ । పా ॥ మరిరిగమరి । రిసరీ । సా. ॥
న . । శా । న్త్ర ॥ మె । ల్ల । తె ॥ లు ప । నై । తి ॥

సా పా । పపమగ । మా ॥ దా దా । సదసని । సా ॥ సా ప రి । సా । సా సరి ॥
నో ము । ద్దు । ము ॥ ద్దు గ । న త । ని ॥ కే । ను । మొ ॥

ని సనిదనిద । సనిరీ । సా ॥ సా నిస । రీ । రీ ॥ మగగమరీ । రీ । సా ॥
క్కొ నై । తి । నో ॥ వ । ద్ది । కి ॥ రం । మ్మ । ని ॥

సా నిరి । సా ని సా ని । దనీద ॥ దసనినిరీ । సా । ॥ నిస । రీరిప । మగగిమ॥
పిలు । వ . । నం ॥ పి । తే । ॥ గ । ద్ద । రిం ॥

గమరిరీ । సా । సాసని ॥ దనిదనిరీ । సా । ॥ సా సని । ని పమప । దనిపమ ॥
చె । న । ట ॥ గ ద । వే । ॥ ఓ । య । ॥

గ మరిస
మ్మా ఏమి సేతునే ॥

---

—అనుపల్లవిలో ఉన్న 'ఓయమ్మ' సంగతులన్నియు చరణము చివరకూడా పాడుకొనవలెను

**అవతారిక :**

స్వీయ, మధ్య, కలహాంతరితయగు ఈ నాయిక తనకు నాయకునియందు ఎటువంటి యాసగలదో, అటువంటి యాస అతనికిని వుండవలదా ? తమకువలెనే యితరులనుకూడా చూచుకొనుట న్యాయముకాదా ? ఆశతో తాను ఆతనిదరికి చేరినప్పుడు కసరి విదలించుకొనుట న్యాయమా ? 'చానరో మువ్వగోపాలుడుకానా చదివిన సరజ్ఞుడుకాడా ?' అని చెలికత్తెతో చెప్పుకొనుచున్నది

రాగం - కానడ - త్రిపుటతాళం

ప తనయాసవలెనుండ - దా నాయాస

అ. ప : తనకేమి తెలివిలేదా ? చానరో మువ్వగోపాలుడు
కానాచదివిన సరసజ్ఞుడే ॥ తన ॥

చ : ఇంటికివచ్చి శయ్యపైన - నన్నంటక దయజూడకయుండ
పంటకొద్ది మోవి గంటి జేసితినని
కంటగించి చూచి కనులెర్రజేసెనే ! ॥ తన ॥

2 ముద్దు బెట్టక యుండగా వానిపై - మోహామగ్గలమై నేను
వద్ద కూర్చుండి తిలకము దిద్దితేను
గద్దించినాడు గదవే ఓ యమ్మ ॥ ॥ తన ॥

3 మనసు నిలుపలేక వానిపై - కొని రతి కూడువేళ
తనువు మరచి నేను తాళు తాళు మనిన
విని మోడిగా జూచెనే ! ఓ చెలియరో ! ॥ తన ॥

ప . సరి । సా । సా ని ॥ ధనిధనిసా । సనిసా । రీ సా ॥
తన । యా । సా ॥ వ లె । నే . । యుం ॥
మగాగమా । రి సరీ । సా ॥ సా
డ ద . । నా. । యా ॥ స . . తనయాస ॥

అ ప . గమ । దా । నీ ॥ నిరి స నిసని । దనీద । సనిసని ॥
. తన । కే . । మి . ॥ తె లి । వి । లే . ॥
సా . ప రి । సా । సా • రి ॥ స నిని రిసని । నీ పా । పా ॥
దా చా । న • । రో ॥ ము వ్వ . । గో . . । . . . ॥
మదనిసారి । స నిసని । ని నిపా ॥ పమపామద । ద నిసరి మగామ । రీ సా ॥
పా • । లు • । డు ॥ శా । నా । చ ది ॥
సనిస నిపని । పమపా । మగమా ॥ రిసరీ । సా । సా ॥
వి . న • । స । ర ॥ స । జ్ఞ . । డే . . ॥ తనయాస ॥

చ  రి ప । పా । పా ॥ మామానిద । పమ గ మ । రి రి ॥
. ఇం । టి । కి ॥ వ చ్చి । శ య్యా । పై ॥

సా ని స । రి రి మ । రిసనిప పా ॥ సనిసా । రి పమగ । గమరీ ॥
న న్నం । ట । క ॥ ద య । చూ । డ ॥

రీసా । సా । సా ॥ మ ద । ద సనీ । సా ॥
క । యుం । డ ॥ పం । టి । కో ॥

సరిసనిసని । ద నీద । సనిరీ ॥ సా ప రి । సా . । సా రి ॥
ద్ది । మో । ॥ వి గ ం । టి । జే ॥

సనినిరిసని । నీపా । పా ॥ మ దనిసారి । స నినిస । నీ పా ॥
సి తి । న । మ్మా ॥ కం ట । గిం । చి ॥

మ గ మాదా । దనిసరి మగామ । రీసా ॥ సనిస నిసని । పమపా । మగమా ॥
చూ చి । క ను ల । ౹ర ॥ జే . । సే । నే ॥
రీసా

తనయాన ॥

**అవతారిక :**

నాయిక స్వీయ, మధ్య అతృప్త ఈమెకు సదా నాయకుడు తనవద్దనే యుండవలె నని ఆస అతడు రాక ఒక పత్రమా యెనట 'నన్ను నీవు తలచేది న్యాయముగాదు నిన్ను నేను వలచేది నీతిగాదు ఈ ప్రొద్దు చాలించుకొంటే, ఇంతకన్న సుఖములేదు దేవుని మనసున మ్రొక్కితే కనుల దీవించినట్లున్నదట నీ నా మనసు నొచ్చితే నెనరులేదు వూని చెలులందరు గుంపులుగూడి నవ్వేరు ' అతని మొగమెదుటనే తనకోపమును వ్యక్తీకరించుచున్నది మధ్యమావతి రాగము అతి ప్రాచీనము దీనిని 'మధ్యమాది' అనికూడా కొందరు గ్రంథకర్తలు చెప్పి న్నారు ఎల్లవేళలయందును పాడుకొనదగిన రాగమైనను మంగళప్రదమగు ఈ రాగమును కొనకు పాడి ముగించిన సకల శుభములను కలుగునని పెద్దలు చెప్పియున్నారు బహుశః దీనికి కారణము 'స మ - రి ప - మ ని - ప స' అను స్వరముల మధ్యగల అంతరము షడ్జ మధ్యమ భావములో నుండుటచే కర్ణరసాయనముగా నుండు ఈ రాగము మనస్సునకు ఒకవిధమైన పారవశ్యతను, ఆనందమును కలిగించుటయే కారణముకావచ్చు వెంకటమఖి సంప్రదాయమున ఈ రాగమును భాషాంగమని చెప్పియున్నారు కాని భాషాంగ స్వరూపమును వివరింపలేదు. క్షేత్రజ్ఞుని పదములలోగల మధ్యమావతి ఇప్పటి వాడుకప్రకారము 22 వ మేళమగు ఖరహరప్రియ జన్యము ఔఢవ ఔఢవము

ఆరోహణ స రి మ ప ని స - అవరోహణ స ని ప మ రి స

రాగం - మధ్యమావతి - త్రిపుటతాళం

ప నన్ను నీవు తలచేది - న్యాయముగాదు

అ. ప నిన్ను నేను వలచేది - నీతిగాదు మువ్వగోపాల ॥ నన్ను నీవు ॥

చ ఏ ప్రొద్దు నా కౌగిలిలో - నెనయుచున్న వాడవు
రావు జేసి, ఏలాగైన రాక పక్షమాయె
కోపమైతే ఘనమాయె - గుణమెంతో చక్కనాయె
ఈప్రొద్దు చాలించుకొంటే - ఇంతకన్న సుఖములేదు ॥ నన్ను నీవు ॥

2 నే విన్నవించిన మాట - నీకు సమ్మతిగాదు
నీవెంత బాసచేసిన - నే నమ్మజాల
యీ వగలిట్లుండగ - నింపుసొంపులు బుట్టునా
దేవుని మనసున మ్రొక్కితే కనులదీవించునట్టు ॥ నన్ను నీవు ॥

3 నేను నీవు మువ్వగోపాల! - నేడు గూడియుంటిమి
యీనాటివలె నేమైన - నందమయ్యీనా?
నీ నామనసు నొచ్చితె - నెనరు లేదు చాలించు
పూని చెలులందరు గుం - పులుగూడి నవ్వేరు ॥ నన్ను నీవు ॥

ప. । సారి । సా ॥ రీ । మా శీ । రీ సా ॥
। న । న్ను ॥ నీ । వు । త ॥

సారిసా । రిమపమ । రీ ॥ సా ని స । రీ సా । ప మరీ రిమరీ ॥
ల . । చే । ॥ ది న్యా । య । ము ॥

మా మనిపమ రీ । సా । ॥
గా । దు । . ॥

2. రిసనిపనీ । సారి । సా ॥ రీ మామరి । గా । పా ॥
। న . । న్ను ॥ నీ । వు । త ॥

సనిసనిసని । సరిసనిస । నీపా ॥ పపమరి రి మ । పా । నీ ॥
ల . । చే । ॥ ది న్యా । య । ము ॥

రి స నిప పమ రీ । సా । ॥ ।
గా । దు । ॥ । నన్ను నీవు ॥

అ ప । సారీ । రి రిసని ॥ పానీనిప । పాపమ । పా ॥
। ని । న్ను . ॥ నే . । ను . । వ ॥

పనిపామా । మరిమా । పా ॥ సనిసనిసరి । సగాసా । రీసా ॥
ల । చే । ది ॥ । నీ । తి ॥

సా సమరీ రిమరీ । రీపమ రీ । సానీ ॥ పా పని । సానిరి । సనిపా ॥
గా । దు । ము ॥ వ్వ । గో । పా . ॥

పమరీసా । సారీ । సా ॥
ల । న । న్ను . ॥

చ . రిమ । పా । పా . ॥ పా । పానిని । నీమా ॥
ఏ । ప్రొ । ద్దు ॥ నా । కా । గి ॥

పా । ప మరిమ । పా ॥ పా నిస । నీ । పా ॥
లి । లో . । ను ॥ ఎ । న . । యు ॥

పా మా । పా రీ । మా ॥ మా మనిపమ రీ । రీ । సా ॥
చు । న్న । వా ॥ . । డ । వు ॥

సా నిస । నీ పా । నీ ॥ సా నిస । రీ సా । రి మరిమ ॥
రా । పు । జే ॥ సి ఏ । లా । గై ॥

సరిస నిస । రీ । రీ మా ॥ పా । మా నిపమరీ । రీ సా ॥
న రా । ని । ప ॥ ఈ . । మా . . . । యె ॥

సా నిస । నీపా । నీ సా ॥ సా నిస । రీపమ । రీ ॥
కో । ప । మై ॥ తే ఘ । న । మా . ॥

సా రిమ । పా । నీ ॥ నిమపా । నీ । సా . ॥
యె గుణ । మెం । తో ॥ చక్క । నా । యే ॥

. నిస । రీ . । సా ॥ స నిరిసనీ । నీ పా । నీ ॥
ఈ । ప్రొ । ద్దు ॥ చా లిం । చు । కొం ॥

సా నిస । సమరీ రిమరీ । రిపమా రీ ॥ సా । స నిపా । నీ ॥
చే . యిం । త । క ॥ న్న । సు ఖ । ము ॥

సా . సరి । నిసనీ । పామా ॥ రీ సా । సారీ । సా ॥
తే । । ॥ దు . । న । న్ను ॥

**అవతారిక** ·

స్వీయ ప్రౌఢయగు ఈమె స్వాధీన పతిక తనకు తన స్వామికిగల అన్యోన్యతను చూచి ఓర్వలేని చెలులు చెప్పెడి మాటలకు లోలోపలనే బాధపడుచున్నది చెలువుని ముద్దు మాటలు తన చెవుల నిండియున్నవట చెలుల మాటలకు తావేది ? ఘనమైన సామి రూపు ఆమె కనుల నిండినదట కొనగొనలనైన నితరులు గానవత్తురా ? తన ఎదనిండియున్న గోపాలరాయనిపై కోపము రమ్మన్న వచ్చునా ? 'తెలిసి తెలియలేక చెలులు పలికేరు' అను కొనుచున్నది

రాగం - మధ్యమావతి - ఆదితాళం

ప : తెలిసీ తెలియలేక - పలికేరు చెలులు

అ ప కలిసియున్న నాసామిపై - కాకసేయ వశమా ? ॥ తెలిసి ॥

చ : చలపట్టి తమ బు - ద్ధులు వినలేదని
అలిగి రేమిసేతు - అతివలెల్ల
చెలువుని ముద్దు మా - టలు నావీనులునిండి
తొలుకుచున్నది తమ మా - టలకు చోటున్నాదా ॥ తెలిసి ॥

2. కొనగంటదముగను - గొనదింత్రై నాగాని
నెనరు లేని దాయనంచు - నిందించేరు
ఘనమైన సామి రూపు - కనుల నిండియుండగ
కనకాంగి ! యితరులు - గానవత్తురటవే ॥ తెలిసి ॥

3 నాపాలగల మువ్వ - గోపాల సామితో
కోపించుకొమ్మని - కొమ్మలనేరు
ఎప్రొద్దు నాసామి - యెద నిండియుండగ
తాప మింతేగాని - కోపము న కిమ్మున్నదో ॥ తెలిసి ॥

ప: సాసని నిప పనిసా । రీ సా స ని । పనిసా ॥
.. తెలి సి తె । లి య । లే క ॥
సా సనిసా రీ సరిపమ । రిరిసా । రిమపస నీ ॥
. ప లి కే । . రు । చె లు ॥

2. ప మరిస సాసని నిప పనిసా । రీసరి మారిమ । పామప నీపని ॥
లు . తెలి సి తె । లి య । లే . క ॥
సా సరినిస పనిమప మా । రిమ పా మప । నీ సనిపమ ॥
. . ప . . లి . కే । రు చె । లు ॥

అ ప రి స సాసని నిప ని నిమా । ప మరీ మా । మరిమా పాపని ॥
లు క లి సి యు । న్న . నా । సా మి ॥
సా సమరీ రిమరీ సా । సా ని పా । రిమపా నీపమ ॥
పై కా క సే । య . । వ . శ ॥

2 రి సరిమ పనిసని పా ని ని మా । ప మరీ మా । మరిమప పమపని ॥
మా క లి సి యు । న్న నా । సా మి . ॥
సా స నిసరీ సరి పమరిస । సరినీ నిసపా । పనిమా మపరీ ॥
పై కా క సే । య । వ శ ॥
ప మరిస
మా తెలిసి ॥

చ మరిమా పాపా । నినిపమ రి రిసా । స నిపా పనిసా ॥
చ ల ప ట్టి । త మ । బు ॥
స నిసా రి సా సనిసా । రీ మా । పా నినిపమ ॥
ద్ధు లు వి । న లే । ద ॥
పా మరిమా పా పమపా । నీ నిప । సనిపా నీ ॥ సా సాసని నిపపమ । ప నిపమ రీ । సా .. ॥
ని అ లి గే రే. । . మి । సే ॥ తు అ తి వ । లె । ల్ల .. ॥

స నిసా రీ రి స । మరిమని పమరీ । రీసా ॥ రిమప ని నిపనీ సా రీమరిస । రిసనీ నిప ।
. చె లు వు ని । ము । ద్దు ॥ మా . ట లు నా । వీ ను . ।

నీ సా ॥ సా స నిసా రీ రిమరీ । రి స సనిపా । నీ సా ॥
లు నిం ॥ డి తొ లు కు చు । న్న ది । త మ ॥

సా సరినీ స ప నిమా ప । సరినీ ని సపా । ప నిమా మ పరీ ॥
మా ట ల కు । చో టు । న్నా ॥

ప మరిస
దా . తెలిసి ॥

**అవతారిక**

నాయిక స్వీయ, ప్రౌఢ, ఖండిత. నాయకుడు సవతియింటినుండి వచ్చినట్లు ఆతని చిన్నెలను జూచి గుర్తించిన ఈమె కోపగించుకొని 'దొంతర విడెముతో నాచెంతకు రాకురా'! అని మందలించుచున్నది ఈపదము విజయరాఘవ ముద్రాంకితము దీనిని అచ్చుపుస్తకము లలో ముఖారి రాగమని వేసియున్నారు కాని ప్రచలితమైన పాఠము సైంధవి రాగమునందే యున్నది సుబ్బరామ దీక్షితులవారి 'సంగీత సంప్రదాయప్రదర్శిని' యందు యిదే రాగమని వ్రాసియున్నారు

సైంధవి ప్రాచీనరాగము భాషాంగము నిసరిగ మపదని - నిదపమ గరిసనిధ - అనునవి ఆరోహణావరోహణములు ఇది ఇప్పటి 22వ మేళమగు ఖరహర ప్రియ జన్యము 'పా దప మా' - 'పా ద మా' అనునప్పుడు శుద్ధ ధైవతమును 'పా మా' అనునప్పుడు అంతరగాంధారచ్ఛాయగల శుద్ధ మధ్యమమును పలికించుట సంప్రదాయము 'రి ని సా రి గ మా' - 'రీ గ మ రి గ సా' అనునవి తరుచుగావచ్చు ప్రయోగములు వెంకటమఖి సంప్రదాయమున సంపూర్ణ సంపూర్ణముగా ఈ రాగమును చెప్పినప్పటికిని, క్షేత్రజ్ఞుల పదములయందు మాత్రము మధ్యస్థాయి నిషాదమువరకు, మంద్రస్థాయి ధైవతమువరకు మాత్రమే సంచారములు కనబడుచున్నవి ఇది రక్తి రాగము

### రాగం - సైంధవి - త్రిపుటతాళం

ప : దొంతర విడెముతో - నా చెంత రాకురా నీకు నాయాన

అ. ప : యింతకు నే తాళగలనా - యేర! విజయరాఘవ జాణ ॥ దొంతర ॥

చ. జగ్గు గుల్కు మై బుక్కాతావి - చప్పరించిన నీదు కెమ్మోవి
నిగ్గు నొసలి లత్తుక రీవి - నీటుతోడనూ
దగ్గర నిలువకు పదరా - దానికేను తాళగదరా!
యెగ్గుచేసి నాయెదుర - యీలాగు బొంకుదురా! ॥ దొంతర ॥

2 సిబ్బెంపు గబ్బి గుబ్బులపోటు - చిమ్మరేగిన కీల్జడవేటు
మబ్బుమీరిన నిద్దురపాటు - మరపుతోడను
దబ్బరలాడేవు చాల దానిదేగదర యీశాల
గబ్బితనము నీకేల - కలికితో మాటాడు మీవేళ ॥ దొంతర ॥

3. చక్కని విజయరాఘవధరా - సామిగా నన్నేలితి వౌరా ?
తక్కులాడి యింటికి పోరా - మక్కువతోడను
యెక్కడిదీ వాడిన విరులు - చిక్కుపడ్డవి నీ కంఠసరులు
నిక్కము దానిపై మరులు - నీవు దానింటికే తరలు ॥ దొంతర ॥

ప: । సా సని । సా ॥ రీ . । గా రీ । సా . ॥
। దొం . । త ॥ ర । వి । . ॥
రీ రిగమా । రి మా । రీ ॥ సా . । రీ గమ । రిగసా ॥
డె । ము . । ॥ తో । నా . । ॥
రీ . . । రి గమా । పాదప ॥ ప మగా । గ రిరీ । సా . ॥
, । చెం । త , ॥ రా . । కు , . । రా ॥

రిగమా । ప దనిద । నీ ॥ ని దదపమా । మ గపమ । మగరి ॥
నీ । కు । ॥ నా . । యా । ॥
రీ సా ।
న । దొంతర ॥

అ ప . । సా సని । సా ॥ రీ । గా రీ । సా ॥ సా
। ఇం । త . ॥ కు । నే । ॥ దొంతర ॥
రీ రిగమా । రిమగా । రీ ॥ సా । రీ గమ । రి గసా ॥
తా । । ళ ॥ గ । ల । నా ॥

చ . । సాసని । సా ॥ రీ । గా రీ । సా ॥
. । చ । క్క ॥ ని । వి । ॥
రీ రిగమా । రి మగా । రీ ॥ సా । రీ గమ । రిగసా ॥
జ । య । ॥ రా । ఘు । ॥
రీ । రి గమా । పాదప ॥ ప మగా । గ రిరీ । సా ॥
వ । సా । ॥ మి । గా । ॥
రిగమా । ప దనిద । నీ ॥ నిదదపమా । మగపమ । మగరి ॥
న । న్నే । ॥ లి । తి । వా ॥
రీ సా । సాసని । సా ॥ రీ । గా రీ । సా ॥
రా । త । క్కు ॥ లా . । డి । - ॥
రీ రిగమా । రిమగా । రీ ॥ సా . . । రీగమ । రిగసా ॥
యిం . । . । ॥ టి . । కి । ॥

రీ . . . । రి గమా । పాదప ॥ పమగా . । గ రిరీ । సా ॥
. । పో । . ॥ . । రా । . ॥
రి గమా । పదనిద । నీ . ॥ ని దదపమా । మగపమ । మగరీ ॥
మ కు్క । వ . । ॥ తో . । డ । ॥
రీ సా । సా సని । సా ॥ రీ । గా రీ । సా ॥
ను । యె । క్క ॥ డి । వీ । ॥
రీ రిగమా । రి మగా । రీ ॥ సా । రీ గమ । రి గసా ॥
వా . . । డి . । ॥ న . । వి । రు . ॥
రీ । రి గమా । పా దప ॥ పమగా । గరిరీ । సా ॥
లు . . । చి । కు్క ॥ ప . । డ్డ । . ॥
రిగమా । ప దనిద । నీ ॥ నిదదపమా । మగపమ । మగరీ ॥
వి । కం । ॥ ర . । స । రు ॥
రీ సా । సాసని । సా ॥ రీ । గా రీ । సా ॥
లు । ని । క్క ॥ ము । దా । ॥
రీరిగమా । రి మగా । రీ ॥ సా । రీ గమ । రిగసా ॥
ని । పై । ॥ మ । రు । ॥
రీ । రిగమా । పాదప ॥ ప మగా । గ రిరీ । సా ॥
లు । నీ । ॥ వు । దా . । ॥
రి గమా । ప దనిద । నీ ॥ నిదదపమా । మగపమ । మగరీ ॥ రీ సా . ।
నిం . । టి । కే . ॥ త । ర . । . . ॥ లు ।

॥ దొంతర ॥

**అవతారిక**

ఈమె ధీరాధీరయగు ప్రౌఢ, స్వీయ నాయకుడు తన సవతులకు యిచ్చిన ఆభరణములు, కానుకలు తెలుసుకొన్నదై, ఆతనిని దండించి అట్లు తనకేల యివ్వలేదని అడుగుచున్నది. ఇందు క్షేత్రజ్ఞులు ఉదహరించిన ఆభరణములపేర్లు కొంచెము వింతగా తోచిననూ యిప్పటికినీ కొన్ని ప్రాంతములలో ఈ పేరులుగల ఆభరణములు వాడుకలోనున్నవి ముత్యాలసరములు, జీనాసరిపెనలు, పారిజాతపునసలు, నాగసరాలు, అనునవి యిందు పేర్కొన్న ఆభరణములపేర్లు

రాగం సైంధవి - త్రిపుటతాళం

ప మేలు మేలురా నిన్ను - మెచ్చవచ్చునేరా!

అ ప: చాలుచాలుర మువ్వ గోపాల నాసామి ॥ మేలు ॥

చ. ముదితకైతే ముత్యాలసరమా! యల
ముదిత నాకన్న మీ సరమా ? నీవు
పదరి దానికియ్యతరమా - భళిభళిర మేలు కామితరమా ॥ మేలు ॥

2 అలదానికి జీనాసరిపెనలా - ఔరాపొలతితోనే సరిపసులా! యా
వెలదికి పారిజాతమునసలా వేమారెవ్వరికి లేనిమన్ననలా ? ॥ మేలు ॥

3. అతివకు వేయివరాలా అల్లదియే మోహపు జవరాలా! దాని
రతులచే రమియించ చెయిసరాలా
రమణికి బిరుదు నాగసరాలా ? ॥ మేలు ॥

ప: . రి ని । సా . । రీ ॥ గా రి । గరిరిస । రీ ॥
. మే । లు । మే ॥ లు రా . . । ని . . । న్న . ॥
సా రి గ । మా । మా మ ॥ ప దనిదనీ । ని దదప । మా గ ॥
. మె । చ్చ । వ ॥ మ్చ । ను । . ॥
రి గమపామ । మగరీ । రీ సా ॥
లే । । రా ॥

2. సా . రి ని । సా । రీ ॥ గా రీ . । రిగమప । మ గరీ ॥
. మే । లు . । మే . ॥ లు రా । ని । న్న ॥
రీసా రిగ । మా । మ ॥ ప ద పదనిద నీ । ని దదప । మా గ ॥
మె . । చ్చ । వ ॥ చ్చ । ను । ॥
రి గమపామ । మగరీ । రీ సా ॥
లే . . । । రా ॥

అ. ప: . . . । పా । ప మపమ ॥ ప ద పదనిద నీ । నిదదప । మా ॥
. । చా . । లు ॥ చా . । లు । రా ॥
మా రి గ । మా పా । ప పమగ ॥ రీ గమాగ । రీ గమ । రి గసా ॥
. . ము । వ్వ । గో ॥ పా । ల । నా . ॥
స గరీ ని । సా . । ॥
సా । మి । ॥ ॥ మేలు ॥

చ· . రి ని । సా . । రి ॥ రి . । రి గా । గ రిరిస ॥
. ·ముది । త । కై . . ॥ తే । ము । త్యా . ॥
రి . . । రి గమ । గ రి ॥ గమరిగసా । స గరిని । సా ॥
ల । స ర । మా ॥ । య . . । ల . ॥
సా రి గ । మా । పా ॥ పద పదనిద నీ । ని దదప । మా గ ॥
ము ది । త . । నా ॥ క । న్న . । మీ ॥
రిగమపామ । గ రిరి । రి ॥ సా పా । ప మపమ । పాదా ॥
స . ర । మా . । ॥ నీ । వు । ప ద ॥
పదనిదనీ । ని దదప । మా గ ॥ రిగమాపా । పపమగ । రిగమ ॥
రి । దా । ని ॥ కి య్య . । త । ర . ॥
రి గసారి గ । మా । పా ॥ ప ద ని దనీ । ని దదప । మా గ ॥
మా . భ శి । భ । శి ॥ మే లు । గా । మి . ॥
రి గమాపా । మాగా । రి ॥ సా
త ర . . । మ . । . ॥ ॥ మేలు ॥

**అవతారిక**

నాయిక సామాన్య, తృప్త. మువ్వగోపాలదేవుడు తన్ను లాలించి పలుకొన్న విధములను తలచుకొని తలచుకొని ఆనందించుచు 'ఇటువంటి ప్రేమగల ఓ సామి! మనసు నిన్నెడబాయదు' అని ఆతనితో విన్నవించుకొనుచున్నది

శ్రీరాగము పూర్వ ప్రసిద్ధములయిన ఘనరాగములలో నొకటి దీనిని వెంకటముఖి సంప్రదాయమున 22 వ మేళముగా చెప్పుకొన్నారు ఇప్పటి 22 వ మేళమగు ఖరహరప్రియ జన్యముగా దీనిని చెప్పుకొనవలసియున్నది 'పదనీ' అను ప్రయోగము అక్కడక్కడ వచ్చునని పూర్వాచార్యుల మతము కాని క్షేత్రజ్ఞుల పదమునందు 'పదనీ' అను ప్రయోగము కానరాదు లలితములైన స్వరసందర్భములతో, ఈ పదమునందలి సాహిత్యభావములు పొదగబడి యున్నవి

శ్రీరాగం - త్రిపుటతాళం

ప: మనసు నిన్నెడబాయదు ప్రాణేశ! నా

అ. ప: మనసు నిన్నెడబాసి ఘణమైన నోర్వదు
మనవాలకించు శ్రీ మువ్వ గోపాల! సామి! ॥ మనసు ॥

చ మేటిపై తాణి కొంగు జారగదీసి
గోట గుబ్బల జెనకి
నీశైన బింబోష్టము పానము చేసిన
నేటి చిన్నెలనే తలచి మెచ్చి ॥ మనసు ॥

2 కస్తూరిమైనలది కడువేడ్కలలరగ
సిస్తుగ వీణమీటి విస్తారముగా రత్న
సరములు నా కొసగి
కుస్తరించిన నాటికొలది తలచిన నా ॥ మనసు ॥

3 కేళికా నిలయమున సొంపుగా రతి
కేళి గూడిన సొగసు
మాలిమితోడను మువ్వగోపాలసామి
ఏలిన నీ వగలు నేలాగు మరతును ? ॥ మనసు ॥

ప గ రి । సా రి । సనిపా ॥ నీ . సా । ప నిసరి । గా రీ ।
మ న । సు । ని ॥ న్నె డ । బా । య ॥
సా . రి మ । పా మ । రీ గా ॥
దు ప్రా । ణే । శ ॥

అ. ప : రీ సా రిమ । పా . । పా ॥ ప నీ నిమా । పా ప మ । పా ॥
నా మ న । సు . । ని ॥ న్నె . డ । బా । సి ॥
ప ని । స రిగా । రీసా ॥ స నిరిసనిప । నీ । సా ॥
ఘ ణ । మై । న ॥ నో . । ర్వ । దు . ॥
. ప ని । స రిగా । రీ సా ॥ స నిరిసనిప । నీ । సా . ॥
. మ న । వా । ల ॥ కిం . . । చు . । శ్రీ ॥
. . ప ని । సా రి । ని సాప ॥ ప నినిపపమ । పా . మ । రీ గా ॥
ము । వ్వ । గో ॥ పా । ల । సా ॥
రీ సా
మి మనసు ॥

చ రిమ । పా । పా ॥ ప మపామా । రీ గా । రీ . . ॥
. . . క । మ్మా । రి ॥ మై । న ల । ది . ॥
రీ . గ రి । సా । సా రి ॥ సానినిపా । నీ । సా ॥
. కడు । వే . । డ్క ॥ ల ల । ర । గ ॥
పని । స రిగా । రీ సా ॥ రిమా రిమా । పా । పా . ॥
. సి . । స్తు । గ ॥ వీ ణ । మీ . । టి ॥
రిమ । పా । పా ॥ ప నీ నిమా । పా మ । పా . ॥
. . వి . । స్తా । ర ॥ ము . గ । ర . . । త్న . . ॥

పని । స రిగా । రీ సా ॥ స నిరిసనిప । నీ నీ । సా . ॥
. సర । ము । లు ॥ నా . । కొ స । గి . ॥

ప ని । స రిగా । రీ సా ॥ స నిరిసనిప । నీ । సా ॥
కు । స్త । రిం ॥ చి న . । నా । టి ॥

ప ని । సా రి । నిసాప ॥ పనినిపపమ । పా మ । రీగా ॥
. కొ ల । ది । త ॥ ల . . । చి । న ॥

రీ సా
నా . మనసు ॥

**అవతారిక.**

విరహోత్కంఠితయగు ఈ స్వీయ నాయిక ప్రౌఢ ఎంతోకాలమునుండి తనవద్దకు రాని నాయకుడు ఇప్పుడు వత్తునని చెలికత్తెకు చెప్పి పంపగా వద్దు రావద్దని అతనిరాకకై ఎదురుచూచుచూ హెచ్చయిన వెన్నెల చిచ్చుల రాత్రులు ఎన్నో గడిపితినని, నెలలెంచి కలకంఠ పికనాదములు మించు మధుమాసములు గడపితినని, శకునములడిగితినని కామించి నాథుల కలయు చెలులచూచి కరగి చింతనొందితినని చెప్పి, 'రామరామ! ఈమేనితో వానిమోము జూడ వలెనా? మొదటి పొందే చాలు వదరకపోవే!' అని మందలించుచున్నది

ఈ పదమునకు ఒక చిన్న ఇతిహాసము కలదు తంజావూరి అన్యత విజయరాఘవ భూపాలుడు క్షేత్రజ్ఞులయందు ప్రీతికలిగి తనతో సమానముగా ఆయనను గౌరవించునట్లేర్పాట్లు చేసినాడట ఇవి గని ఆస్థానమునందలి తక్కిన పండితులందరూ అసూయాదూషితులై ఏరా, పోరా, రారా అను సంబోధనలుగల ఏకవచన ప్రయోగములతో కవిత్వముచెప్పు ఈతనికి విద్వాంసుడైన రాజు ఇంతటి గౌరవమిచ్చుటయా! అని అనుకొనుచుండిరట ఇది తెలిసి ఒకనాటి సభలో ఈ కాంభోజిపదమును 3 వ చరణపుటర్ధభాగమువరకు పాడి 'తక్కిన భాగమును మీ విద్వాంసులచేత పూర్తిచేయించుకొనుడు నేను తీర్థయాత్రలకుపోయి మూడు నెలల తరువాత వచ్చెదను' అని రాజువద్ద అనుజ్ఞ గైకొని క్షేత్రజ్ఞులు వెడలిపోయినారట తంజావూరి ఆస్థానమునగల విద్వాంసులెవరికిని పదమునందుగల భావమునకు సరిపోవు సందర్భము మూడు నెలలయినను స్ఫురింపలేదట క్షేత్రజ్ఞులు గడువు ముగియుచాటికి తిరిగి వచ్చుచుండగా నగరమునకు వెలుపల వారిని సంధించి పాదాభివందనములు చేసుకొని 'అయ్యా తెలివితక్కువ మాటలు ఆడుటకు మాకు బుద్ధియున్నదే కాని, ఇటువంటి రసవంతములయిన సందర్భములు పూరించుటకు లేదుసుమండీ' అని వినయపూర్వకముగా పండితులు చెప్పుకొనగా, క్షేత్రజ్ఞులు చిరునవ్వుతో 'రామరామ ఈ మేనితో ఇంక వాని మోము జూడవలెనా! మొదటి పొందే చాలు!' అని పూరించినారట విజయరాఘవప్రభువుకూడా ఎంతో సంతోషించి వారికి బహుమానములిచ్చిరట కనుకనే ఈపదమును సమస్యాపదమని అందురు

కాంభోజిరాగము అతిప్రాచీనమయిన రక్తిరాగములలో ఒకటి ఇది భాషాంగము. 'స ని ప దా స' అను సందర్భమున పలుకు కాకలి నిషాదస్వరమే ఇందలి భాషాంగ స్వరము ఈ రాగము ఇప్పటి 28 వ మేళమగు హరికాంభోజి జన్యము నిజమునకు హరికాంభోజికన్న ఎంతో ప్రాచీనమయినది కాంభోజి వెంకటమఖి సంప్రదాయమున చెప్పిన కాంభోజియు క్షేత్రజ్ఞుని పదములయందలి కాంభోజియు ఒకేవిధముగానున్నది క్షేత్రజ్ఞుని పదములు ఇప్పుడు లభ్యమయినవాటిలో సుమారు ముప్పదిపదములకు పైగా కాంభోజిరాగమున కలవు. మాకు పాతమున్న 9 పదములలోను ఏ ఒక్కటీ రెండవదానిని పోలిలేక స్వతంత్రమైన స్వరసందర్భములు కలిగి యున్నవి. తెనుగునగల కొన్ని కావ్యములలో ఈ రాగప్రసక్తి గలదు

16 వ శతాబ్దపువాడును, సంగీత సాహిత్య భరతశాస్త్ర కోవిదుడును, మహాకవియును, శ్రీకృష్ణదేవరాయలవారి అష్టదిగ్గజములలో నొకడున్ను నగు రామరాజభూషణుడు తన వసుచరిత్రయను మహాప్రబంధమునందలి నొక పద్యమున

"ఆ జాబిల్లి వెలుంగు వెల్లికలడాయనే లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమున పటాగ్రంబెత్తి, యెగ్గెత్తి యా
రాజీవానన యేడ్చె, కిన్నరవధూరాజత్ కరాంభోజ కాం
భోజీమేళ విపంచికారవ సుధాపూరంబు తోరంబుగన్."

కాంభోజిరాగమును కరుణ, విరహములను, భావములు వ్యక్తముచేయుటకు చక్కగా ఉపయోగించి యున్నారు

రాగం - కాంభోజి - త్రిపుటతాళం

ప వదరకపోవే వాడు పలవచ్చీని - వద్దు రావద్దనవే కూడియున్నఁచాలునే!

అ.ప. అది ఒక్కయుగము వేరే జన్మము - యిపుడు
అతడెవ్వరో నే నెవరో ఓ చెలియ! ॥ వదరక ॥

చ: నిచ్చనిచ్చలు నేడే వచ్చీని రేపైన - వచ్చీననుచు మదిలో
నిచ్చగాపలువేడి నిట్టూర్పులచేత - నింతిరో పెదవు లెండి
పొచ్చుగున వెన్నెలచిచ్చు రాత్రులు
యెన్నెన్నో గడిపితి నిక నేటిమాటలే! ॥ వదరక ॥

2 వలపుకాడిదేకదా వచ్చుననుచు దెరు - వులు జూచి వేసారితి
నెలలెంచి యలసితి నిలువరాని ప్రేమ - నెమ్మది నడచుకొంటి
కలకంఠ శుకనాదములు వించు మధుమాస
ములు గడిపితి వట్టి ముచ్చటలిక నేలే! ॥ వదరక ॥

3. శామరో శకునము లడిగితి మువ్వ గో - పాలుడు వచ్చుననుచు
కామించి నాథుల గలయు చెలుల జూచి - కరగి చింతనొందితి
రామ! రామ! యీ! మేనితో ఇంక వాని
మోము చూడవలెనా - మొదటిపొందే చాలునే ॥ వదరక ॥

ప. దస । సా దనీ । దాపా ॥ పా పా దనిదా । మా పదపా । పా గమగ ॥
. . వద । ర . । క ॥ పో । . . । వే . . ॥

మా । మాదప మగ । పా మపా మ ॥ పా . పమ । పా । దా . ని దా . ని ॥
. . . . . । వా . । . . . ॥ డు ఏ । ల । వ . . . ॥

ప దా । నిదదప । దా ని దా . ని ॥ పదాపసా । పా . మ పా ద । పా ద సా ॥
చ్చి । ని । . ॥ . . వ । ద్దు । . . . . . ॥

ససనిదా నిదపా । పా గ మగ । మగగరి ॥ సా । సా గరి । గీ సా ॥
రా . . . వ . । ద్ద . . । న ॥ వే . । కూ । డి ॥

స ధసాపా । ధా । సా ॥ సా సా రి గమ । దపమగ । పా మ పా మ ॥
యు . . . । న్న । ది . ॥ చా . । . । లు . . ॥
పా
నే . . వదరక ॥

అ ప పపమగ । పా । దా ॥ సా సా । సా । సా సగరీ ॥
అ ది । ఒ । క్క ॥ యు గ । ము । వే ॥

రీసాసా । సా రి గమ । రిగ సా ॥ ద సద రిస నిద । నిదనిప । పమపమ ॥
రే జ । న్మ . । . ము ॥ యి పు । డు । . ॥

పా పద । గమగా రిగరీ । సా . ॥ ద సద రిస నిద । ని దనిప । పమపమ ॥
. . . . అత । డె . । వ . ॥ రో . . । నే । . . . ॥

పా గమ । పా దని దా । మా పద పా ॥ పా పద సా । సా ద నిద । నిదపా ॥
నెవ । రో । . . ॥ ఓ । చె . . . । లి . ॥

ప పమగా మగ రిస । సా రి గమ । దపమగ ॥
య . . । . . । . . ॥

పా . మ పా
. . వదరక ॥

చ : . . ద స । స నీద దా । దా ॥ నీ దా । నిదదప । దా ని దా . ని ॥
భా . । మ . . । రో ॥ శ కు . । న . . । ము . . . . . ॥

ప దాప మప । దారిస సనీద । దాపా ॥ ప మ మద ప మ గా । గమగా గరి । సా ॥
లు . అ డి । గి । తి . . ॥ ము . వ్వ । గో . . . . । . . ॥

సా . స ప । పా గ మగ । మా ॥ మా మదపమ గా । మా . । మాదప మా ॥
. . . పా । లు । డు . ॥ వ చ్చు . । న . . । ను . . . . ॥

పా . ద స । సనీద దా । దా . ॥ నీ దా । ని దదప । దా . ని దా . ని ॥
చు . కా । మిం । చి ॥ నా । ధు । ల . . . ॥

పదాప మప । దా రిస సనీద । దాపా ॥ ప మ మదపమ గా । గమగా గరి । సా ॥
. . క ల । యు । చె ॥ లు ల । జూ . । చి . ॥

సా సప । పా గ మగ । మా ॥ మామదపమ గా । మా । మాదప మా ॥
. కర । గి । చిం ॥ త . . । నొం । ది . . ॥

పా ప పమ గ । పా . . । దా . . ॥ సా . సా . । సా . . । సారి ॥
తి . . రా . . । మ . . । రా . . ॥ మ . . . । యా . । . . . ॥

రీ సాసా । సా రి గమ । రిగసా ॥ ద సద రిస నిద । ని దనిప । పమపమ ॥
మే । ని । తో ॥ యిం క । నా । ని ॥

పా ప ద । గ మగా రిగరీ । సా ॥ దసద రిస నిద । నిదనిప । పమపమ ॥
మో । పు । జూ ॥ డ । వ । లె ॥

పా గ మ । పా దని దా । మా పద పా ॥ పా పద సా । సా ద నిద । నిదపా ॥
నా మొ ద । టి । పొం ॥ దే । చా . । లు ॥

పపమగా మగ రిస । సా రి గమ । దపమగ ॥
నే । । ॥

పా మ పా
వదరక ॥

**అవతారిక**

స్వీయ, మధ్య, యగు ఈ నాయిక కలహాంతరిత ఈమె మనసు లక్కవంటిదట అయినను తన స్వామిని లాలించక, మనసు నొప్పించినదట 'అట్లుచేసి ఇప్పుడేల చింతించెదవు'? అని చెలికత్తె నాయికను మందలించుచున్నది

రాగం - కాంభోజి - ఆదితాళం

ప : నిన్నునీవే నొచ్చుకొనేవు - నీ మనసున కరగేవు

అ. ప . నన్నుతాంగి మువ్వగోపాలుని - చాల అరుదూరు చేసి ॥ నిన్ను ॥

చ . తాళిమి కలిగిన వాడని యెంతో దండింప మనసు రాని
మేలు తలచి నే తాళలేనని - యేల మనసు నొప్పించితినని ॥ నిన్ను ॥

2 నిన్ను జూచి యుప్పొంగునని - నీ వతని జీవనమని
కన్నె నీ వింత కోపగించితే - కన్నుల నీరు నించుగాయని ॥ నిన్ను ॥

3. మక్కువ నమ్మిన వాడని - మా మువ్వ గోపాలుడని
లక్కవంటి మనసు రాయైె - లాలించ నైతినా యని ॥ నిన్ను ॥

ప . ని దాదా । నిద దపదా । సా రి స నిదా ॥
నిన్నునీ । వే నో । చ్చు . కో ॥
దానిప ప పమ పమ పానిద పపమగ । మా గమపమ । గమ గమ ॥
నే . వునీ . మ న । సు న । క ర ॥
ప ద ప
గే వు నిన్ను నీవే ॥

అ ప . మగ పా ప స దా । సా రీ । సరిగమ పమమగ ॥
. . స న్ను తాం . । గి రో । . . ॥
గరిమగ గరి సద సా రీ గ రి । సా ద ద స రీ । రిస నిద దా నిప ॥
ము వ్వగో । పా . । లు ॥
పా . దప దా దమగా । గ రి రీ సా । దారిస సనిదా ॥
ని చా ల ఆ. । రు । దూ ॥
పా పని దా పదపా పమ । మగగరి । సరిగమ ॥
రు జే । । సి ॥
పా ని దా ప
. నిన్నునీవే ॥

చ దా స రి స ని దా । పా మ పా । ని ద ప పమగ ॥
. . తా . శి . మి । క లి । గి న ॥
మా పమగమ పాదని ప । దపా ద సా । సా . ప దారిస ని ద ॥
. వా డని । యెం । తో ॥
దానిప ప పమ పమ పా సద స । స నిదా నిదపా । పమగా మగరీ ॥
దం డిం ప । మ న । సు . రా . ॥

పమగరి సా సధసా సపధా । సా । . ॥
. . . . . । ని । ॥

మగ పా పసదా । సా రీ । సరిగమ పమమగ ॥
మే లు త । ల చి । నే ॥

గరిమగ గరి సద సా రీగరి । సా ద దసరీ । రిసనిద దా ॰ ప ॥
తా ళ తే । . । న ని

పా దప దా దమగా । గరిరీ సా । దరిసా సనిదా ॥
ఏ ల మ । న సు । నొ . ॥

పా ప నిదా పదపా పమ । మగగరి । సరిగమ ॥
పిం చి । . తి । వ ॥

పాని దామ
ని నిన్ను నీవే ॥

**అవతారిక.**

ధీర నాయిక యగు ఈమె స్వీయ, ప్రౌఢ ఒకప్పుడు తన యందు ప్రేమాను రాగములు కలిగిన పతి తాత్కాలికముగా తన్నెడ బాసి తిరిగి రాగా ఆతడు ఇంత కాలమును వేరొక యువతి చెంత గడిపి వచ్చినాడను అనుమానము తో 'ముందు నిన్నెరుగనా మువ్వగోపాలా - ఎందుకు ఈ మాటలని ' కోపించుకొను చున్నది

రాగం - కాంభోజి - త్రిపుటతాళం

ప ఎందుకు ఈ మాటలేల ?

అ ప ముందు నిన్నెరుగనా ? ఓ మువ్వ గోపాల ॥ ఎందుకు ॥

చ : నిలుపు నాపై దయయింక - అ చెలియతో అలిగి వచ్చితివో లేక
తలపు తెలిసె నిందాక న
న్నల యించినా దైవమును - అనవలె గాక ॥ ఎందుకు ॥

2 మనసురాని పొందుమాను ఆ - కనకాంగివలె జక్కని దానగాను
నిన్ను మెప్పించ నేర్తునే నేను ఓ
వనజాక్ష ! సరసము వద్దు నాతోను ॥ ఎందుకు ॥

3 రంతు సేయక మున్ను రావా ? నే
నెంతో కోపించిన నెదురాడి నావా ?

ఎంత లేదని యుండ నీవా అది
కొంత కాలము మువ్వ గోపాలదేవా ! ॥ ఎందుకు ॥

ప: . స రి । గా । గా . ॥ మా మదపమ గా । గ మగా రిగరీ । సా ॥
. . . . ఎం . । దు . । కు . ॥ యీా . . . . । మా . । ట . ॥

సధసా పధా గరి । సా . । ॥
లే . . . । ల । . ॥

2 . సరి । గ మ పాదప । ప మగా గామరి ॥ మా మదపమగా । గమగా రిగరీ । సా ॥
ఎం . । దు । కు . . ॥ యీా । మా . । ట ॥

స ధసా పధా గరి । సా . । . . ॥
లే . . । ల . । ॥

3 సరి । రీ రీనిద । దా ని పా ॥ పమ మదపమ గా । స రీ రిప । గమరిగ సా ॥
ఎం । దు । కు ॥ యీా . । మా । . ట ॥

స ధసా ప ధాగరి । సా । ॥
లే . । ల । . . ॥ ఎందుకు ॥

అ. ప: ప మ గా । పా । పా స దా ॥ సా స ని దా । దానిద దానిప । పా మ పా మ ॥
. . ముం । దు । ని ॥ న్నె . రు । గ । నా ॥

పా . పా । దాదని । నిదపా ॥ ప మగా మగ రీ । రిపమా గరి । సరిగమ ॥
ఓ ము । వ్వ । గో . ॥ పా . . । . । ల ॥

2 దపమా ప మగా । పాపసదా । సాసగరీ ॥ రిస రిగమరిగా । సా ద నిద । దానిప ॥
. . . ముం । దు । ని . ॥ న్నె రు । గ । న ॥

పా . పద । గమగా రిగరీ । సా ॥ ససనిదా నిదపా । పా మ గరి । సరిగమ ॥
ఓ . ము । వ్వ . . । గో ॥ పా . . । । ల . ॥

3 పాదప నిదామ పమగా । పాపసదా । సాసగరీ ॥ సాగరి రిపగమ గరిసా ।
. . . . . . ముం . । దు । ని ॥ న్నె రు . ।

సా దనిద । దా ని పా ॥ పా పద । గమగా రిగరీ । సా . ॥
గ । న ॥ ఓ ము । వ్వ । గో . ॥

సససిదా నిద పా । పమగరి । మరిసా ॥ సపధా
పా. . . . . । । ల ॥ . . ఎందుకు ॥

చ పనిదా । పాపద । పా గ మగ ॥ మా మప గమ । పా । దా ని పా ॥
ని లు । పు । నా ॥ పై । ద । య ॥

దా । దనిదస నిద । దా పా ॥
యిం । క . । ॥

2 పా సనిదా । పదనిద మపదప । పా గ మగ ॥ పమగా మ పా । పా । దా ని పా ॥
ని లు । పు । నా ॥ పై । ద । య. . . ॥

దా । దనిదస నిద । దాపా ॥ పా మ పా మ గమగా।గామగ గామగ । గామగ గామగ ॥
యిం . । క . । ॥ అ . చె లి । య । తో . ॥

గరిగా రిగమగ మా । గరిగా రిగమగ । గరిసా సా ॥ సా సరి । గా మ పాదప । మగమా ॥
అ . । ల । గి ॥ వ చ్చితి । వో . . । . . . ॥

గామ దప మా । పా . । . ॥
లే . . . । క . . । . . . ॥

1 పమగా । పా । పా స దా ॥ సారిగమరీ గ । సా సా ద । దారిస నిద ॥
. . . త ల । పు । తె . ॥ లి సే । నిం । దా . ॥

2 దా నిపా పమగా । పా . । పా స దా ॥ సాగరిరిపగమ రిగసా । సాసద । దారిస నిద ॥
క త ల । పు । తె ॥ లి . . సే । నిం । దా ॥

దా నిపా పాసద । దామగ గరిగరి । సా ॥ సాదదారిసనిద । దానిస । పా . మ పా ॥
క న న్నల । యిం । చి ॥ నా దై । వ . । ము . ॥

పాపాగమ । పా దనిదా । దమ పదపా ॥ పపమ గమరి । గరిసా । స నిపా ॥
వన । వ । లె ॥ గా । క . । . ॥

3 ధా పమగా । పా । పా స దా ॥ సారిరి రిపగమ రిగసా । సాసద । దారిస నిద ॥
. త ల । పు । తె ॥ లి సే . । నిం । దా ॥

దాపా పాసద । దామగ గరిగరి । సా ॥ పాసద సా రిగ రిసనిద । దా నిపా । పా మపా॥
క న న్నల । యిం . । చి ॥ నా దై । వ . । ము . ॥

పా గాగమ । పా దనిదా । దను పదపా ॥ పా సద సా । సనిపా నిదపా ।
. . న న . । వ । లె ॥ గా . । క . ।

పమగా మగరి ॥ సనిపా ధా
. . . . ॥ . . ఎందుకు ॥

**అవతారిక**

స్వీయ నాయిక యగు ఈమె మధ్య, విరహోత్కంఠిత నాయకుని యుపేక్షయు, అతడు అన్య భామినితో కూడి యుండుటయు, తెలిసి నప్పటికిని, ఆతని యందలి ప్రేమాను రాగములను యణచుకొనలేక చెలికత్తెతో చెప్పుకొని పలవించుచున్నది ఈ పదమునందుగల మూడవది యగు ముద్రాచరణము కానరాలేదు

**రాగం - కాంభోజి - త్రిపుటతాళం**

ప. అక్కరో! వానికి నాపై హర్షము లేదుగ

అ ప చక్కనాయె రా రమ్మని - సారెకు వేడిన గాని ॥ అక్కరో ॥

చ నిన్నవాని పిలువ బోతే - నీరజాక్షియును తాను
నన్నుజూచి తలుపు మూసి - నవ్వు కొనుచును
నన్ను తాంగిరో! యింతైన - సడ్డసేయక యుండితే
నన్ను దూరుకొని - న్యాయము గాదని యెంచి వచ్చితి ॥ అక్కరో ॥

2 చక్కగ చూడదు నన్ను - సరసాన మాటాడడు
వొక్క పూసైన మనసు - యువిద! వానికి
మక్కువ యేమియు లేక మగువరో! నా చెలిమి
వెక్కస మాయెనో గాక - వెలది! యేమి బోధించినదో ॥ అక్కరో ॥

(33)

ప: . పద । సా । స నినిద ॥ దా ని పా । పపమగ । మగగరి ॥
అ । క్క । రో ॥ వా . । ని । కి ॥
పా । స నిపా । ధాసధ ॥ సా స రి । రిదా । దా ని పా ॥
నా । పై । ॥ ని హ । ర్ష । ము ॥
ప పమగా మగ రి । స రిగమ । పా . ॥ పానిద మా
లే . । దు । గా ॥ అక్కరో ॥

అ. ప. పద । సా । సాగరి ॥ గ రి రీ సా । సరిగమ । గరిగా ॥
చ । క్క । నా ॥ యే రా । ర । మ్మ . ॥
సా పాసద । దారిస సారిగ । రి సనీ దా ॥ దపాపా । పా పానిద । ప పమగ ॥
ని సా । రె । కు ॥ వే డి । న . । గా ॥
పా మ పా ॥
ని అక్కరో ॥

చ. గరి । రి మగా గా । మ దపమ ॥ గా । గమరీ రిమరీ । సా ॥
. ని । న్న । వా ॥ ని . . । పి లు . । వ ॥
సా । సా . । . ॥ సరి । గా మ పా । పా మ పా ॥
బో । తే । ॥ నీ । ర । జా ॥
దా ని ని దప । పా . ద సా । స నినిద ॥ దా ని పా పమగా । పా । పా పాసద ॥
. యు । ను . । తా . ॥ ను . . ని . । మ్మ . । జూ . ॥

సా ౹ సా ద ని ద ౹ పాపా ॥ పా పసద ౹ సా ౹ ॥
చి ౹ త లు ౹ పు ॥ ము . ౹ సి ౹ ॥

గమ ౹ పా ద సా ౹ సా ద నిద ॥ ద పాపనిద ౹ పా గ మగ ౹ పా మ పా . మ ॥
న ౹ వ్వు ౹ కొ ॥ ను ౹ చు ౹ . ॥

పా గరిరిమ ౹ గా ౹ మ ద పమ ॥ గామమగరి ౹ గరిపమ ౹ గ రిగరి ॥
ను స ౹ న్ను . ౹ తాం ॥ గి రో . ౹ యిం ౹ తై ॥

సా సరి ౹ గా మ పా ౹ పా మ పా ॥ దా నినిదప ౹ పా ద సా ౹ సా ద ని ద ॥
న . స ౹ డ్డ . ౹ సే ॥ య . క . ౹ యుం ౹ . . డి ॥

దనిపా పా పమగా ౹ పా ౹ పాసద ॥ సా . ౹ సా ద నిద ౹ దాపా ॥
తే న ౹ న్ను ౹ నే ॥ ను . ౹ దూ ౹ రు . ॥

పా పద సా సద ౹ సా ౹ ॥ ద ససాగమ ౹ పా ద సా ౹ స దనిద ॥
కొ ౹ ని ౹ . ॥ న్యా య ౹ ము . ౹ కా ॥

దపాపనిద ౹ ప మగా మా ౹ పా ॥ .
ద ని ౹ యెం ౹ చి ॥ అక్కరో ॥

**అవతారిక**

విరహోత్కంఠిత నాయికయగు ఈమె పరకీయ, ధీర తనయందు ఎంతో అనుకూలత గల ప్రియుని దాపుననే దాచి తన చెలులే తన్నలయించుచున్నారను భ్రమ కలదిమెకు ముందు 'నే నెవ్వరి పొందెడబాపితినో అందుకీలాగైతినని, ఏ ప్రొద్దు ప్రాణవిభు నెడబాయని చెలులు ఎన్ని నోములు నోచిరో తెలియ, అందరికి చల్లనైన చందమామ నాపాలిటికనలమాయెనయ్యో చెలియ' అని వగచుచున్నది

రాగం - కాంభోజి - ఆదితాళం

ప మోసమాయె నాబుద్ధికి మోసమాయెనే

అ ప. మోసమాయె నేమిసేతు - మువ్వగోపాలుడు నేడు
ప్రొక్కి వేడినరాడే ఓ చెలియా ! ॥ మోసమాయె ॥

చ. అందరికి చల్లనైన చందమామ నాపాలిటి
కనలమాయె నయ్యో ఓ చెలియ !
ముందు నే నెవ్వరి పొందు ఎడబాపితినో
అందుకీలాగైతినో ఓ చెలియ ॥ మోసమాయె ॥

2 వలవల కన్నీరు వెల్లువలాయ నేటికే
వెలది మోముజూచితినో చెలియ !
అలసి మువ్వగోపాలుడు అనిశము
వనుగూడి అలసటలను - బెట్టునో చెలియా !
చిలుక పగ సాధించెనే దీని బెంచిన
చేతులెటువంటి వోచెలియా ? ॥ మోసమాయె ॥

3 యే(ప్పొద్దు (ప్రాణవిభుల నెడబాయని యింతు
లెన్ని నోములు నోచిరో చెలియ !
దాపున గూడున్న విభుని దవ్వులబెట్టు చెలులు
నాపాలగలిగిరో ఓ చెలియా ! ॥ మోసమాయె ॥

ప పద సా దదా రిస నిద ద నిపా । పా పానిద ప మమగ । పాదా ॥
మో స . మా యె । నా . బు । ద్ధి కి ॥

సా సనిదా పా పా పానిద । పమగా మా । పా ॥
మో . . స మా . । . । యె ॥

ప : ప పమగ పా పా సద సా । సాసరి గమరిగ । సా సా ॥
మో . స మా యె । నే . మి । సే తు ॥

ద పాద సా సా సా ధ । ద సరీ రి సనిద । దానిప పా ॥
ము వ్వ గో పా । లు . . డు . . । నే . డు ॥

ద పా పదనిద మపదప । పమమా మగగా । పాదా ॥
. (మొ క్కి వే డి . । న . రా । దే ॥

సాసప దారిస నిద దనిపా । పమగా మగరీ । సరిగమ పా ॥
ఓ . చె . . లి . । య . . . । . ॥ మోసమాయె ॥

చ: . పా నిద ప పమగ గాపమ పా । పాదప । దనిదని పద ॥
. అం . ద . . రి కి । చ ల్ల । నై . . న ॥

మ ప దప పా పద సా । స నిదా నిదపా । పమగా మగగరి ॥
చం ద మా . మా । నా . పా . । లి టి ॥

సారిగ సా స నిఫా ధా । సరిగమ పదసరి । స నిదా దప ॥
క న ల మా యె । న . । యో్యా ॥

మపదా పాపద సద రిసనిద । దప ద పమగ । మాపా ॥
ఓ . చె । లి య । . ॥

ప మమగ పా పాసద సా । సాసరి గమరిగ । సాసా ॥
ముం . దు నే నె । వ్వ . రి . . । పొందు ॥

దపాద సాసా సా . ద । దసరి రిసనిద । దానిప పా ॥
ఎ . డ బా పి । తి । నో . ॥

. ద పా పదనిద మ పదప । ప మమా మగగా । పాదా ॥
. అందు కీ . లా . । గై . . తి । నో ॥

సానప దారిస నిద దనిపా । పమగా మగరి । సరిగమ పా ॥
ఓ చె . లి . । య . । . . ॥ మోసమాయె ॥

**అవతారిక**

సామాన్య నాయిక యగు ఈమె ప్రౌఢ, ప్రేమగర్విత చెలి ఈమెకు విజయరాఘవుని పొందుగోరు యువిదకు వుండవలసిన విద్యాకౌశలములను గురించి చెప్పుచున్నది గాయకురాలు కావలయునట ఆటకు మేటి కావలయునట తంబురగోటమీటి రాగమనవలయునట వానిపై సొగసుపాటలు వినిపింపనేరవలెనట 'ఇంతటి చతుర విద్యాపారంగతురాలుగాని అతని పొందునకు తగదుసుమా! "ఏమనేరని భామలు వానిపొందునకాసించిన లాభమేమి?" అని మందలించుచున్నది ఈ పదమునందు క్షేత్రజ్ఞులు తమకాలమునాటి వనితల విద్యా వైదుష్యములను చక్కగా వివరించియున్నారు

రాగం - కాంభోజి - త్రిపుటతాళం

ప సామాన్యముగాదే! వాని పొందు - సామాన్యము గాదే!

చ యేమి నేరని భామలు వానికాసించిరే
యేమందు విజయ రాఘవుడే సామిసుమ్మి
భూమియందు వానిగుణము లెన్న
జనులకు వీనులవిందు ఓ చెలియరో! ॥ సా ॥

2 పాయపు హంతకారికావలె - వాడు పద పద్యరచన
సేయ నుత్తర మీయవలె - వాని ముద్దు కవిత తా
వ్రాయ చదువ నేరవలె ఆ వగలయందు
గాయకురాలుగావలె - ఓ చెలియరో! ॥ సా ॥

3. ఆటకు మేటిగావలె, తంబుర
గోటమీటి రాగమనవలె, వానిపై పొగను
పాటలు వినిపించవలె,
వాని మనసు తెలిసి మాటలాడ నేరవలె, ఓ చెలియరో! ॥ సా ॥

4 కప్పుర బాగాలీయవలె, వాతెరకు తేనె
చిప్పిల్ల సగమాకీయవలె, తమి హెచ్చేవేళ
తప్పక మోవి నొక్కవలె, విజయ రాఘవుని
అప్పుడె పైకొని కూడవలె, ఓ చెలియరో! ॥ సా ॥

ప సా . . । స దనిద । దా పా ॥ పా పనిద । పపమగ । మా ॥
సా . . । మా । న్య ము ॥ గా . । దే . . । . . ॥
మ గగమపా । దా పా । దా . . ॥
వా ని । పొం । దు . ॥

2. స గరిమగరి । స దనిద । దా పా ॥ పా పనిద । ప పమగ । మా ॥
సా . । మా । న్య ము ॥ గా . । దే . । ॥
మ గగమపా । దా పా । దా ॥
వా ని । పొం . । దు ॥ సామాన్యము ॥

చ ప దపద । ప గమగ । మా ॥ మగమపా । పా । ధపమా ॥
ఆ । ట . . । కు ॥ మే టి । గా । వ ॥

పా । పా । దాపా ॥ దా ప ద । సా । స రిగరి ॥
లె । తం । బు ॥ ర గో । ట । మీ . ॥

సా సరి । స దనిద । దాపా ॥ పాపా నిద । పపమగ । మా ॥
టి । రా । గ ॥ మ న । వ । లె ॥

గా సా । రీ । గా ॥ మా మాదప మా । పా । పా ॥
వా . । ని । పై ॥ సొ గ । సు । . ॥

ప దపద । ప గమగ । మా ॥ మగమపా । పా . । ద పమా ॥
. పా . । ట । లు . ॥ వి ని । పిం . । చ ॥

పా । పా । దాపా ॥ దా ప ద । సా । సరిగరి ॥
వ । లె । వా ॥ ని మన । సు । తె ॥

సానినిదా । దా పా । పానిద ॥ ప పమగగా । పా । దా ॥
లి సి । మా । ,ట ॥ లా . । డ . । నే . ॥

సనిసాపా । దా । సా ॥ రిగమగసరి । గరిపమ । గరిసా ॥
ర । వ । లె ॥ ఓ . । చె । లి . ॥

స సనిదపా । పా । దా . ॥ సా
య । రో . । . ॥ సామాన్యము ॥

**అవతారిక**

ప్రోషిత పతికయగు ఈ స్వీయనాయికనుగూర్చి విరహార్తుడయిన నాయకుడు ఆమె చిత్రమును వ్రాసితినని, అంగసౌష్టవములు వ్రాయగలిగితిగాని వానియందలి జీవ కౌశలములు లిఖయింపనేరనైతిననియు, తనయందు అనురాగవతియైన ఆమెను తోడితెచ్చుటకు హితవరు లెవ్వరును లేరని చింతించుచున్నాడు

**రాగం - కాంభోజి - ఝంపతాళం**

ప: ఏమిసేయుదు ? మోహా - మెటువలె తీరునే

అ ప: భామినీమణిని యె - వ్వరు తోడితెచ్చేరు ॥ ఏమి ॥

చ: వెలయు నీదు ముఖా ర - విందంబులిఖయించి
యలరు వాసనలు వ్రా - యగ నేరనైతి
కళలొల్కు నీ మోవి - గదిసి వ్రాసితిగాని
నెలత తేనియలుంచ - నే నేరనైతి ॥ ఏమి ॥

2 కలికి! సొగసైన నీ - కనులు వ్రాసితిగాని
బెళుకు జూపులు వ్రాయు - వితము నెరుగనైతి
గళము రేఖలు దెలియ - గాను వ్రాసితిగాని
చెలగు కోకిలవంటి - పలుకు వ్రాయగనైతి ॥ ఏమి ॥

8 తరుణిరో ! నాగబం - ధము రీతిగలయుటలు
గ రి మ వ్రాసితిగాని - పరవశముచేత
పరగ మా మువ్వ గో - పాల రారా యని
తిరుగ రతులకు బిలుచు - తెలివి వ్రాయగనైతి ॥ ఏమి ॥

ప దా ని పా ద । సా రి సా ని దా ॥ దా నిద దానిద । దా నిద దానిద దానిద ॥
ఏ । మి సే ॥ యు దు । మో హా ॥
ద నిపా పసదా । సా రి సనిదా దనిపా ॥ పా । ప నిదా దమపమ ॥
మె టు । వ లె . ను ॥ తీ । రు నే ॥ ఏమి ॥

అ ప సాసమ మగగా । పా పాసద ॥ సా స గరీ । రిమగా సాగరి రిపగమ ॥
భా . । మి ని ॥ మ ణి । ని ఎ ॥
గ రిగా సా । పా సద దారిస సా గ ॥ రి సనీ దా । ద నిపా పదమా గ మ ॥
వ్వ రు । తో డి ॥ తె । చ్చే రు ॥ ఏమి ॥

చ సాగరి । రి గ గామగ గామగ ॥ గ రి రి పమా । గాగరి రిగారి సా ॥
. వెల । యు నీ ॥ దు . ము । భా ర ॥
సా సా ధ । ధా రిస సా గ రి సనీ ॥ ధనిపా పసధా । సా సా ॥
విం . । దం . . బు ॥ లి ఖ । యిం చి ॥

సాగరి । గా గా మ పా ॥ పా మ పా మ । గా గా మగ గామగ ॥
యల । రు వా ॥ స . న । లు ప్రా . ॥

మాపా । పా గ మగమా ॥ మాదప మా । పా ॥
యగ । నే . ర ॥ నై । తి ॥

పద । సా సా ద ॥ దారిస సాగరి । రి సనీ దా ని పా ॥
కళ । లో ల్కు ॥ నీ । మో వి ॥

పదపద పమగా । గామగ గా రి రిగరీ ॥ సా సరిగా । మా దపమా పా ॥
గ . ది । సి ప్రా ॥ సి తి । గా ని ॥

పాసమ మగగా । పాపాసద ॥ సా సగరీ । రిమగా సాగరి రిపగమ ॥
నె . ల । త తే . ॥ ని య । లుం చ ॥

గరిగా సా । పాసద దారిస సా గ ॥ రిసనీ దా । దనిపా పదమా గమ ॥
నే । నే ॥ ర . । నై . తి ॥ ఏమి ॥

**అవతారిక**

స్వీయ నాయికయగు ఈమె ప్రోషితపతిక మధ్య నాయకుడు ఈమెయందుగల తన మోహమును చెప్పుకొనుచున్నాడు అనుకూలవతియగు ఈమె నెడబాసినది మొదలు ఆమె రూపే కనులకు కట్టినట్లుండునట 'సతతము నిను దలుపకుండెదనన్న క్షణమైన మరుపురాదే! ఓ మగువా' అని తన యనుభవములను వరుసగా వెలిబుచ్చుకొనుచున్నాడు

రాగం - కాంభోజి - ఝంపతాళం

ప: ఎటువంటి మోహమోగాని ఓ యెల నాగ! యింతింతయనగరాదే

అ.ప మటుమాయ దైవమీ మనసు తెలియగలేక
మనల నెడబాపెనయ్యో! ఓ మగువ ॥ ఎటు ॥

చ కలికి నిన్నెడబాసినది మొదలు నీరూపు - కనులకే గట్టినట్లుండునే
చెలియ నేనొకటి తలచెదనన్న నీచేయు
చెలిమి తలపై యుండునే - ఓ మగువ
సొలసినే నేమైన వ్రాయ నీయాకార - శోభనమె కనుపించునే
తలచి పేరున నొకటి పిలువగబోయిన నీదు
పేరే ముందుగ తోచునే ఓ మగువ ॥ ఎటు ॥

2. అతివ! నీ అధరామృతము తలచినంతనే - ఆహారమింపుగాదే
సతి నీదు కౌగిటను ప్రతిదినము నెనసిన - గతి తెలుప నిదురరాదే
మతిలోన నిన్నెగా నిరతంబు నెరుగరతి - పతియాన కల్లగాదే
సతతమును నిను దలపకుండెదనన్న
క్షణమైన మరపురాదే ఓ మగువ! ॥ ఎటు ॥

3 ఘనత మా మువ్వ గోపాల! రా! రా! యని - కలసినది మరపుగాదే
దినమొక్కయేడుగా గడుప నెవ్వరి తరము - ననబోణి యేమిసేతు?
మనసిజుని బాణవేదనలనే సైరింప - మగునరో! వరము గాదే
మనము చేసిన పాపమెట్టిదో వారలతో
మాటాడసైచదే - ఓ మగువ! ॥ ఎటు ॥

ప: దపదా । సా సా ద ॥ దా రిస నిద । దా దా - ని పా ॥
ఎ . టు । వం టి ॥ మో । హ మో . ॥

పా । దనిదా దమ పదపా ॥ పమమగ । గా పా మ పా ॥
గా . । ని . . ఓ . ॥ ఎ . ల . । నా గ ॥

పా పసదా । సా రి సనిదా ॥ పా పా మ । గా గరిసరి ॥
యిం । తిం త ॥ య న । గ రా ॥

గా మ పా । . దపపమ ॥
దే . . । . ॥

2 దపదా । గ మగా రిగరీ సా ॥ పా సద దారిస । సాగరి రిసనీ దా ॥
ఎ టు । వం . టి ॥ మో । హ మో ॥

దా ని పా । దనిదా దమ పాదప ॥ పమమగ । గా పా మ పా ॥
గా . । ని ఓ ॥ ఎ . ల . । నా గ ॥

పా పసదా । దామగ రిగరీ సా ॥ పా మ పాదస । దప పా మ గా ॥
యిం । తిం . త ॥ య . న । గ రా ॥

గ రిసరి । గమపదపమ ॥
దే . . । . ॥ ఎటువంటి ॥

అ. ప. పా గ మ గ । పా ప సదా ॥ సా సా రి । గామగ గసరీ ॥
మ టు । మా య ॥ దై । వ మీ ॥

గరీప గా మ । గరీగ సా సా ద ॥ దారిస సనీద । దా ని పాపా ॥
మ . న । సు . తె లి ॥ య గ । లే క ॥

ద పదా । గమగా రిగరీ సా ॥ సా ని దా । పా మ పా పసదా ॥
మ న । ల నె డ ॥ బా । పె న ॥

సా . । . ॥ మగమా । పా ద మా గా . మ ॥
యో్య. । . ॥ ఓ । మ గు వ ॥ ఎటువంటి ॥

చ : దని । దాపా ॥ పా . ద పా ద । పా గ మగమా ॥
కలి । కి ని . ॥ శ్నె . డ । బా సి ॥

పాదస । ద స సనీ దా ॥ దపదా । సా సా ॥
నది । మొ . ద లు ॥ నీ । రూ పు ॥

మగమా । పాదాపా ॥ పా పా ద । సా రి సా ని దా ॥
క ను । ల కే ॥ క . । ట్టి న . ॥

దప దా స । నిదదా ని పా ॥ పా పాదమ । గా గరిగరి ॥
ట్లుం । డు నే . ॥ చె లి । య నే ॥

గ సరి । గామాపా ॥ దా ని పా । దా. దా ॥
నొ క । టి త ల ॥ చె ద । న న్న ॥

దపదా । సరిగరి సా సా ॥ సా రి సా ని । దా ని దాపా ॥
నీ । చే యు ॥ చె లి । మి త ల ॥

పా పా ద । ప మగా గమగా మా ॥ దపమా పా । . ॥
పై । య్యుం . డు ॥ నే । ॥

సరిగమ । పదసాసరి ॥ సనిదా । దప మాపా ॥
ఓ . . । ॥ . । మ గు వ ॥

. దని । దాపా ॥ పా ద పా ద । పా గ మ గ మా ॥
నొ ల । సి నే ॥ నే . . । . మై న ॥

పా ద స । దా స సనీ దా ॥ ద పదా । సా సా ॥
వ్రాయ । నీ ॥ యా । కా ర ॥

మ గమా । పా దా ని పా ॥ పా పా. ద । సా రి సా ని దా ॥
శో . । భ న మె ॥ క ను . । పిం . . చు ॥

దప దా స । నిద దా ని పా ॥ పా పాదమ । గాగరిగరి ॥
నే । త ల ॥ చి । పేరు న ॥

గ సరీ । గామాపా ॥ దా ని పా । దా దా ॥
నొ క । టి పి లు ॥ వ గ । బో వ ॥

దపదా । స రిగరి సాసా ॥ సా రి సా ని । దా ని దాపా ॥
నీ దు । పే . రే ॥ ముం . . । దు గ ॥

పా పా ద । పమగా గమగా మా ॥ దపమా పా । ॥
తో । చు ॥ నే । ॥

సరిగమ । పదసాసరి ॥ స నిదా । దపమాపా ॥
ఓ । . ॥ మ . గు । వ ॥ ఎటువంటి ॥

**అవతారిక**

సామాన్య నాయికయగు ఈమెను 'నీవంటి సౌందర్యవతి, గుణవంతురాలు, సరసురాలు లేదని మువ్వగోపాలుడు పదుగురిలోను నిన్ను మెచ్చుకొని గౌరవించుచుండగా ఎంత నిర్దయురాలవే! ఇంత దయగలవాని నేల రావద్దంటివే?' అని చెలి మందలించు చున్నది

**రాగం - కాంభోజి - ఝంపతాళం**

ప. ఇంత దయగలవాని నేల రావద్దంటి? - వెంత నిర్దయురాలవే

అ ప సంతతము మా మువ్వగోపాల సామి నీ
సరసత్వములె యెంచునే - ఓ చెలియరో॥ ॥ ఇంత ॥

చ : వేంది! నీ గుణ మమృతమని నిండుకొలువులో
వేనోళ్ళ కొనియాడునే
పలుమారు నీకు సరి రూపవతి లేదనుచు బాసచేసెదనని యెనే
తెలిసి పదివేల జన్మలకు నీ ఋణము - దీర్చుకోజాలననెనే
చెలియ తనమీద నీవలుక చెందిన తా
చేసిన పాపమనెనే! ఓ చెలియరో! ॥ ఇంత ॥

2 మును నీదు కెమ్మోవి తేనె నానగ ప్రాణ
ములు నిలిచియున్న వనెనే!
ఘనమైన విరహావేదన కోర్వజాల నిక - కాచి రక్షించుమనెనే
తనువు తన సొమ్మె, యిచ్చకముగా దీ మాట
తన చిత్త మెరుగు నవెనే!
వనజాక్షి! నవగ బనిలేదు నాపాలి దైవము
కరుణ తప్పెననెనే! - ఓ చెలియరో! ॥ ఇంత ॥

3 ముందు మా ముద్దుగోపాల రారా! యనిన
ముద్దు తా మరువ ననెనే
కందర్పుడిక నేమి చేసునో యెరుగునా - కలికితో దెలుపమనెనే
మందె మేలమున నే నాడినమాట తన - మది నుంచవలువదనెనే
యిందుముఖి ననుగూడి లాలించిన సొగసు
ఎంతనుచు తలతుననె నే? ఓ చెలియరో ॥ ఇంత ॥

ప దా పా । దాసాసా ॥ సా ని దా । ద ప దా స నిదపా ॥
యిం । త ద య ॥ గ ల । వా . ని ॥

పా పదనిద । మపదప ప పమగ మా ॥ పా । ద దపా ద ద ॥
నే । ల రా . . ॥ వ । ద్దం టి ॥

సా సా । సా సా ని దా ॥ దప దా । ద నిదా పదపా పపమగ ॥
వెం । త ని ॥ ర్ద . యు । రా . ల . . ॥

గమగా రిగరీ । పా సాసా ॥ సా స రి । గా మాపా ॥
వే . । ఓ ॥ చె లి । య రో ॥

2 ద దపా । దా సరిగరి సా ॥ సా ని దా । ద పమప దారిస నిద దప ॥
యిం । త ద య ॥ గ ల । వా ని ॥ నేల ॥

అ ప: ద దపా । దదసా రీ ॥ రిగమగ సరిగరి । పమగరి సాసా ॥
సం । త తము ॥ మా । ము వ్వ ॥

ద సరి రిసనీ । దాపా దద ॥ మ పదా దపమా । గా గపమా పా ॥
గో . । పా ల ॥ సా । మి నీ ॥

పా దా । దపాద సాసా ॥ సా ని దా । ద నిదా పదపా ప పమగ ॥
స ర । స . త్వ ॥ ము లె । ఎం . చు ॥

గ మరీ రిగరీ । సాసాసా ॥ సారీ । గా మాపా ॥
నే . । ఓ ॥ చె లి । య రో ॥

చ. పా త సా । స సనిద దాపా ॥ పా । ప దపదపపమగ మా ॥
ముం దు । మా ॥ ము । వ్వ గో ॥

పా . । దద దపాద సా ॥ సా సరినీ । దా నిదపా దా ॥
పా । ల రా ॥ రా । య ని న ॥

మ ప దానిద । పా పా మ గా ॥ గ మగా రి గరీ । సాసాసా ॥
ము । ద్దు తా ॥ మ . రు । వ న నె ॥

ప పమగ మా । దపమా పా ॥ ప దపద । పపమగ మా పా ॥
వే . . . . । . ॥ . కం . । ద . . ర్పు ॥

పాదా । దపాద సాసా ॥ సా సరిగరి । గరిసా సా ని దా ॥
డి క । నే మి ॥ చే । సు నో ॥

దా ని దదప । దా రి సనీ దా ॥ మపదరి । సా స నిదా నిదపా ॥
ఎ రు . । గ మా . ॥ క లి । కి తో . . ॥

ప మగా మగరీ । గరిసా స నిపా ధా ॥ సా । . ॥
తె లు । ప . మ నె ॥ నే । . ॥

ప మగా మా । పాపా దనిదా ॥ పా దా । ద పాద సాసా ॥
మం దే । మే . ల ॥ ము న । నే ॥

ప దరిస సనిదా । నిదపా పమగా మగరీ ॥ పమగరి సా । సారీగా ॥
నా । డి న మా ॥ ట । త న మ ॥

గపమా పా । దామాపా ॥ దాసా । సనిపా దాసా ॥
ది నుం । చ వ ॥ లు వ । ద . నే నే ॥

ద దపా । దాసారీ ॥ రిగమగ సరిగరి । పమగరి సాసా ॥
యిం । దు ముఖి ॥ న . ను । గూ డి ॥

ద సరీ రీసనీ । దా పాదా ॥ మ పదా దపమా । గామాపా ॥
లా । లిం చి ॥ నా . . . । సొ గ సు ॥

పా దద । పా ద సాసా ॥ సా ని దా । దనిదా పదపా పమగా ॥
ఎం . । త . ను చు ॥ త ల । తు న నె ॥

గమరీ రిగరీ । సా . ॥ సా రి । గామాపా ॥
వే . . । ఓ ॥ చె లి । య రో ॥ యింత ॥

**అవతారిక :**

ప్రోషితపతికయగు ఈ స్వీయనాయిక ప్రౌఢ చెలి తనకు కానవచ్చు శుభశకునము లన్నియు చెప్పి 'యిలలోన యీ శుభశకునము లెవరికయ్యీనమ్మ ? పలుమారు మువ్వ గోపా లుడ నినుకూడీని ' అని యూరడించుచున్నది ఈ పదమునందు విందుబూచి తిరుగుట, పైడి గంటలు పలుకుట, పాలకుడిగెతిరుగుట, ములనున్న నెరికోకముడి వీడుట, కెమ్మోవియదరుట తోరణగాళి పలుకుట మొదలగు శకునములన్నియు చక్కగా క్షేత్రజ్ఞులు చెప్పియున్నారు.

ఈ యదుకుల కాంభోజిరాగమును ఎరుకలకాంభోజియు యనుటకద్దు ఇది ప్రాచీనము భాషాంగము 'స ని ప ధా సా ' - 'స ని సా ' అను ప్రయోగములలో భాషాంగ స్వరమయిన కాకలినిషాదము వినబడుచున్నది స రి మ ప ద సా - స ని ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు అయినను 'గ మ పా ద ప మ పా మ గా ' 'ద ని సా రి స ని సా ని ధా ' అను ప్రయోగములు విశేషరంజకములుగా యిందు వచ్చు చున్నవి సకృత్తుగా 'స ని స ప ధా సా ' అను మంద్రస్థాయి సంచారమును 'స రి గ సా ' అను తారస్థాయి ప్రయోగమును తప్ప మంద్రతార స్థాయిలలో వేరు సంచారములు కానరావు 'స రి పా మ ' - 'మ గ రీ గా సా ' అను సంచారములును రాగస్వరూపమును తెలియజేయు నవిగా యున్నవి

రాగం - యదుకుల కాంభోజి - త్రిపుటతాళం

ప : విందు బూచి తిరిగెనే తిల్ల గో - విందు డిందు వచ్చెనేమో

అ ప. యిందువదన ! యింటి - ముందర నేత వింతగ ॥ విందు ॥

చ. కులుకుచును పాల - కుడిగె తిరిగీనే
కల కలమని - పై డిగంట పలికీనే
మొలనున్న నెరికోక - ముడి యిప్పుడు వదలీనే
యిలలోన యీశకునము - ఎవరికయ్యీనమ్మా ! ॥ విందు ॥

2 జక్కున గుబ్బలు చాల - యుప్పొంగీనే !
చక్కెరవంటి కెమ్మోవి - సారెకదరీనే !
మక్కువ సందటి దండలు - మాటి మాటికి బిగిసీనే !
పక్కున తోరణగాళి - పలుమారు పలికీనే ! ॥ విందు ॥

3. తలచినట్లు నేడు - దైవముతోడయ్యీనే !
కలికిరో ! యిది క్షేమ - కారి యయ్యీనే !
యెలమి నీ వామభుజ - మిపుడిదిగో యదరీనే !
పలుమారు మువ్వ గో - పాలుడు నిను గూడీనే ! ॥ విందు ॥

ప. . . . సా । గ రిరిమ । గా . । గా । గ రిగరి । గరిగరి ॥
. విం । దు . । బూ . ॥ చి । తి । ॥

మగమ పాదప మగ । గామగ గామ రి । రీ ॥ రీ । గ రిమగ । సా . ॥
రి గే । నే । ॥ । తి । ల్లి . ॥

సా సా రిగ । రి సపా సనిపా । ధా . ॥ సా రిగ సా । రి । రి . ॥
గో . । విం । దు ॥ డిం దు । వ . । చ్చి . ॥

రి మ పాదస దప । ప మగా మగరీ । రిమరీ సా ॥
నే . । మో । ॥ విందు బూచి ॥

అ ప . ప మగా । పా । పదదద ॥ సా . సా । సా । సా ॥
. . యిం । దు । వ ॥ ద . న । యిం । టి ॥

ద స । సద సారిస । దసాని దద ॥ ద పదా స నిద నిప । పా ద దపమా ।
. ముం । ద . । ర ॥ నెం । తో . . ।

పమపమ ॥ పా దస దరిసస దపా । ప పమగ । గ రిమరి ॥ సా
. ॥ విం . । త । గా . ॥ .

॥ విందు బూచి ॥

చ. స స । గ రిరిమ । గా . ॥ గా । గా । మగమరి ॥
. కు లు । కు . । చు ॥ ను । పా . । ల . ॥

రి గ ప । పా మ పదపా । మపామ గగ ॥ గరిగా . పమగ మరి । రిమరి రిస ।
. . కు డి । గె । తి ॥ రి గి । నే . . ।

సా . ॥ సా రిమగా । సా . । సా ధ ॥ సారిగాస । రి . । రి ॥
. . ॥ క ల । క । ల ॥ మ ని । పై । డి ॥

రి రి ప । పమపద పదసా । దపా ॥ పపమగా మగ రి । రి మరి । సా ॥
. . గం . । ట . . . . । ప . ॥ లి . . కి . । నే . . । . . . ॥

సా ప పమగ । పా । ప దదద ॥ దసాసా । సా । సా ॥
మొ ల । ను । న్న ॥ నె రి । కో । క ॥

సా ద స । స ద సరిసా । దసానిద ద ॥
ము డి । యి . । . ప్పు ॥

దపదా స నిద ెప । పాపా । పా ద దపమా ॥
డు . । వ ద । లీ ॥

పమపమ ప ద । దా రీ । సా ॥ స ని దా నిసాని దా । దనిదా ద నిపా । పమపమ ॥
నే యిల । లో । న ॥ యీా । శ కు । న ॥

పా రి మ । పాదస దరిసని । ద పా ॥ ప మ గా మపామ గ । గమగా గామరి ॥
ము లెవ । రి । కై ॥ య్యా । న ॥

రిమరిమ రిస ॥ సా
॥ మ్మా విందుబూచి ॥

**అవతారిక**

స్వీయ, మధ్య ప్రేమగర్వితయగు ఈ నాయిక తనస్వామి చక్కదనము చెప్పుకొని మురిసిపోవుచు, 'తెలిదమ్మిరేకు కన్నులమరువాడే, చెరకువిల్తునిగన్న దొరవలెనున్నాడే, మెరుగు చామనచాయ మేనమరువాడే, పాదలు కెందామరల పెంపొదవు పదములవాడే, కొదమ సింగపు నడుము కొమరమరువాడే' అని యనుకొనుచున్నది ఈపదము పూర్తిగా చదువుకొను చున్నప్పుడు పోతనామాత్యులవారి 'నల్లనివాడు, పద్మనయనంబులవాడు' మొదలగు పద్యములు మన మనోవీథులలో మెరుపులవలె తళుక్కుమనుచుండును

రాగం - యదుకులకాంభోజి - ఆదితాళం

ప ఎంతచక్కనివాడే నా సామి వీడు _ ఎంతచక్కనివాడే

అ ప • ఇంతి మువ్వ గోపాలుడు సంతతము నామదికి
సంతోషము చేసేనే ॥ ఎంత ॥

చ : మొలక నవ్వులవాడె - ముద్దుమాటలవాడె
తళుకు చెక్కు టద్దములవాడే
తలిరాకుజిగిదెగడ - దగుమోవిగలవాడె
తెలిదమ్మిరేకు క - న్నులు అమరువాడే ॥ ఎంత ॥

2 చిరుతప్రాయమువాడె - చెలువొందు విదియచం
దురు గేరు నొసలచే - మెరయువాడే
చెరకు విల్తునిగన్న - దొరవలెనున్నాడే
మెరుగు చామనచాయ - మే నమరువాడే ॥ ఎంత ॥

3 పొదలు కెందామరల పెం - పొదవు పదములవాడే
కొదమ సింగపు నడుము - కొమరమరువాడే
మదకరి కరముల - మురువుచేతులవాడే
సుదతి మువ్వగోపాలుడౌత - సొగసుగలవాడే ॥ ఎంత ॥

ప. స రి గస రీ గా । మగ మ పామ । గామరి రి మరీ ॥
ఎం త చక్క । ని వా । డే ॥

స స స నిపా ధాసా । స రిగా సరి । రి మపా ॥
నా సా మి । వీ । డు ॥

రి మ పా ద సా సనిదా । నిదపా ప మగా । మగరి రి మరీ ॥
ఎం త చక్క । ని . వా । . డే ॥

అ ప సద ని సాసా సా ని । ద ని సారిస ని సాని । దానిప ద పమా ॥
యిం తి ము వ్వ । గో . పా । లు డు ॥

స రి మా మా మా । మ గామ పా । పాదప మప పద ॥
సం త త ము । నా . . మ । ది . . కి . ॥

ప రి మ పా దస దరిసస పా । ప మగా మపామ । గామరి రి మరీ ॥ స
సం తో . ష । ము . చే । సే నే ॥ ఎంత ॥

చ స రి మామ మ గామ । పాపా । ద పమా పద ॥
మొ ల క న వ్వు । ల వా । డే ॥
ప రి మ పా ద సా స నిదా । నిదపా ప మగా । మగరి రి మరీ ॥
ము ద్దు మా ట . । ల వా । డే ॥
స స రి సా స నిపా ధా । స రిగ స । రి రి ॥
త ళు కు చె క్కు । ట ద్ద । ము ల ॥
రి మ పా ద సాదప । పమగా మగరీ । రిమరీ సా ॥
వా । డే । ॥
స రి మా మా మగామ । పాపా । దపమా పా ॥
త లి రా కు జి । గి తె । గ డ ॥
రి మ పా ద సా సనిదా । నిదపా పమగా । మగరీ రిమరీ ॥
ద గు మో వి గ । ల వా . । డే ॥
ద ని సాసా సా ని । ద ని సారిస నిసాని । దానిప దపమా ॥
తె లి ద మ్మి రే । కు క । న్ను లు ॥
ప రి మ పా దస దరిసస పా । ప మగా మపామ । గామరి రిమరీ ॥
. అ మ రు వా । డే . । ॥
స సనిపా ధాసా । సరిగా సరి । రి మపా ॥
. నా సా . మి । వీ । డు ॥ . ఎంత ॥

**అవతారిక**

నాయిక సామాన్య తనయందు మక్కువపడిన గోపాలగిరి చెన్నుడైన మువ్వ గోపాలునివద్ద కొంత పైడినిగ్రహించియు అతనికి తనయిల్లు చెప్పక తప్పించుకొని అలక్ష్యముగా వచ్చినది ఆమెను 'హెచ్చుకొద్దు లెరుగ వలదా ? యెవ్వరంట యున్నావే, గోపాలగిరి చెన్నుడే ! వీడు ' అని చెలి మందలించుచున్నది ఈ పదము అచ్చుపుస్తకములలో శంకరాభరణ రాగమని యున్నది మా పాఠము యదుకుల కాంభోజి

**రాగం - యదుకులకాంభోజి - ఆదితాళం**

ప. చెల్లెబో పాలగిరి - చెన్నుడు వీడుకొమ్మా !

అ ప ఎల్ల లోకము లిత - డేలు వనగా విన వా ॥ చెల్లెబో ॥

చ. పరిగె వానిచేతిపైడి - పట్టిన దానవా యింటి
గురుతు చెప్పవద్దా యెంత - సరసురాలవె కొమ్మా !

గురిగాడుగనుక సి - గ్గున నెవ్వరి నడుగక
వెరచీ సందుకాసందుకు - తిరుగగా తోడితెచ్చితి ॥ చెల్లెబో ॥

2 వచ్చినదాక తల - వాకిట నీవై నాను
నెచ్చెలులై న నుండితే - వేరమటవె కొమ్మా
యిచ్చిన పైడిచేతికి - వచ్చినదెచాలునటవే
హెచ్చుకొద్దు లెరుగవలదా - యెవరంటయున్నావే ॥ చెలెబో ॥

3 శాలరో మువ్వ గో - పాలుడై న చక్కని
పాలగిరి చెన్నడు నీ - పాలగల్గెనమ్మా
ఏలరేపు వచ్చేనంటే - యింతై న సమ్మతించక
యేల రావద్దంటివే ని - న్నేమందునే చెలియ ! ॥ చెల్లెబో ॥

ప: రిమగా సా సా ధ । సా రి గస । రీ రీ ॥
చె ల్లె బో । పా . . ల । గి రి ॥
స రి రి మపద సా సనిదా । నిదపా పమగా । రిమరీ సా ॥
చె న్ను డు నీ । డు కొ । మ్మా ॥ చెలెబో ॥

అ. ప దాదా ద ని సారిస నిసాని । దా నిప ద పమా । పా ॥
ఎ ల్ల లో . క । ము . లి త। డు ॥
రి మ పాదస ద రిసస దపా । పమగా మపామ । గా మరి రిస ॥
ఏ లు న న గా . । వి . న . । వా .. ॥ చెల్లెబో ॥

చ. గ మ గా గా మగ । గ మ పాదప మగ । గామరి రీ ॥
పరిగె వాని. । చే తి । పై డి ॥
మ గ సా సా సా ధ । సా రి గ స । రీ రీ ॥
ప ట్టిన దా । న .వా । యింటి ॥
స రి మా గ మ పా । మాపద । ప ప ప మ ॥
గురుతు చె ప్ప । వ ద్ద । ఎం త ॥
రి మ ప ద సా సనిదా । నిదపా పమగా । రిమరీ సా ॥
స ర సు రా ల । వే క్లో । . మ్మా ॥
గ మ గా గా మ గ । గ మ పాదప మగ । గామరి రీ ॥
. గు రి గా డు గ । ను క । సి . . ॥
. మ గ సా సా సా ధ । సా రి గ స । రి రీ ॥
గ్గు న నె వ్వ రి । న డు । గ క ॥
ద ద దా ద ని సారిస ని సాని । దానిప ద పమా । పా పా ॥
వె ర చీ సం దు . । కా సం । దు కు ॥
రి మ పా దస ద రిసస ద పా । ప మగా మ పామ । గా మరి రి స ॥
తి రు గ గ తో । డి తె । చ్చి తి ॥ చెల్లబో ॥

**అవతారిక :**

ఉత్తమ నాయికయగు ఈమె స్వీయ ప్రౌఢ నాయకుడు కోపగించుకొన్నట్లు నటించి, ఈమె చెంతకువచ్చి కోపమును తీర్చబోగా, ఆమెను లాలించిన విధము ఈ పదము నందలి యితివృత్తము ఇందుగల చరణములలో 'అలుక దీర్చగబోతే అలుకలో అలుకాయెనే' అని, 'అక్కరో! నే వానికి మ్రొక్కి వేడుకోబోతే మ్రొక్కులో మ్రొక్కాయెనే' అని, క్షేత్రజ్ఞులు ఇటువంటి సందర్భములు మూడిటిని అతి మనోజ్ఞముగా చెప్పినారు అచ్చుపుస్తక ములలో ఈ పదము కాంభోజి రాగమని యున్నది మా పాఠము ద్విజావంతి

ఈ ద్విజావంతి అతి ప్రాచీనములగు భాషాంగ రాగములలో నొకటి రక్తి రాగము స రి మ గ మ ప ద ని సా స ని ద ప మ గ రి గ రి స — అనునవి ఆరోహణావరోహణములు. ఇది ఇప్పటి 28 వ మేళమగు హరికాంభోజి జన్యము వెంకటమఖి సంప్రదాయమునకూడా ద్విజావంతి రాగమును ఇదియే విధముగా చెప్పియున్నారు ఇది దేశీయరాగమైనను కావచ్చును. 'రి గ రి సా' అనునప్పుడు సాధారణగాంధారము పలుకుచున్నది 'రి గ మ పా' — 'రి మ ప ద సా' — 'ద ని సా రి స' అనునవి రాగమును వ్యక్తీకరించుప్రయోగములు 'రి గ రి సా' — 'రి గ మ గ రి సా' — అను ప్రయోగములలోగల గాంధారము సాధారణగాంధారమే నిజమునకు ఈ రాగమునందు శహాన, యదుకులకాంభోజి, భైరవి రాగముల ఛాయలు సందర్భాను సారముగా కలుపుకొనుచురావలెను ఆహిరి, ఆసావేరి మొదలయిన రాగములవలె యిదియు సంగీతపరంపరను యథాతథముగా తెలుసుకొని పరిరక్షించుకొను విద్వాంసులవద్ద అభ్యసించవలసినదే వ్రాసినదానిని చదువుకొని అభ్యసించుటకు అంతగా అనువైన రాగముకాదు

